# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1959

ు 36 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1959


| | | |
|---|---|---|
| విశ్వనాథమధ్యాక్కరలు: శ్రీగిరి శతకము | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | |
| శివశంకరుల వకుళమాలిక | శ్రీ వారణాసి రామమూర్తి | 3 |
| అమృతుడు | శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం ... | 11 |
| దుర్ముహూర్త ఫలము | శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు | 19 |
| వాంఛానుమితి | శ్రీ సనత్కుమార ... | 26 |
| భాష : వ్యాకరణం | శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి ... | 28 |
| శ్రావణంలో ఒక రాత్రి | శ్రీ హారీత శివశర్మ | 33 |
| ధర్మము - ధర్మి : గుణము - గుణి | శ్రీ వేలూరి శివరామశాస్త్రి ... | 34 |
| బాష్పప్రసూనములు | శ్రీ మోటూరి వేంకటరావు ... | 38 |
| సంస్కృత : సాహిత్యము ముస్లిముల సేవ | శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ... | 39 |
| సూర్యతనయా స్తుతి | శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు | 44 |
| వైదిక కావ్యాలలో జైనుల కైవాడం | శ్రీ కె. కుశాలప్పగౌడ ... | 46 |
| విడిపోతున్న రెండు సంస్కృతులు | శ్రీ సి. పి. స్నో ... | 50 |
| లక్షణసార సంగ్రహము | శ్రీ రావూరి దొరసామి శర్మ ... | 58 |
| మగువ మనసు | శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి | 64 |
| కోకిలమ్మ పెళ్ళి | శ్రీ సాళ్వ కష్ణమూర్తి ... | 73 |
| రేపు మన దే-మరి | శ్రీ హ స జ | 78 |
| గోవిందవాక్యాలలోని చరిత్రాంశాలు | శ్రీ కొత్త భావయ్యచౌదరి | 79 |
| సాహితీ సుగతుని స్వాగతం | రామచంద్ర | 83 |
| సామ్రాట్టు-అశోక చరిత్ర | శ్రీ నిడుదవోలు వేంకటరావు | 88 |
| కలగూరగంప | | 92 |
| గ్రంథవిమర్శనము | | 95 |
| వార్తలు | | 100 |


## అక్టోబర్ సంచికలో


| | |
|---|---|
| గయశాసనము జయశాసనమే | శ్రీ నేలటూరి వెంకటరమణయ్య |
| నన్నెచోడుని వర్ణనలు | శ్రీమతి వి. రాజేశ్వరి |
| ధ్వని - వర్ణం | శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి |
| తెలుగు తొలికావ్యము కవిజనాశ్రయము | శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి |
| కథకళి-సాహిత్యము | శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు |
| తెనుగు శాసనములలో అన్యదేశ్యాలు | శ్రీ ఎం. సత్యనారాయణ |
| కేరళప్రభుత్వపు గ్రహచారము | శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు |
| సోవియట్‌లో ఆర్థికప్రణాళికలు | శ్రీ బులుసు వేంకట సుబ్బారావు |
| దమయంతి వాక్చాతుర్యము | శ్రీ కొండూరి రాఘవాచార్యులు |

# మనవి మాటలు

దారేషణ పుత్రేషణ ధనేషణాను ఈషణత్రయమన్నారు మనతత్త్వవేత్తలు. కీర్తికాంక్షను కూడా ఈ ఈషణాల్లో చేర్చి ఈషణచతుష్టయమంటే బాగుండేది.

ఈ కీర్తి కాంక్ష ఇటీవల సాహిత్యరంగంలో మరీ దాహంగా, లాలసగా పరిణమించిందనడం అతిశయోక్తి కాదు. కీర్తిషణ రచయితలను ఈషణత్రయం కన్నా బలంగా పెడదారికి లాగుతున్నదన్నా తప్పు కాదు. సాహిత్యాన్ని తనజీవికా సౌకర్యానికి మూలబంధంగా ఉపయోగించుకొందామన్న తలపు పొటమరించినప్పుడే ఈ కీర్తిదాహం దహించివేయసాగుతుంది.

ఏవో రణగొణ ధ్వనుల రచనలు చేయడం, పదిమంది పండితుల శుశ్రూష చేసి పరిచయ వాక్యాలు వ్రాయించుకోవడం, పదవిలో ఉన్న ఏ పెద్దమనిషినో మొగమోటపెట్టించి సభ ఏర్పాటుచేయడం, తమ రచనలను మరొక ఉన్నతాధికారితో ఆవిష్కరింపజేయడం, నలుగురితోను పలువిధాలుగా పొగడికలు పొందడం, పత్రికల వారిని ప్రాధేయపడి వారి పత్రికలలో ఆవిష్కరణ సభావిశేషాలు ముచ్చటైన శీర్షికలతో ముద్రింపజేసుకోవడం—నేడు మితిమీరిపోతున్నది.

ప్రజల దృష్టి ఆకర్షించడానికి దేనికైనా ప్రచారం అవసరమన్నమాట నిజమే; సరుకు నాణెం ఎలాటిదైనా ప్రచారం ముఖ్యమన్నది సామాన్య వాణిజ్యసూత్రమన్నమాటా వాస్తవమే. కాని, 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు కదా అభియుక్తులు.

పూర్వం కవులు, పండితులు ఏ రాజునో, తత్సామంతునినో ఆశ్రయించి ప్రచారం చేసుకోలేదా తమ కృతులకు? చేసుకున్నారు; వారూ ఆదరించారు. అయితే, తమ రచన ఉత్తమ శ్లోకుని ఆదరం పొందాలని రచయితలూ ఆశించేవారు; అలాటి రచనలను స్వీకరించి ధన్యుల మయ్యామని ఆశ్రితులూ సంతసించేవారు. అప్పటికీ, ఇప్పటికీ ఇదే భేదం. సహృదయుడైన అధిపుడో, ధనాధిపుడో రచయితను కోరి ప్రార్థించి కృతికన్యను స్వీకరించేవాడు అప్పుడు. రచయితే తన రచనల సారాసారాలు గుర్తెరుగక వాటిని భుజానో నెత్తినో వేసుకుని అధికారుల అనుగ్రహం కోసం, అభిప్రాయాలకోసం అంగలార్చడం ఇప్పుడు. అందువల్లనే సాహిత్యవేత్తలన్నా, సాహిత్య సభలన్నా ప్రచార ప్రహసనాలని ఈసడించే స్థితి ఏర్పడింది. బెర్నార్డ్‌షాకే కాబోలు—ఒకసారి ఒకరి రచనలను విని అభిప్రాయం ప్రకటించే అవసరం వచ్చిందట. కొంతసేపు విన్నతర్వాత షా తన గది కిటికీ తెరిచాడట "పక్కవారింటికి కూడా నా రచనా సౌరభం పాకాలనేనా మీరు కిటికీ తెరిచింది?" అని ఆ రచయిత ప్రశ్నించాడట. "అబ్బే! నిద్రపోయే ముందు నేను కిటికీ తెరుస్తాను" అని షా సమాధానమిచ్చాడట.

రచనలో సత్తా ఉంటే, రచన ఎన్నటికైనా ప్రజల హృదయాలలో నివసించకపోదు. ఎందరి పద్యాలు, గేయాలు, వాక్యాలు మనలో ఆబాలగోపాలం అనుదిన వ్యవహృతాలు కావడంలేదు? అదే రచయిత కీర్తి. ఎమిలీజోలా రచనలు ప్రచురించిన వెంటనే ప్రభుత్వ గూఢ చారులు తేనెటీగల్లా ముసిరేవారట వాటిపైన. అదే రచయిత శక్తి.

వీలైనంత త్వరలో, చిటికెలో చిరయశస్సును ఆర్జించుదామనే అపోహలు తొలగించుకోవడం, ప్రతి రచయితకూ అవసరం. జీవితపు నిమ్నోన్నతాలు చూచి, నిరతిశయానందానుభూతి పొందిన రచయిత రచనలు ఎప్పుడూ మన్నన పొందుతాయి ప్రచారం, పరిచారం లేకనే. రచయితలకు—గుండె చేవగల రచయితలకు అవసరమైంది గుండె నిబ్బరం. ఈ నిబ్బరమే భవభూతితో

"ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ."

అన్న అమరవాక్యాలు పలికించింది.

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఒకచోటఁ గూర్చుండి నిన్ను నూహింతునో యన్న నన్ను
నొకచోటఁ గూర్చుండనీరు కవినైన యొకదోష మొప్పి
యొకచోటఁ గూర్చుండనీదు సంసార మో స్వామి పూర్వ
సుకృతంబు లేదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఈమేని త్రాసుతోఁ దూచుచున్నాన యీవైపు మొగ్గు
స్వామి క్రమమ్ముగాఁ దగ్గిపోయె భవద్దిశ కొగ్గి
యీమేను కాకిక బరువు లేదాయె నీవె తూగెదవు
సోమకిరీట! శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

మున్ను లింగాకారమైనఁ గన్నులుమూసినయంతఁ
గన్నుంబొమలమధ్య జోతిమాదిరిఁ గానిపించెడిది
యున్న తెలివిపోయెఁ జదువవేయగా నొగి నన్నయట్లు
సున్నమైనావు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

అచ్చపుందనములోఁ గరుణ దిగజారెనన్న నీమాట
తెచ్చిన గుండెకుఁ గరగి కన్నీరు దిగఁజారు నింత
పచ్చియైన మిగుల్చుపాటియున్నావు బ్రదుకులోపలకుఁ
జొచ్చినదారవు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

గవుసెనపడిన నీమూర్తి కనక నూకల కేడ్చి యేడ్చి
తవుటి కేడ్చిన యట్లుగాఁగఁ జివరకుఁ దమరి నూహించి
యవియు గుంజియమైన లేనియట్లుగా నగుదునో యంచు
సువిపాట యయ్యె శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నీ వచ్చెచ్చుటో నాదు శిరసుపై నెగడుచుంటివని
యావేగపడుకొంచు నాదు మేనిలో నాడు నెత్తురులు
నో విశ్వనాథ తా మైదుగ ప్రవహించుచున్నవి పైకిఁ
గ్రోవిచిమ్ముగతి శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

మరియు వైరాగ్యంబు మరియు దేహాభిమానంబు మరియు
మరియు వైరాగ్యంబు మరియు మరియు నిన్ను మరుగుచొచ్చుటయు
విరిసిపోదునో యన్నభీతి నీవు నన్ను విడఁద్రొక్కుదనియు
సురిగిపోయెదను శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

ఒకటి నిశ్చయ మయ్యె బయట నెచ్చటనుండియో నీవు
ప్రకట శైవానేక కథలలోని రూపాలతో రావు
ప్రకట మహాత్మ్యంబు ఫట్టుమంచును బగిలి రావలయు
సుకమొ దుఃఖమొ్మ శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

మేలుకొన్నప్పుడు పట్టుకొంచుంటి మెదలకుండంగ
నీలలోహిత మేలుకొనెడు కోరికల్ నిద్రించుచుండ
పాలించవే నాకు నిద్రలేకుండ భసితరమ్యాంగ
శూలాభిషంగ శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

కలితకపాల హారా! మహాభావ్యకారమంజీర!
దళితాఘసంతాన! పరిణతస్వీన్న దర్పాంధకార !
మిళితాంధకార వైరిఘటితోత్క్షిప్త మీనాన్మనోజ్ఞ
సులలితాకార శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

ఈ మేను కర్పూరమట్లు హరియింప నీకువే నీకు
స్వామి నీరాజనం బెత్తినట్లుగా జ్వలియింపనీవె
కోమల పరిమళవ్యాప్త దశదిశా కుహరంబుగాఁగ
సోమాంగభంగ శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

నినుఁజూడకుండగా మాటనేర్పుచే నినుఁ జూచినట్లై
నినుచు పూర్వ కవీంద్రవాక్యసరణి వర్ణించుట యెల్ల
నను నేన మోసంబుచేసికొనుటకోనాఁగ నాగాహి
సునిభృతబంధ శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

నిదురమెఱుంగని నీవు నాలోన నిదురపోయెదవు
కుదిలించి గగ్గోలుచేసినను మేలుకోవు నిజంబు
నిదురైన మేల్కొల్పవచ్చు నీ దొంగనిద్దురకేమి
కొదచేసి ఫలము శ్రీశైలమల్లికార్జున మహాలింగ !

# శివశంకరుల వకుళమాలిక

శ్రీ వారణాసి రామమూర్తి

ప్రేమ ఫాంస్ మేఁ ఫఁసి మరై సోఈ జియై సదాహి
ప్రేమ పరమ జానే బినా, మరి కోవు జీవత నాహి
ప్రేమ వారుణీ ఛానికై, వరున భయే జలధీశ్
ప్రేమ హీఁ సో విషపాన కరి, పూజేజాత గిరీశ్.

—రసఖాన్.

వలపుటుచ్చులకు జిక్కి, అసువుల బాసిన యతడే మృతజీవి. అమృతతుల్యమగు ప్రేమతత్త్వమును గ్రహింపజాలనివాఁ డతడు జీవన్మృతుడే. ప్రేమ వారుణి మత్తిల ద్రావి, వరుణదేవుడు జలాధిపత్యము సంపాదించినాడు. ప్రేమపురస్కృతమగు హాలాహలపానమే గిరిశుని సర్వలోక పూజ్యుని గావించినది. అట్టి ప్రేమ మార్గము:

కమల తంతుసోఁ ఛీన్ అరు కఠిన ఖడ్గ కీ ధార్
అతి సూధో టేఢో బహురి ప్రేమపంథ అనియార్.

తామరతూండ్లలోని తంతువులకన్న మృదువైనది. ఖడ్గధారను మించిన కాఠిన్యము కలది. అత్యంతము వక్రము కానిదియు కాదు; అది విలక్షణమైనది.

కబీర్, మీరాబాయి, రసఖాన్, ఘనానంద, హరిశ్చంద్ర ప్రభృతి హిందీ కవులచే నిర్వచింపబడి, జీవిత సర్వస్వముగా ననుష్ఠింపబడిన ప్రేమతత్త్వము ఆచార్య శ్రీ శివశంకరస్వామివారి అపూర్వ రచనయగు "వకుళమాలిక"లో సత్యశివసుందరముగా నిరూపితమైనది.

"ప్రేమ నగర కీ రాహ కఠిన హై"—ప్రేమ నగరమునకు మార్గము కఠినమైనది—అను మీరాబాయి వాక్యము ఈ గీతికాస్వగతమునకు మకుటము. సనాతన భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మ యనదగు నీ సత్యమును ఈ కవితిలకుడు తన కృతి ద్వారమున నెట్లు సాధించినదియు విచారించుటకు పూర్వమీ కావ్య బాహ్యరూపమును వివరించుట యుచితము.

కవి యుద్దేశించిన తత్త్వనిరూపణ మెంత మధురోదాత్తమో, అందులకు స్వీకరించిన రచనారూపముకూడ తదనుగుణముగా ముగ్ధమనోహరమై, కర్ణమంజులమైన గీతికాస్వగతము. ఇట్టి విధానమునకు కవిని పురికొల్పినది ఆంగ్ల సాహిత్యము. అందును స్ఫుటమై సుస్పష్టమైన రాబర్టు బ్రౌనింగు Dramatic Monologues (గీతికాస్వగతముల) వలన ఈ కవి ప్రభావితుడైనట్లు తోచును. అమెరికాఖండములోని బ్యాట్రిస్ హియర్ ఫోర్డు, రూత్ డేసర్, కార్నీలియా స్కిన్నర్ మొదలగువారు ఈ రచనావిధానమును నాటకకళను ఉన్నత స్థాయికి కొనివచ్చిరి. అధునాతన కళారాధకుల ప్రకారము ఈ గీతికాస్వగతమున ఒక్కడే అభినేత స్వగతభాషణమువలన కొందఱు వ్యక్తుల శీలస్వభావములను వ్యక్తము కావించును. ఒక్కొక్కప్పుడు కొన్ని సన్నివేశముల వర్ణనలుసయితము ఈ గీతికాస్వగతమునకు వర్ణ్యవిషయము కావచ్చును కాని ఎట్టిస్థితియందును కవి తన వాణిని అందులో స్వయముగా వినుపింప వలనుపడదు. తానేదైన సందేశము ఈయదలచినచో దానిని ఆయా పాత్రల ముఖముననే ప్రకటింపవలయును.

బ్రౌనింగువల్లనే ఈ కవియు ఇట్టి నూతనరచనా విధానమునకు ఆంధ్ర సాహిత్యమున శ్రీకారము చుట్టినాడు. ఇంతియే కాక పద్య గీతాత్మకమైనకవితను కొంగ్రొత్తనాటకరీతుల నడపి, ఎన్నియో నూతన ప్రయోగములు నెరపిన శేముషీ సమన్వితుడు.

రచనలలో ఇంత బహుళముగా నాటకీయత గోచరించుటకు కారణము కవి జీవితమే. ఆ జీవితము అపూర్వ సన్నివేశ సంఘటన విలసితమగు మహానాటకము. వ్యక్తిగతముగ కవి నెరిగినవారల కిది సుపరిచితము. అపరిచితులను సయితము కవి నాటకరమ్యమగు నిజవ్యక్తిత్వముచే ముగ్ధులను కావించును. సౌశీల్యము, రసార్ద్రహృదయము, స్మితపూర్వాభిభాషణము, వచోవైదగ్ధ్యము, హస్తనేత్ర విన్యాసము, ఉత్సాహపు పెంపు, మాటల ఇంపు, నడకసొంపు, మొదలగునవన్నియు అకర్షణీయములై చూచువారల కానందము గొలుపుచుండును.

మఱియొక విషయమునగూడ ఈ కవి బ్రౌనింగును పోలియున్నాడు. ఇరువురిలోను వ్యక్తిగతాభిప్రాయములు బలీయములు. ప్రపంచములోని ప్రతివస్తువును

ఎంతేని సానుభూతితో దర్శించి, సత్యముగా అవగతము చేసికొని న్యాయముగా ప్రతిపాదించగల సహృదయులు. ఇరువురును 'కవిః కవీనాం' వంటివారు. వీరల గ్రొంగ్రొత్తపోకడలు, భావములు, సమకాలికుల నెందఱనో ప్రభావితులను చేసి, సాహిత్యరీతుల రూపురేఖలను తీర్చి దిద్దినవి. ఈ కవి కవిస్రష్ట, పరిష్కర్త.

అమలినప్రేమతత్త్వ నిరూపణముతో బాటు మానవప్రకృతిలోని వైచిత్రిని చిత్రించుటయే ప్రధానాశముగా ఈ కవి గ్రహించినాడు. ఈ కవి బ్రౌనింగు నుండి గ్రహించినది Dramatic Monologue (గీతికాస్వగతము) రూపముమాత్రమే. ప్రేమతత్త్వ నిరూపణము, వకుళమాలికా కల్పనము, పాత్ర చిత్రణము, భావసౌకుమార్యము, వర్ణనసౌందర్యము, భాషాపటిమ, ఔచిత్యనిర్వహణము, కావ్యసందేశము— ఒక్కమాటలో నిజకావ్య దేహాత్మలను తన సంస్కార ప్రతిభావ్యుత్పత్తుల ఔన్నత్యములకు తగినవిధమున నే మూసలో పోసి కమ్మచ్చున లాగినాడు.

## 2

ఈ చిన్ని నాటికావస్తు కల్పనమే అపూర్వము. అందు వకుళమాలికావియోగము తేనెతియ్యముల జాలువాఱచేయును. ఎంత నవనీతకోమలములు, సుందర సుకుమారములు సహృదయస్పందన సమర్థములు అగు సూక్ష్మకల్పనలకు కవిహృదయము పుట్టినిల్లు అయినదని వెల్లడికాగలదు. కవికులగురువు కాళిదాసు దివ్యకల్పనా జగత్తులో 'ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాత' మగు మేఘశకలము దూరదేశప్రవాసక్లేశమున బనరి వందురుచున్న రెండుహృదయములకు సూక్ష్మకోమల మగు ప్రణయగ్రంధిబంధమై సచేతనమై అవభాసించినది. అట్లయ్యును ఆ ప్రావృడంభోదము ముగ్ధమౌన ముఖరమధురము కాలేదు. ప్రణయతాపమున వాడి వత్తలయిపోవు నాజంట విధమునకు కరగి, తన వచశ్శీకరములచే వారల నోదార్చలేకపోయిన దా మొగిలు. సహ్యాకునకు గూఢ కామార్తచే నది చేతనముగా, వప్రక్రీడా చతురముగా గోచరించినది. ఆ మహాకవి సృష్టిలో స్వయముగా మేఘమునకు చైతన్యసంపాదన కాలేదు.

శ్రీ శివశంకరులమార్గము విలక్షణమైనది. ఈయన దృష్టిలో సమస్తవస్తువులు చైతన్య విలసితములే; సత్య స్పందసుందరములే. జడమునకు చైతన్యమునకు నిందు తావు కలదు. సమస్తము ప్రేమ త్యాగ సౌందర్యముల నుపాసించుచు సౌహార్ద సహానుభూతులను స్రవింపజేయు ప్రసవము. ప్రేమ సౌందర్యములకు పరమావధి త్యాగము—ఆత్మ సమర్పణము. ఆశ్లేషసుందరములు కాని నాకు త్యాగప్రేమములు త్యాజ్యములు. తత్పరతతో ప్రయత్నించుచున్నను ప్రేమోపలబ్ధి కష్టసాధ్యము. ప్రేమ నగరకీ రాహ కఠిన హై. తన కత్యంతప్రియ మైన వకుళప్రసూనమును సాధనముగా గొని, కవి శివసుందరముగ వ్యక్తము కావించినాడు.

ప్రియానిరాసమునకు గురియైన యొకానొక యువకుని కరుణకోమల ప్రణయజీవితమునకు సాక్షిగా నుండి వకుళమాలిక ఆ ప్రేమోపాసి—అమలినాత్మ సమర్పణ భావపూతము, ప్రతిఫలాపేక్షారహితము నగు ప్రేమోదంతమును మధురమోహనముగా గీతికా స్వగత రూపమున నాలాపించును. జడ మగు వకుళప్రసవమునకు ఈవిధముగా కవి చైతన్య మిచ్చి, తీయని తేట తెలుగువాణి నిచ్చి, సచేతను లగు నాయికానాయకులను మౌనముద్రాంకితులను చేసి వదలినాడు; నాయికానాయకుల స్వరూపస్వభావ వర్ణనముతోపాటు ప్రేమ తత్త్వమును నిరూపించినాడు. తన జీవితాదర్శమకరందమును స్వీయభావసౌరభముల నెన్నిటినో ఆ ప్రసవముఖమున వినిర్గతము చేసినాడు. గీతికాదిలోను అంతమందును నిజనిర్ణయమును సైతము—

పుష్పమాలికగానె పుట్టియుండన యేని
పూబోణిగా నేను పుట్ట గల్గితి నేని
అతని నే వరియించి ఆత్మవల్లభునిగా
కౌగిలింతు తదీయ కంఠమే నే వేళ !—

అన్న, ప్రేమతపస్వి ఎట్టివారికైనను వందనీయుడు, ఆలింగనార్హుడు అని కంఠోక్తము కావించినాడు.

Robert Browinng మహాకవి Ring and the Book కావ్యములో స్వీయాభిప్రాయమును పాంపీలియా నిర్దోషిత్వమును ఉద్ఘోషించుతరి, న్యాయాధిపతి స్థానము నలంకరించిన జగద్గురువు (Pope) ద్వారా ప్రకటించినాడు: "My Rose I gather for the breast of God !"

కవిదృష్టిలో సృష్టియందలి ప్రతివస్తువు చైతన్యవిలసిత మనుటకు తార్కాణముగా రచనాప్రారంభమున వకుళమాలికా స్వీయపరిచయ వాక్కుల నాకర్ణింపదగును.

# శివశంకరుల వకుళమాలిక

"ఎంచబోకుడు నన్ను నెందుపూదండగా—
ప్రాణ మున్నది, నిండుప్రాణ మున్నది నాకు.
వింతమాపుఁతోడ వీక్షింతు రేమిటికి!
ప్రసవదామమ్మునకు ప్రాణ ముండగ రాదో?
ప్రాణ ముండుటె కాదు, ప్రమదమో దుఃఖమో
కలుగుచుండును నాకు కారణమ్మునుబట్టి."

అంతియే కాదు—

"బాల్యయౌవనజరా ప్రముఖభేదము లెల్ల
సక్రమమ్ముగ నాకు సంక్రమించిన వయ్య!"

పంచేంద్రియజ్ఞానము నయితము మాలికకు పూర్ణముగా కలిగినది.

"ఎంత చక్కని వెలుతు, రెంత చక్కని వెలుతు,
రెంత చల్లనిగాలి ఎంత చల్లనిగాలి!
ఈకరస్పర్శ నేనెఱిగినది కాదు మును:
చిగురుటాకును బోలు చేయి నానాథునిది.
అతనిహస్తము సోకినంత నే నామేన
అంకురించును పులక లానందగరిమాన!"

మాలిక నాయకునకు నమ్మినసఖి, మనసులోనిమనసు:

నాస్వామి విలాటి నవనీతహృదయుండో—
ఆప్తురాలి విధాన నాదరించెడి వాడు
న్వాను సుఖదుఃఖాలు చెప్పుచుండెడి వాడు:
ఏను పోయిన నాతి డెంత వెత నొందునో!

కవి కౌశలమున పొగడదండ నిజకథాసూత్రమున యువకుల ప్రేమప్రసంగ ప్రసూనములు గ్రుచ్చి రమణీయ కంఠమాల సహృదయవేద్యముగా సంతరించినది. మాలిక స్వీయచరిత్రములోనే నాయకుని ప్రేమచరిత్రము నిహితమై విశదీయరాక యుండును. మాలికా జననమే అతని ప్రణయగాథకు శ్రీకారము చుట్టలేదు. అయినను పూర్వవృత్తాంతము ననువదించినది. ఇందిరాదేవి నాయిక. ఆమె చక్కనిచుక్క. నల్లకల్వలవంటి నయనాలతో విలోకించుచు, కోమలాంగులులతో అనురాగసూచి యగు అరుణసూత్రము వెంట విజనప్రదేశాన కూర్చుండి, కిన్నరీ కంఠాన గీతమాలాపించుచు మెల్లగా గ్రుచ్చినది. ఆ గీతమున ఆమె నిజప్రణయాధిదేవతయగు మాధవుని ప్రథమదర్శనగాథ నత్యంతమనోహరముగా వినిపించును. వారి ప్రేమ ప్రథమదర్శనజన్యము. అయినను అది నాయకుని పక్షమున నిత్యసత్యముగా నిరంతరముగా నిలిచినది. అతనికి ప్రేమ పవిత్రతీర్థము. ప్రియురాలు తదధిష్ఠానదేవత. ఇష్టదేవత వంద్యురాలు. 'నీ మందిరము చుట్టు' మొదలగు వాక్యములు మనఃపూర్వకముగా పలికినాడు. అందులో శరీరసంయోగమునకు స్థానము గౌణమన్నాడు.

నాయికలో ప్రేమ చంచలముగ పరిణమించినది. నాయికాస్వభావము, అత్యంతసహజముగ చిత్రింపబడినది. అట్టివారి ప్రేమలో ప్రారంభదశయందు ఒడుదుడుకులు అధికముగా కానవచ్చును. మాధవుని ప్రథమదర్శనమాత్రమున ఇందిరకు చెప్ప శక్యము కాని స్నిగ్ధభావము కలిగెనట. తలచిచూచినకొలది తత్పరత్వము హెచ్చెనట. ఈ లోకమే నవ్యకాంతులతో తోచెనట. ఆడువారల ప్రేమ అంతస్సులో నుండునను సుద్ది ఆ చంచలచిత్త నెఱ్చినది. మాధవుని పాదదాసియై ఆనందసరస్సులో అవగాహ మొనర్చుట ఎన్నటికో కదా యని యువ్విళ్లూరినది. ఆ పట్టున ఆమె భావధార వర్షాకాల ఝరీవేగము ననుకరించినది. తీవ్రధారాహతికి తట్టుకొన లేకపోయినది వకుళమాలిక. పొగడచెట్టు నీడలో నాయికా నాయకుల ప్రథమ సమాగమముతో కామినీ మానసాకర్షకాద్భుతమైన పురుషాకృతి యగు మాధవుని ప్రాపు మాలికకు లభించినది. నాటితోనే నాయికా సంబంధము దూరమైనది. ఆరేయి ఇందిర కొంత దనుక ప్రియు నానంద పఱచి—

"వకుళమాలిక యెంతో వాడిపోవక మునుపె
అర్ధాంగి నౌదు మీ కనివార్యముగ నాథ!"

అని బాస చేసి గృహాభ్యంతరములోనికి పోయినది. ప్రియురాలి ప్రేమ చిహ్నము నగు మాలికను గ్రహించి మాధవుడు ఎన్నియో సేతువులు దాటి పయనించి నిజసౌధము చేరినాడు. ఇనుమడించిన ఉత్కంఠతో చక్కదనాల చందువాపెట్టెలో మాలికకు శయన మేర్పరచినాడు.

నాటినుండి మాలిక బయటకు కదలలేదు. ఎన్నడైన నాయకుడే ప్రియురాలివార్తలు కొనివచ్చి మాలికతో చెప్పుచుండువాడు. కొన్ని పర్యాయములు ఇందిరామాధవులు కలిసికొందురు. ద్వితీయసమావేశమున ఇందిర ప్రియునకు సంయోగ చిహ్నముగా స్వర్ణాంగుళీయక మిచ్చి ఎల్లవేళల వ్రేల ధరింపు డని చెప్పెను. కాని లోకమర్యాదను గ్రహించిన నాయకుడు పరిణయమ్మగు దాక పరు లుంగరమ్ము నా వ్రేలిపై కాంచుట న్యాయమ్ముకాదని ఎంచి వకుళమాలికకు సైదోడుగా పేటికలో నుంచినాడు. మఱల నొకనాడు

నిజసందేహములు అపనీతములు కాగా అనురాగభరముచే నాయిక గృహిణీత్వమున కంగీకరించి, నాటి కేడవరేయి ప్రియుని చేరవత్తునని ప్రమాణము చేసినది. మాలికామాధవుల అంతరంగములు ఉత్సాహమున ఉబ్బూత లూగును.

సప్తాహము గడచినను నాయకుడు రాలేదు. నాయికజాడ మాలికకు తెలియలేదు. ఉన్నట్టుండి ఒకనాడు నాయకుని ఉష్ణబాష్ప కణస్పర్శకు మాలిక కంపించును.

"ఏమి చేతు అమెమనసు ఏమొ కాని మారిపోయె,
గతమాసమునందు నిండు గంగావాహినిపోలిక
ప్రవహించెడి హృదయము ఈపట్టున హిమఖండ
మయ్యె.
భావము లేదంట తనకు పరిణయమ్ముపై నిప్పుడు
మా సమాగమమ్ము జరుగ మరల వీలులేదన్నది."

అనుచు మాధవుడు కావించు పరిదేవనమునకు మాలికకు మిన్ను విరిగి మీద పడినట్లగును. ఆ యకారణ పరివర్తనమునకు హేతువు గోచరింపదు. అయినను కొంత కాలము గడవ కుదటపడి మానసము ద్విగుణీకృతంబైన విమలానురక్తితో గ్రహింపకపోవునాయని ఆ ఇరువురు ఆసతో నుందురు.

స్త్రీ ప్రకృతియందలి రహస్యము గుర్తింపని అమాయకుడైన నాయకుడు ప్రియురాలి ననునయించుటకు మరల మరల యత్నించును. ఆజాణయు అతనిని చాల తిప్పలు పెట్టి చివరకు సుముఖి యగు నభిప్రాయము తోపచేయును. ఆయువంతయును ఆ వెఱ్ఱివాడు వకుళమాలికకు వినిపించును. మోడువారిన యుత్సాహము మరల మొలకెత్తును. అంతే! ఆ యంకురము అంకురావస్థలోనే అనంతర సమావేశమున తునిగిపోవును. అంతవరకును స్పష్టాస్పష్టముగ విరసభావము ప్రకటించుచు వచ్చుచున్న చంచలాక్షి ఆనాడు నిష్కారణముగా భావము తేటతెల్లముగ తేల్చి చెప్పును. ఏమియు నెఱుగని మాధవునిమీదనే ఆరోపణలు చేయును. ఆ ప్రేమ తపస్వి చేయునది లేక విసిగ వేసారి మొగము వ్రేలవైచి వెనుదిరుగును. కష్టసుఖములందెల్ల వేళల తోడునీడగ నిలిచిన వకుళమాలికకు భగ్నప్రణయోదంతము నివేదించును. తిరస్కృతికి గురియైనను అతని ప్రేమయందలి తీవ్రత కుంటువడదు. అమలినప్రేమ రహస్యముగ్రహించిన ఆ త్యాగమూర్తి ఆ స్థితిలో గూడ నిబ్బరించుకొని ఈ విధముగా మన స్సమాధానము కావించుకొన్నాడు

ప్రేమనగర కీ రాహ కఠిన హై
ప్రేయసికై నే నేయది యైనన్
సంతోషముతో సలుపగ నేర్తున్.
ఇష్టము లగు నా కెట్టిబాధలును-
ఆ యమసుఖమే నాయది కాదా!

అతని హృదయపులోతులనుండి వెలువడిన నిశ్చితాభిప్రాయమే అతని హృదయ నైర్మల్యమునకు త్యాగసౌందర్యమునకు, పరాకాష్ఠ నందిన ప్రేమకు ప్రబల తార్కాణము. రససిద్ధుడైన ఈకవి ప్రతిపాదింప సంకల్పించిన తత్త్వముగూడ ఇదియే.

## 4

ఇట్టి కథాంతమున చాలామందికి కష్టము తోచవచ్చును. నాయికయందా యకారణ పరివర్తనము సహజమా, సంభావ్యమా యను సందియము కలుగక పోదు. కాని తొలుత చెప్పిన విషయము గమనించినచో అట్టి సంశయములు పరిహారము కాగలవు. స్వచ్ఛప్రేమ నిరూపణముతోపాటు మానవప్రకృతిగతమగు వైచిత్రిని చిత్రించుట కవి యుద్దేశించిన ముఖ్యవిషయము. స్వచ్ఛప్రేమ ప్రతిఫలాపేక్షారహితము, ఏకోన్ముఖము, సమరసభావ సమన్వితము, త్యాగోజ్జీవితము. అందు ఒడుదుడుకులు, హానివృద్ధులు, తర్కవితర్కములు, ఆశానిరాశలు, శంకాసమాధానములు, క్రయవిక్రయ భావములు మొదలగు ద్వంద్వములకు తావే యుండదు. అట్టి ప్రేమకు తార్కాణములు చాతకము, శలభము, సారంగము. తనపై ఉపలములు వర్షించి తర్జించుచున్నను, చాతకము స్వాతిమేఘము నే యాశ్రయించును అది పిడుగుపాటునకు జడియదు. కరకాపాతమును సరకుగొనదు; వ్యాధుని బాణమునకు గురియై గంగాంబువులబడినను ముక్కు పైకెత్తియే యసువుల వీడును. దాని ప్రేమ నియమ మట్టిది. శలభము జ్వాలను ప్రేమించును. తన ప్రియుని మనసార కౌగిలింపనీయక అంతరాయము కలిగించుచు, తన్నడ్డగించు కాచగోళముల దయాశూన్యత నదియెంతేని యభిశంసించును. సారంగము ప్రియతమమగు నాదమాధుర్యమునకు సొక్కి, వేటకాని యీటెపోటు సూటిగా గ్రహించును. ఈ త్యాగమే బలిదానకాంక్షయే పవిత్రప్రేమకు పరమావధి. ఇట్టి ప్రేమయే ఈ గీతికావ్యమందు ఈ విధముగ నిరూపితమైనది. అట్లని ఆదర్శప్రతిపాదనపై కవి వాస్తవికతను బలి ఈయలేదు. మాధవుని బోలిన ప్రేమోన్మత్తులు, ఇందిర

వంటి చంచలచిత్తలు నేటి సమాజమున లేకపోలేదు. స్త్రీ ప్రకృతి సహజముగా మానవులకు సులభగ్రాహ్యము కాదు. "స్త్రీణాంతు చిత్తం పురుషస్య భాగ్యమ్." ఇందిరను బోలిన మనస్తత్త్వము స్త్రీ సమాజమున బహుళముగా కానబడదన్నను, క్వాచిత్కముగనైన ఒకానొక యసాధారణ మనస్తత్వము గ్రాహ్యము కాగలదు. మాధవునిపట్ల నామె ప్రదర్శించిన భావపరిణామమును ప్రేమ, ప్రణయమని వ్యవహరింప వలనుపడదు. దానికి స్థాయిత్వము తక్కువ. Mystery, they name is woman! ఏతదాంగ్లసూక్తికి ప్రమాణముగ ఈ పాత్ర చిత్రితమైనది. ఈవిధముగా ఆదర్శ- వాస్తవికతల స్వర్ణ సురభియోగముతో ఈ రచన మనోహరముగా రూపొందినది. తనకలావైదగ్ధ్యమును సూచించు నీ యభిప్రాయమునే కవి సంకేతప్రాయముగా సూచన చేసియుండనోపును. ప్రియాదత్తమగు నంగుళీయకమును వకుళమాలికకు తోడుగా నందువాపెట్టెలో నుంచునపుడు మాధవుని పలుకులు :

సతత పరస్పర సంసర్గవశత
సంక్రమించును గాక స్వర్ణాభ నీకు
తావి యబ్బును గాక తపనీయమునకు.

ఇందు తపనీయము నాదర్శముగా, తావిని వాస్తవముగా గ్రహించినచో రమ్యత కెట్టి లోటు కలుగ నేరదు.

రమణీయతాపాదకమగు ఉక్తివైచిత్రియే కావ్యమునకు ప్రాణప్రాయము; ఏవిషయమునైనను సూటిగా జెప్పక ఒకానొక విచ్ఛిత్తి వైదగ్ధ్యభంగీభణితితో మేళవింపజేసి కవి హృదయమును ప్రతిపాదించును. సత్కావి సూక్తిని శుక్తియుక్తముక్తాఫలముతో బోల్పవచ్చును. మౌక్తికమందలి తారళ్యము తద్భిన్నము కాకున్నను ముత్తెముమాత్రము కాజాలదు. నిజవిశిష్టత నది నిలుపుకొనును. విచ్ఛిత్తివిహీనము ముత్యము లెన్ని కానవచ్చుట లేదు! సత్కావ్యమున శబ్దార్థ సమ్మేళనముతో స్ఫురించు నర్థము కాక తదతిరిక్తమై సహృదయస్పందన సమర్థమైన భావరమణీయత అందుండి ధ్వనింపవలెను. కవిః కవినామ్ అను మన యాచార్యుల రచనలో నిట్టిది బహుళముగా గోచరించును. వకుళమాలికయందు ఇట్టి భావరమ్యత ఎంతేని హృద్యముగా సూచితమైనది. కవి నిట్టిరచనకు ప్రేరేపించినది ప్రేమతత్త్వ నిరూపణ కాంక్ష. తన లక్ష్యమును కవి వకుళమాలికా నియోగమున నద్భుతముగా సాధించినాడు. వకుళమాలిక కన్న అమలిన ప్రతీకను సుమనోహరముగా వేరొకటి కానరాదు.

ప్రేమకు నింపుతనము, తాపహారిత్వము, ప్రగాఢత్వము, క్రమాభివృద్ధి, శైథిల్యరాహిత్యము ప్రధానములు. ప్రారంభములో ఇందిరా మాధవుల ప్రేమవ్యాపారమునకు సాక్షిగా వకుళావనీజ చ్ఛాయను నిలిపినాడు. పొగడచెట్టు జీబు చిక్కనై, సంద్రముగా, నిండుగా, గోముగా బెరుగును. అది అమాయిక ప్రాణుల నిగూఢప్రేమప్రసంగమును నిజసాంద్రచ్ఛాయలో నిక్షేపించి, పండువెన్నెల నిగ్గును సైతము వారల రహఃకేళిపరిశీలనము కావింపనీయదు. ఆజంట యానందమునే తన యానందముగా నెంచి పులకితము కాగా, ఎట్లో—

పర్ణముల్ చలియింప పండువెన్నెలనిగ్గు
వారె సొంపుగ వారి వదన బింబాలపై.

ఇట క్షణికమగు జ్యోత్స్నాప్రసారముకూడ సొంపునే కూర్చినది. ఆ పుష్పవాటికలో నెన్నో భూజము లుండగా వకుళమునే స్వీకరించుట విశిష్టరామణీయకమును, సౌందర్యకోణమును సూచించుచున్నది.

వకుళమాలిక అన్యపుష్పమాలికల వంటిది కాదు. పుష్పించినతోడనే దానికి పరిమళము బాఢముగా నేర్పడదు. గంటలు, యామములు, వాసరములు గడచి వాడబారు కొలది గమ్మగమ్మన సువాసనలు కమ్మనై, నలుదిక్కుల వ్యాపించును. ప్రేమతత్త్వముకూడ నిట్టిదే. అనగ ననగ నతిశయిల్లు రాగముకువలెనే కాలము కడచు కొలది తీవ్రమై పీవరత గాంచును. అది ఒక విధమగు తపస్సు. ఆ తాపమునబడి క్రుంగిన కొలది సాధకుడు బాహ్యాభ్యంతర మాలిన్యములు వీడి, తపనీయమువలె దివ్యకాంతులను, వకుళమువలె వాసనలను వెదజల్లును. ఇట్టి మాలికను ప్రేమతో అనురాగసూచియౌ నరుణసూత్రమువెంట గ్రుచ్చి ఇందిర మాధవునకు సమర్పించినది. అణువణువునను మాలిక రాగస్పందనసుందరమై భాసించినది. మాలికారూపమున ప్రేమనే మాధవుడు స్వీకరించినాడా జవ్వనినుండి, జీవిత సాధనకు పట్టుగొమ్మగా.

తన్నెంతో ప్రీతితో కన్న ఇందిరను మాలిక మరల చూడలేదు. ఇందు నిగూఢమగు కవియాశయ మేమి? కవి దృష్టిలో సత్యప్రేమకు చిహ్నమగు మాలిక చంచలయగు ఇందిరా సంస్పర్శనము మరల కావింప వీలులేదు. ప్రేమమూర్తియగు మాధవుని యంతి

కమున నే అది నిజసౌరభములనీనుచు నాతని రాగవాహిని కట్టి మాంద్యము సంక్రమింప నీయక సంరక్షణ మొందును. తానెంతో కుతూహలముతో కూర్చిన మాలికను ఇందిర యెప్పుడో మరచినది. కాని మాధవుని జీవయాత్ర కదియే పాథేయమయినది. అతనికి దానియెడ గల ప్రీతి గాఢమైనది. ఈవిధముగా వకుళము కవిశేఖరుని కల్పనాలోకమున చేరి, పవిత్రప్రేమకు ప్రతీకయయి, సాహిత్యప్రపంచమున శాశ్వతస్థానమును పొందినది. నాయకుని ప్రేమస్థైర్యమును మాలికారూపమున ఖిలముకాక నిలిచియుండు పొగడదండకు పోల్చి, కవి నిజవైదగ్ధ్యభంగీభణితిని ప్రదర్శించినాడు.

నాయిక యన్నదో చంచల. ఆమె నామధేయమే స్వభావమును సూచించుచున్నది. సార్థకమగు నామకరణమున నేకాక కవి ఉపమాలంకారముల సాయమున గూడ సూచించినాడు. ఆమె వకుళమాలికను—

దుగ్ధాబ్ధిలోనుండి తోతెంచు ఇందిరా
దేవి—పోలికతోను,
పద్మాలయాదేవి పగిదిని—

తోచినది. లక్ష్మి చంచల యను విషయము సర్వజనవిదితము. ఈవిధముగా కవి కథాంతమును ప్రారంభమున నే కావ్యార్థసూచన కావించినాడు. నాయకుని పేరు సార్థకమయినది, మాధవుడని. మాధవశబ్దమునకు వసంతార్థ మిట నుపాదేయము. వసంతము ప్రేమకాలము, ఉద్దీపకము, శోభాసమన్వితము.

కవి ఈ గీతికావ్యములో మానవస్వభావ పరిశీలనముకూడ చక్కగా చేసినాడు. సామాన్యముగా మానవ హృదయమున స్థితిగతుల ననుసరించి పొంగు భావతరంగములతో పాఠకుడు శ్రోత దర్శకుడు సమ్మేళనము పొంది, పాత్రలతో తాదాత్మ్యము గాంచి, బ్రహ్మానంద సహోదరమగు నానందరస జగత్తులో తమ్ము తాము మరతురు. ఇట్టి సాధారణీకృతి కవకాశ మొసగని కృతి ఉత్తమకావ్యము కానేరదు. ఈకవి వాఙ్మయతపస్వి. ఇట్టి సన్నివేశ చిత్రణములేని ఘట్టములు వీరి కృతులలో గాలించినను దొరకవు.

మనకు ప్రియులగువారల యిష్టానిష్టములనుబట్టి వారి యిష్టులు మన కిష్టులు, వారికి ప్రత్యర్థులు మనకు ప్రత్యర్థులు నగుచుందురు. వీనికి కారణములు వారల గుణావగుణములు కావు. ఇందిర ప్రియుని కంఠమున పుష్పదామము వేయుచు పలికిన వాక్కులు:

వకుళాలమీద మీవలన నే ప్రాణేశ,
కలిగె నాకునుగూడ గాఢానురాగమ్ము.

ఈ యుదాహరణము పై సత్యము నే స్ఫుటీకరించును.

నిజకామితప్రాప్తికొరకు నరుడు మిక్కిలి పాటుపడును, ఎట్టి కష్టమునైనను సంతోషముతో సహించును. అట్టిచో నొకవేళ నాత డాసించినదే స్వయముగా నతనిని జేరి ధన్యుని జేయుచో ఆనందములో నతని యుక్కిరిపాటు వర్ణింపతరముకాదు. నోట మాట రాదు; వచ్చినను గాద్గద్యము సంభవించును. వాక్కులు క్రమము ననుసరింపవు. పౌనఃపున్యము కనబడును. ప్రేమైకనిధానము, ముక్తికామిని యగు ఇందిర సమాగమువేళ

వకుళమాలిక యెంతో వాడిపోవక ముందె
అర్ధాంగి నౌదు మీ కనివార్యముగ నాథ!

అని బాస చేసినపుడు మాధవుని హర్షవిహ్వలత్వ మెంతో సహజముగ చిత్రింపబడినది. తొట్రుపాటుతో కూడిన అతని హృదయావేగము

నిజముగా నిజముగా నిజముగా ప్రియతమా!
అగుదువా అగుదువా అర్ధాంగి వగుదువా!

అన్నవాక్కులు ప్రేమసరసిలో మునిగి తేలు ప్రతి ప్రాణికిని సహజవేద్యములు. ఈ శబ్దములను పునరుక్తిగా నెంచక, భావసౌందర్య పోషకములుగా భావించినచో భూషణములగును.

వకుళమాలికలో ప్రధాన రసము శృంగారము. రచన సంభోగ శృంగారముతో ప్రారంభమై, కరుణ విప్రలంభమున పర్యవసించినది. శృంగారమునకు అంగములుగా నుండవలసిన వన్నియు సమకూర్చుటలో ఆచార్యులు సిద్ధహస్తులు. సంచారిభావములలో ఆవేగము, హర్షము, జడిమ, చపలత, వ్రీడ, ధృతి, చింత, దైన్యము, శంక, గ్లాని, నిర్వేదము; సాత్త్వికభావములలో స్తంభ, రోమాంచ, స్వరభంగ, వేపథు, బాష్పపాతములు సందర్భోచితముగా, సరసముగా ప్రదర్శింపబడినవి. కథాంతము శ్రోతలకు కరుణ విప్రలంభమున పరిణమించినట్లు తోచినను, నాయకునకు నిర్వేదజనితమగు శాంతి, తుష్టి లబ్ధమయినవి. అతని ప్రకార మీ వృత్తము శాంతరసమున పర్యవసిత మగుచున్నది. మొత్తమున రసనిర్వహణము సరసముగా జరిగినది.

ఇక ఈకృతియందలి సౌందర్యదృష్టిని కొలదిగ విచారింపవలెను. నిజముగా కవిదృష్టియే సౌందర్యము

నకు మూలము. అందులకు గురియగు ప్రతి విషయము నకు సహజముగనే బాహ్యాభ్యంతర రామణీయకము సంక్రమించును. రససిద్ధులగు కవులలో నిట్టిది హెచ్చుగా గానవచ్చును. ఏతత్కవి రచన లన్నియు సౌందర్యసారసముదాయములు. భాష, వర్ణనలు, సంభాషణలు, సన్నివేశములు, అలంకారములు, కథ, రసపోషణము—ఒక్కొక్కటి సాంధ్య రాగారుణ చ్ఛాయా పరిప్లుతములై నేత్రపర్వము కావించు కాదంబినీ ఖండములవలె అందంపు నిగ్గులతో, మైపూత లతో నేత్రపర్వము, శ్రోత్రపర్వము నగుచుండును. వకుళమాలికలోని ఇందిరా సౌందర్య వర్ణనము, నాయ కుని కామినీ మానసాకర్షకౌగ్భుత మైన మూర్తి, ప్రేమకేళికి వకుళావనీజము కావించు సహకారము, వకుళమాలికా గ్రథనము, ఎట్లో విభుని దోర్బంధంబు విడిపించుకొని, అడుగడుగునకు సింహావలోకనము చేయుచు, అంచగమనమ్మున కదలిపోవు నాయిక విహ్వలత్వము, బహువిధమ్ముల బ్రతిమాలు ప్రియుని యెడ ప్రసన్నురాలై, అభిముఖముగా నిలిచి, జారి పోయెడి వేణిని సవరించుకొని, నల్లకల్వల బోలు నయ నాలు పైకెత్తి చల్లనిమాపుతో నతనిని శాంతిపరచు ఆభామిని సుఖముద్ర మొదలగు చిత్రణము లెన్నియో కవి ప్రదర్శించిన విచిత్రసృష్టికి నిదర్శనములు. వకుళ మాలికాసూత్రమును సైతము అనురాగారుణము కావించినది కవిదృష్టి; నిర్జీవమగు సెండుపూదండకు గూడ వెన్నవంటి నవకమును, ఔదార్యమార్దవములను జతచేసి, శిలాప్రతిమయగు నాయందాల బరణికన్న వేయిమడుంగులు సరసమైన దనిపించినది.

ఈ కావ్యము త్యాగసౌందర్యపూరితము, శబ్ద సౌందర్యభూషితము, భావసౌందర్య సంభావితము.

చిరునవ్వు మలయు నా జీవితేశుని మోము
పండువెన్నెల కాయు నే మాలికా
నిండుపున్నమి బోలు నే!

ఇందలి ప్రతిశబ్దమును కవి సౌందర్యసృష్టి యను ఉలితో మలచి, భావమార్దవమను సున్నముతో వానికి పరస్పరయోజనముచేసి, పఠితల హృదయము లుప్పొంగ జేయు శిల్ప సృష్టి కావించినాడు.

"పాలనురుగుల రుచుల పట్టు త్తరీయమ్ము
కౌముదీ కమనీయ కౌశేయ కంచుకము."
"కౌసుంభరాగాల కంచుకము తొడిగినది,
పడుచుంద నొడలిపై పండువెన్నెల రుచుల్
దేవకన్యకవోలె తేజరిల సాగినది."
"జలజలని రాలె నా సమయాన వారిపై
పొగడకొమ్మలనుండి పూలు జడివానగా."

మొదలగు పంక్తు లెన్నియో ఈ కవితిలకునిసౌందర్యో పాసన నెలుగెత్తి చాటుచున్నవి.

## 5

రసపోషణముతోపాటు శబ్దార్థాలంకారము లీ కృతిలో నేర్పుతో నిర్వహింపబడినవి. శబ్దాలంకా రములలో అనుప్రాసము అంగ్రముల సొత్తు. నిత్యజీవిత సంబంధి యగు ఇష్టాగోష్ఠిలోను, సామెతలలోను అను ప్రాసము గోచరించుచుండును. శబ్దాలంకరణ మెంత మనోహరముగ వకుళమాలిక కబ్బెనో రచనయం దెల్లెడల స్పష్టమగును.

ఇక అర్థాలంకారములలో ముఖ్యముగా పుష్టి నిచ్చువాని నే కవి ప్రౌఢముగ వాడినాడు.

1. చనుచుండగా నామె సాంద్రచంద్రికలోన
పాలమున్నీటిలోపల విహారము చేయు
పద్మాలయా దేవి పగిది తోచెను నాకు.

ఉపమ:—

2. చిరునవ్వు వీచికల్ చెంగలించుచు నుండ

—సానుప్రాసమను రూపకము.

3. ఆప్రేమవసంతమ్మున
కీవిరాగ శిశిరమ్మున
కెంత తారతమ్యు మకట !—

రూపకము.

4. వకుళాలమీద మీవలన నే ప్రాణేశ,
కలిగెను నాకునుగూడ గాఢానురాగమ్ము.

—హేతూత్ప్రేక్షా ధ్వని.

ధౌతకౌశేయంబు ధరియించిన జవ్వని సాంద్ర చంద్రికలో నడచు దృశ్యము క్షీరసాగరమున విహారము సలుపు పద్మాలయను తప్పక స్మృతిపథమునకు గొని వచ్చును. ఇట్టి బాహ్యరూప సామ్యమునకు తోడుగా నాయికా చంచలప్రకృతికూడ ధ్వనితమై, ఉపమాన సౌందర్యౌచిత్యములు వ్యక్తము లగుచున్నవి. చిరు నవ్వు వీచికా రూపమున చెప్పబడినది. హాసము ఒక్క సారిగా వెన్నెలవలె వెల్లివిరియును. కాని చిరునవ్వు కెరటమువలె పెదవులపై ఒకమూలనుండి మరిమూల

మూలకు మెల్లగా జాలువారును. కెరటము చిన్న తుంపురులను విరజిమ్మి చల్లదనము నాపాదించునట్లే చిరునవ్వు సైతము హృదయశాంతిని కలిగించును. ఇట్లు రూపస్వభావములలో ఉపమానోపమేయములకు సాదృశ్యము సంపాదించుట రచనాకౌశలమునకు నిదర్శనము. ఇట్లే వసంత శిశిరములు పరస్పర విరుద్ధములయ్యును ఒకదాని తరువాత నొకటి వచ్చును. ఇట్లే ప్రేమ విరాగములు ఒకేనాయిక నాశ్రయించి పరిణమించినవి.

ఈ కృతిలో గతిప్రధానమైన ఛందస్సులు కొన్ని వచ్చుచున్నవి. అందును విజయభద్రరగడ విశేషముగా నున్నది. ఒక్కొక్కపాదములో 20 మాత్రలు; పూర్వ దళములో 10, ఉత్తరదళములో 10 మాత్రలు. ఇంతే కాక త్రిశ్ర, చతురశ్ర, ఖండ, సంకీర్ణ గతులనుబట్టి రచించిన గీతికలు వివిధరాగములలో ప్రయోగింపబడినవి. ఈవిధముగా గేయత్వ మీ కృతిలో ముఖ్యలక్షణము. సంగీతాత్మకమగు నిట్టి రూపకమును నేపథ్యము నుండి కిన్నరీకంఠాన నొకరు పాడుచుండగా మఱొకటి రంగస్థలముపై భావానుకూలముగా శాస్త్రీయముగా నృత్యము చేయుట సరసముగా నుండును. ఇట్టి నృత్యము చేయగలిగి వెంటవెంటనే మాలిక, నాయికానాయకుల భావముల నభినయింపగల సామర్థ్యము సామాన్యముగా నటులలో నుండుట అరుదు. ఈకృతిని ఒకవిధముగా ప్రశంసింపవచ్చును.

వకుళమాలికా కావ్యములో మాధుర్య ప్రసాదాదిగుణములు ప్రధానముగా గానబడును. రీతి వైదర్భి. ధారాశుద్ధి, శైలి, సౌందర్యము వలసినంత కలవు. శృంగార కరుణములందు సహృదయుల చిత్తములు శీఘ్రముగా ద్రవీభూతములగును. చిత్తవృత్తికి కలుగు నిట్టిస్థితిని ద్రుతి యందురు. విప్రలంభశృంగారము నుండి కరుణశాంతములలోనికి పర్యవసించు రసదశయందు ఈద్రుతి తీవ్రముగ నుండును. ఇట్టి లక్షణమే మాధుర్య మనిపించుకొనును. వర్ణితవిషయము స్వచ్ఛవస్త్రముపై బడిన నీటివలె శ్రవణమాత్రముననే హృదయంగమ మగుటలో దానిని ప్రసాదగుణ మందురు. ఇట్టి కావ్యమున జటిలపద గుంఫనము గాని, క్లిష్టశిష్టసమాస బాహుళ్యము గాని, పాండిత్య ప్రదర్శనము గాని పనికిరావు. ప్రయత్నము లేకుండనే భావము భాషను వెన్నంటవలయును. ఈకవి తమ భాషయందు తత్సమ తద్భవ దేశ్య శబ్దములను సహజముగా అసమానలాఘవమున వాడియున్నాడు. ఎచ్చటను కృత్రిమత్వము కానరాదు.

కడచుచున్న కొలంది గడియ యొక్కొక్కటే
అంత కంతకు గంధ మతిశయించుచునుండ
అంతరంగమునందు ఆమోదభరితనై
చల్లగా సాగితిని సౌరభము గదినింప.

ఇందు తత్సమాది శబ్దములకు విభేదము రాని మైత్రి, నైకట్యము సరసముగా సంఘటితములైనవి. ఇంతియే కాక—

కామినీ మానసాకర్ష కౌగ్భూతమైన
పురుషాకృతిని గాంచి పొంగిపోతిని నేను—

అన్నపుడు క్రమముగా తత్సమాదిశబ్దమైనను భాష శ్రమ కలుగనీక హృదయమునకు హత్తుకొనిపోవును. ఇట్లే—

చిగునవ్వువీచికల్ చెంగలించుచునుండ—
పాలిండ్లపై నున్న పట్టుపైకను దాకి
తేలిపోవుచునుంటి దేవతామార్గాన.

మొదలగుపంక్తులు అనేకము భావానుధావియగు భాషాప్రయోగమున ధారాశుద్ధికి తార్కాణములు. భావావేగము హృదయమున నింకి వెక్కసము కాగా శబ్దములు నిర్వ్యతినంది నిర్ఝరిణివలె ప్రవహించుచున్నట్లుండును.

ప్రేమనగర్ కీ రాహ కఠిన హై—అను హిందీ పంక్తిని మకుటముగా ఈ కావ్యమునకు [1935] ఏనాడో ఉంచుటచే హిందీభాషకు నేడు లభించిన ప్రాముఖ్యమును ఆనాడే ఋషియై యుండుగనే కవి దర్శించినాడు. ఇట్టి లలితమైనకృతికన్యను తగిన వరునకు సమర్పించుటలో గూడ సావధానత కానవచ్చుచున్నది. బహువిధముల కావ్యజీవితము మధురముఖరము కావించుకొనిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి ఈకృతి నిచ్చుట ముదావహము.

వివిధముగా పరిశీలనము చేసినను వకుళమాలికా వైభవము అమేయము అనన్య మని తెలుచున్నది. ఈ కవీంద్రుని భావగాంభీర్యమునకు, సూక్ష్మసుకుమార కల్పనాశక్తికి, సమగ్ర సౌందర్యదృష్టికి, రూపకరచనలో నూతన ప్రయోగకళాకౌశలమునకు, అపూర్వ ధారాశుద్ధితో విలసిల్లు గేయరచనా పటిమకు, ఆదర్శ ప్రేమతత్త్వ నిరూపణాసక్తికి, త్యాగతపోరక్తికి, ఈ 'గీతికావ్యగతము' అచ్ఛమైన మచ్చుతునక. ఆధునిక ఆంధ్ర కావ్యలోకములో అత్యుత్తమశ్రేణికి చెంది వ్రేళ్లపై లెక్కింప దగినకృతులలో వకుళమాలికా స్థానము నిర్వివాదము. గేయనాటికలలో దీని కిదియే సాటి.

# అమృతుడు

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

సన్నజాజులపందిరి కళకళలాడింది. ఆ పువ్వులు వాడినా చిక్కని పరిమళం మాత్రం సిగనంటిపెట్టుకొనే వుంటుంది... జీవితంలో అధ్యాయం మారుతుంది; కోరికలు తీరటంతో ఆసక్తి చప్పబడుతుంది; ఎన్నిసార్లు పెట్టుకొన్నా సన్నజాజులమీది అపేక్ష మాత్రం తగ్గదేమో!... అనుకొన్నది ప్రసూన. ఆమెకు ఆ పువ్వులు దండగుచ్చి జడలో ధరించటం ఒక్కటే పేలవం కాకుండా, క్రొత్తదనం చెడకుండా నిలిచిన సరదా! అంతకు నాలుగైదేళ్ళ పూర్వం ఆమె భావనాలోకంలో గృహిణి జీవితం అంటే: హోదాగల ఉద్యోగంతో, అనుకూలుడైన, నచ్చినభర్త; కోరిన నగలు, చీరలు; సొంతకారు; కావలసిన తీరిక...... ఆ కోరికలన్నీ, తీరి, కల నిజమై నిలిచింది; అందరూ అదృష్టవంతురాలవన్నారు! అప్పుడు ఊహించనిదీ, తర్వాత తర్వాత లోటుగా తెలిసివస్తూవుండేది ఒక్కవిషయమున్నమాట నిజమే: అది తన కింకా మాతృత్వం రాకపోవటం; కాని ఆ విషయంలోకూడా భయపడనవసరం లేదని డాక్టర్లు, జ్యోతిష్కులు అంటున్నారు...పోతే, మిగిలిందేమిటి? అసంతృప్తి! ఎందుకు? కారణం తెలీదు! "ఏమీ తోచదు" అని ఆమె ఎప్పుడైనా అంటే, "నీకు తీరిక ఎక్కువైపోయింది ప్రసూనా!" అంటాడు భర్త... "ఇంకా తల్లివి కాకపోవటమే కారణం, ఆ పుణ్యకాలం ఎప్పుడు వస్తుందో!" అంటుంది అత్తగారు... "అమ్మాయ్, వేదాంతమూ మతమూ, వీటిమీద కాస్త ఆసక్తి కలిగించుకోరాదూ జీవితంలో అర్థం కనిపిస్తుంది!" అంటాడు తండ్రి... "మహిళాసంఘ కార్యక్రమాల్లో మీరు శ్రద్ధ తీసుకోవాలండీ" అంటుంది కలెక్టరుగారి భార్య, సంఘాధ్యక్షురాలు... కాని ఏ ఒక్క వివరణా, సలహా ఆమెకు నచ్చలేదు; సమస్య తీరటం లేదు. ఎంత తరచినా, అసంతృప్తి స్వరూపం ఒక్కటే- పూర్వం తనకేవిషయమైనా సరే ఆసక్తి అంటూ వుండేది, ఎదురుచూచే ఉత్సాహం వుండేది; ఇప్పుడు అవి రెండూ లేవు! చివరకు తను మాతృత్వాన్నికూడా పెద్దగా ఎదురు చూడటంలేదు!

కారువచ్చి ఆగింది. భర్త వరాండా మెట్లెక్కి వచ్చాడు.

"నువ్వు క్లబ్బుకి వెళ్ళలేదేం యివాళ?" అన్నాడు.

ఒళ్లోవున్న ఇంగ్లీషు నవల పైకెత్తి చూపింది ప్రసూన. "ఇది చదివెయ్యాలని కూర్చున్నాను."

"మరి చదవకుండా జాజి పందిర్ని చూస్తూ పువ్వులు లెక్క పెడుతున్నావే!"

భర్త చమత్కారానికి ప్రసూన నవ్వింది. "లేదు...కొంత భాగం గడిచేప్పటికి కథ పరుగెత్తటం మాని యీడుస్తూ కుంటటం ప్రారంభించింది. విసుగొచ్చింది."

"జీవితంలాగే?"

ప్రసూన విషయం మార్చింది. "మీ రెందుకని ఇంత తొందరగా వచ్చేశారు క్లబ్బునుంచి?"

"టెలిగ్రాం వచ్చింది... వేణు వస్తున్నాడు... ఈ ట్రెయినుకే! నీతో చెప్పి, తర్వాత స్టేషన్‌కు వెళ్దామని..."

"ఈమధ్య ఉత్తరం వ్రాసినట్లు లేదే!"

"లేదు... వాడెప్పుడిలాగే చేస్తాడు. పరీక్ష పదిహేనురోజులు వుంది కదూ! సరిగ్గా పరీక్షముందు రోజుల్లోనే రిక్రియేషన్ కావాలంటాడు వాడు!"

"భోజనం ఆలస్యమౌతుందేమో, మీకు కాఫీ కావాలా?"

"తప్పకుండా!"

వంట మనిషితో చెప్పటానికి లోపలికి వెళ్ళింది ప్రసూన.

* * *

ఉన్నట్టుండి వచ్చింది వర్షం, వేణు ఒక్కడే షికారు వెళ్ళాడు. బాగా తడిసి పోయి వుంటాడు అనుకుంది ప్రసూన.

వేణు ఏకాంతాన్ని కోరుతాడు, అన్నగారిలా కాదు. ఆయనకేమో ఎప్పుడూ స్నేహితులూ, కబుర్లూ వుండాలి, లేకపోతే తోచదు. వేణు మొదటి

రెండు సాయంత్రాలు వదినెతో చదరంగం ఆడుతూ గడిపాడు. ఇవాళ ఆమెతో ముందుగా చెప్పనే లేదు 'షికారువెళ్తున్నా' నని. చదరంగం ముందు పెట్టుకొని ప్రసూన నిరీక్షిస్తుంటే, దుస్తులు వేసుకుని తయారై వేణు వరాండాలో నుంచే "అలా వెళ్ళొస్తాను వదినా!" అనేసి గబగబా వెళ్ళిపోయాడు. ఎన్నో విషయాల్ని గురించి లోతుగా ఆలోచించిన ధోరణి వ్యక్తమౌతూవుంటుందే ఏం మాట్లాడినా, మరి యీ చిన్న విషయం, అవతలి వాళ్ళపట్ల తన ప్రవర్తనను గూర్చి, ఎందుకని తట్టకుండా పోయిందో! అతని మీద ప్రసూనకు కోపంవచ్చింది.

అత్తగారికి, ముగ్గురు కొడుకుల్లోనూ చివరివాడని కాబోలు, వేణూ వీడే ఎక్కువ మమకారం. అతనికి ఏమేమి యిష్టమో, అతనేవిషయాన్ని గురించి, ఏ అభిప్రాయం, ఎప్పుడు వెలిబుచ్చాడో అన్నీ సమగ్రంగా చెబుతూ వుంటుంది ఆమె. ఆమె వచ్చిన ప్రతి పర్యాయం యించుమించు వేణుకూడా యింట్లో వచ్చివున్నట్లే వుండేది! అలా పరిచయమైన వ్యక్తిని గూర్చిన కల్పన, మనస్సులో ఏర్పడిన ఊహా చిత్రం, ఎంతవరకు నిజం? అని పరీక్షించుతోంది ప్రసూన. అత్తగారు చెప్పినవంటలు, ఆ ధోరణిలోనే అన్ని సదుపాయాలు, వేణుకోసం అమర్చి గమనిస్తోంది... ఏదో ఒక నవ్వు, ఒక చూపు, ఒకమాట తళుక్కున మెరసి అప్పుడప్పుడు ఒక ప్రత్యేకతని సూచిస్తున్న మాట నిజమేకాని, మనిషిలో కలుపుగోలుతనం మాత్రం లేదు! ఎదైనా అడిగితే ఒక ముక్కలో సమాధానం, లేకపోతే అదీ లేదు! ఇదంతా కలిసి చివరకు ఒక విధమైన స్వాతిశయమే అనిపిస్తూవుందామెకు. సిగ్గుపడుతున్నాడేమో అంటే అదేమీ లేదు! నిశ్చలంగా కళ్ళల్లోకి చూచి మాట్లాడుతాడు; ఏమాట చెప్పినా అందులో సంకోచం ఏమీ వుండదు! ఒక బిడ్డలే అయినా, ఆమె భర్తలో కనిపించే స్నేహభావం, ఉత్సాహం, చైతన్యం, వేణులో ప్రతిబింబించటం లేదుమరి !

కాని వేణు వర్షంలో వస్తాడని ఒక వైపు ఆదుర్దాగా వుంది ప్రసూనకు...గొడుగు పంపించటానికి నౌకరు వర్షంముందే యింటికి వెళ్ళిపోయాడు. వేణు ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరమని అత్తగారెప్పుడూ చెబుతూ వుంటుంది !

బాగా తడిసిపోయి యిల్లు చేరాడు వేణు! ప్రసూన హాల్లో సోఫాలో కూర్చుని పుస్తకం చదువుతూ, వేణు రావటం చూచీ చూడనట్లు ఊరుకుంది. వరాండాలో నుంచే ప్రక్కనున్న తన గదిలోకి వెళ్ళిపోయాడు; కొంతసేపటికి బట్టలు మార్చుకుని హాల్లోకి వచ్చాడు. ప్రసూనమాత్రం పుస్తకంమీదనుంచి దృష్టి మరల్చలేదు. ఎదుటవున్న సోఫాలో కూర్చుని, అన్నాడు వేణు :

"బాగా తడిసి పొయ్యాను వదినా!"

ప్రత్యుత్తరంగా ఒక్కక్షణం తలయెత్తి చూచింది ప్రసూన. తడవటం మూలాన కాబోలు అతనిముఖంలో స్నిగ్ధత్వం ఆ కళ్లలో ఏదో క్రొత్త కాంతి తోచాయి. వేణులో ప్రత్యేకత, సౌందర్యం వున్నట్టు అంగీకరించక తప్పదు! అనుకొన్నది ప్రసూన.

"అన్నయ్య యింకా రాలేదా?"

"లేదు!"

"అనుకోకుండా వచ్చింది వర్షం...కుంభపోతగా కురిసింది...సచేల స్నానం!?"

"అనుకోకుండా వెళ్లావు, వర్షమూ అలానే వచ్చి వుంటుంది నిన్ను పరామర్శించటానికి!"

వేణు నవ్వాడు. "నువ్వు క్లబ్బుకు వెళ్లావనుకున్నాను వదినా!" అన్నాడు.

"నిన్న, మొన్న?"

"నిన్న, మొన్న, క్రొత్తవాణ్ణి, అతిథిని! ఇవాళ కూడా నాకోసం నువ్వింట్లో కూర్చోవటం దేనికి, లేడీస్ క్లబ్బుకి వెళ్తావని, షికారు బయల్దేరాను!"

"అది నిజంకాదు...నువ్వెప్పుడూ అబద్ధం చెప్పవని మీ అమ్మగారు నొక్కి చెబుతూ వుంటారు మరి!" అని పుస్తకంవైపు దృష్టిత్రిప్పింది ప్రసూన... కొన్ని క్షణాలు, తన్నుతాను పరీక్షించుకొంటున్నట్లు మౌనంగా వున్న వేణు, చివరకు అన్నాడు :

"అబద్ధంకాదు, సగం సత్యం చెప్పాను!"

"ఏమిటది?" అన్న దామె, ఆ సంగతంతా అప్పుడే మరచిపోయినట్లు.

"నువ్వు క్లబ్బుకు వెళ్తావనుకోవటం ఒక కారణమూ, నాకు ఏకాంతంగా వుండాలన్న కోరిక రెండో కారణమూ. ఈ రెండూ కలిసే నేను షికారు వెళ్లటం జరిగింది...అందువల్ల సగం సత్యం చెప్పానంటున్నాను."

"తత్త్వశాస్త్రం చదువుకున్నావు కదూ మరి" అన్నది ప్రసూన విసుగు చూపిస్తున్నట్లు.

కారు వచ్చింది. ప్రసూన భర్త లోపలికి వచ్చాడు.

*　　　*　　　*

వేణుకు జ్వరం వచ్చింది. ఫెడరల్ సర్వీస్ కమీషన్ ఉద్యోగాల పరీక్ష పదిరోజులే వుంది. తమ్ముడు పరీక్షకు వెళ్ళటానికి వీల్లేకుండా పోతుం దేమోనని ప్రసూన భర్త ఆందోళన చెందాడు. డాక్టరు మలేరియా అన్నాడు. క్వినైన్ ఇంజక్షన్‌లు ఇచ్చాడు.

ఆ రోజుల్లో ప్రసూనకు వేణు యింకోవిధంగా కనిపించాడు...ఆమె ఊహించిన 'స్వాతిశయం' అతనిలో అదృశ్యమై పోవటమే కాదు, కొన్నిసార్లు వేణులో వ్యక్తమైన పసితనపు అమాయకత్వం ఆమెకు నవ్వు కూడా తెప్పించింది. ఆమె వేణును గూర్చి తన అభిప్రాయం మార్చుకొన్నది...ఏ విషయం మాట్లాడినా అతని సమక్షంలో ఆమె సొంత భావాలకు ఒక కొత్త విలువ వస్తోంది! ఒకానొకప్పుడు పుస్తకాలు చదివి తోటి విద్యార్థినులతో ఎన్నో సంగతులు ఉత్సాహంతో చర్చించే ఆమె ప్రాత అనుభూతి తిరిగి వచ్చినట్లుంది :

"జీవితం ఎందుకు పేలవమై పోతుంది?"

"తీరిన కోరికలవల్ల"

"అయితే ఏం చెయ్యాలి?"

"కొత్తకోరికలు కోరుకోవాలి!"

వేణు సూచించిన జవాబు చాల విడ్డూరంగా తోచింది ప్రసూనకు!

"బాగుంది, అవి ఆసక్తిబగులు ఆవేదనని కలిగిస్తాయి కదా! కోరికల్ని జయించి, శాంతిని సాధించమనేకదా తత్వబోధ! కొత్తకోరికల్ని పెంచుకుంటే ఏమౌతుంది?"

"భౌతికంగా సాధ్యమయ్యే కోరికలు ప్రయత్నం మీద వాటిమార్గం అవి చూచుకొని ఏమైనాసరే గమ్యం చేరుకొంటాయి...భౌతికంగా సాధ్యంకానివి, లేక మనలోని బుద్ధివల్ల, నిగ్రహశక్తివల్ల కట్టుబడేవి చివరకు—అంటే ఎంతకాలంలో, ఏవిధంగా అనేది వ్యక్తినిబట్టి వుంటుంది—చివరకు సత్యరూపంతో శాంతిని, ఆనందాన్ని ప్రసాదించగలుగుతాయి! అంతేగాని, కోరికల్ని చంపటం, అణచటం, విస్మరించటం, యిదంతా భావవల్ల, ఊహావల్ల కలిగే పొరబాటు! దానికి కారణం భయం; భయమూ నిగ్రహమూ ఒకటి కాదు; భయంవల్ల లభించేది మృతి; నిగ్రహంవల్ల సాధ్యమయ్యేది ఆనందం...కాబట్టి కోరికల అశాంతిని పూర్తిగా అనుభవించటమే జీవితంలో ఆసక్తికి మూలం అంటాను...అందుకే క్రొత్త కోరికలు పెంపొందాలి అన్నాను..."

"నువ్వు చెప్పేది నాకేం అర్థం కావటంలేదు వేణూ! పుస్తకాల్లో చదివినదానికి నీ సొంత వ్యాఖ్యానం కాబోలు యిదంతా!" అన్నది ప్రసూన.

*　　　*　　　*

ఒకనాడు వేణు పెళ్ళి ప్రస్తావన వచ్చింది :

"ఉద్యోగం ఎలానూ వస్తుందికాని, నువ్వెలాంటి అమ్మాయిని కోరుతావో, ఎంతకట్నం, ఏ చదివిటి కావాలో ఇప్పుడే కాస్త చెప్పిపెట్టితే ఎందుకైనా మంచిది వేణూ!" అన్నది ప్రసూన.

"ఎలాంటి అమ్మాయైనా సరే!" అన్నాడు.

"అప్పుడే వేదాంతిలా మాట్లాడుతున్నావే! కోరికలు కోరటం మంచిదని నువ్వే అంటావు మళ్ళీ... కోరుకోవటానికి సిగ్గెందుకూ? అమ్మాయి ఎలా ఉండాలో చెప్పు ఊహించి!"

"నీవలె వుండాలి వదినా!"

"ముఖస్తుతి అక్కర్లేదు, చెప్పు!"

"నాకింకేం తోచటంలేదు. ఇప్పుడెందుకా గొడవ, దయచేసి ఊరుకో వదినా" అన్నాడు.

ప్రసూన వెళ్ళిపోయింది. తర్వాత రెండు రోజులు ఆమె వేణుతో ఎక్కువగా మాట్లాడలేదు; వ్యక్తిగతమైన ప్రశ్నలు వేయటం అసలు మానివేసింది.

వేణుకు జ్వరం తొందరగానే నయమైంది. కాని నీరసంగా వున్నాడు. ఢిల్లీకి ప్రయాణమయ్యాడు. 'నౌఖర్ని వెంటపంపితే బాగుంటుం దేమో' అన్నది ప్రసూన. ఆమె భర్త ఢిల్లీలో తన స్నేహితుల యింటికి వేణుని వెళ్ళమని ఏర్పాటు చేశాడు.

వేణు వెళ్ళినతర్వాత ప్రసూనకు జీవితంలోని అర్థరాహిత్యం మళ్ళీ తీరని సమస్యగా గుర్తుకువచ్చింది. మరది రావటంతో, ఆ సందడిలో కొన్నాళ్ళు ఆ విషయం అప్రయత్నంగా మరచిపోయిందామె. భర్తకు తత్త్వజిజ్ఞాస పట్టదు; ఏ విషయాన్ని గూర్చికాని లోతుగా ఆలోచించటం, తర్కించటం హాస్యాస్పదంగా కనిపిస్తుంది ఆయనకు...కనిపించేది లోకం,

జరిగేది జీవితం, అంతకుమించిన ఊహలు నమ్మకాలు అనవసరం ఆయన దృష్టిలో...వేణు భావుకుడు, తాత్వికుడు, ప్రతివిషయాన్ని కూర్చి ఏదో పరీక్ష చేస్తాడు, అన్వయంకోసం వెతుకుతాడు...నిజానికి సోదరులు ముగ్గురూ ముగ్గురే! అనుకొన్నది ప్రసూన. సైన్సు, గణితం తీసుకుని పరీక్షలు ప్యాసై, ప్రావిన్షల్ సర్వీస్‌లో డిప్యూటీ కలెక్టరుగా సెలెక్టయ్యాడు ప్రసూన భర్త. పెద్దమరది మద్రాసులో తండ్రిదగ్గరే లాయరుగా వున్నాడు. ఇక వేణు, వేదాంతం, చరిత్ర, సాహిత్యం ఎన్నుకొని ఫెడరల్ సర్వీసస్ పరీక్షకు వెళ్తున్నాడు. రేపో మాపో పోస్టల్‌లోనో, రైల్వేలోనో పెద్ద ఉద్యోగి అవుతాడు!

అన్నదమ్ములు వాదిస్తూవుంటే వినాలి! జగత్తు రహస్యం, వాస్తవిక ప్రపంచాన్ని హేతువాదాన్ని మించి, తెలుసుకోవటానికి వీల్లేదంటాడు అన్న. హేతువాదాన్ని అధిగమిస్తేకాని ఆ విషయం తేలదంటాడు వేణు. "ఏవిధంగా?" అంటేమాత్రం దానికి సమాధానం, వివరణ, సాధ్యంకాదనీ, అన్నగారిని అంగీకరింపచెయ్యటం తనచేత కాదనీ అంటాడు వేణు...ఒక కోరికను కోరటం, దాన్ని నిగ్రహించటం ఈ విరుద్ధప్రవృత్తులమధ్య కలిగే హృదయానుభూతిలో అందుకు ఏదో మార్గం వుందని తనకు తోస్తోందనీ, దాని స్వరూపం తనింకా అవగతం చేసుకోలేదనీ అన్నాడు, జ్వరం వచ్చినప్పుడు ఒకసారి ప్రసూనతో వేణు. ఆ మాట భార్యద్వారా విని, "ఉద్యోగంవచ్చి పెళ్లైతే. యీ పిచ్చివేదాంతం వదుల్తుందిలే" అన్నాడు వేణు అన్న. మొత్తానికి వేణు విచిత్రవ్యక్తి అనుకొన్నది ప్రసూన!

పరీక్షలు పూర్తికాగానే సరాసరి తిరిగి రమ్మనీ, తర్వాత మద్రాసు వెళ్ళవచ్చుననీ చెప్పారు దంపతులిద్దరూ. కాని ఢిల్లీ వెళ్ళి వేణు ఉత్తరం వ్రాశాడు: పరీక్షలు కాగానే మద్రాసు వెళ్ళి రెండురోజులుండి, తర్వాత ఒక స్నేహితునితో కలిసి దక్షిణదేశం తిరిగి రావాలని సంకల్పించాడట; దక్షిణదేశయాత్ర తర్వాత అన్నదగ్గరకు వస్తాడట!

తర్వాత ఉత్తరాలు లేవు! అతను పుదుచ్చేరి అరవిందాశ్రమంలో కొన్నాళ్ళు, రమణాశ్రమంలో కొన్నాళ్ళు వున్నట్టూ, దక్షిణాదిలో ముఖ్యమైన స్థలాలన్నీ దర్శించినట్టూ మద్రాసునుంచి కబురుమాత్రం తెలిసింది. రెండుసెలల తర్వాతకాని వేణు మద్రాసు చేరుకోలేదు. అప్పుడే ప్రసూన భర్తను బదిలీచేసి బళ్ళారి వేశారు. ప్రసూన పుట్టింటికి వెళ్ళింది. ఆమె బళ్ళారికి తిరిగివచ్చిన తర్వాత భర్త వేణుని రమ్మని ఉత్తరం వ్రాశాడు. ఈ మధ్యకాలంలో వేణు మద్రాసులో ఒక కాలేజిలో లెక్చరరుగా చేరాడట; అందువల్ల సెలవుల్లోకాని రావటానికి వీలుండదని బదులు వచ్చింది! ఫెడరల్ సర్వీసస్ ఫలితాలకైనా వేచివుండకుండా యింతలో యీ ఉద్యోగమేమిటని, భార్యాభర్తలిద్దరూ ఆశ్చర్యపడ్డారు. దానికి ప్రత్యుత్తరమిచ్చాడు వేణు: "...ఫలితం ఏమౌతుందో, ఊరుకోవటం లేనికని లెక్చరరు ఉద్యోగం చేస్తున్నాను... ఈసారి సెలవుల్లో వచ్చినప్పుడు నాకు పెళ్లిసంబంధం చూడమని వదినెతో చెప్పాలి...క్రిందటిసారి, నాకు ఉద్యోగం రాగానే అమ్మాయిని వెదికిపెడతానన్నది వదినె!"...అయితే వేణు సరియైన ధోరణిలోనే వున్నాడన్నమాట! పుదుచ్చేరి, అరుణాచలం, యివి ప్రసూనను, ఆమె భర్తను కలవరపెట్టాయి...వేణు వ్రాసిన ఉత్తరం ఆ సందేహనివృత్తి చేసింది!... తెలిసినవాళ్లలో తగిన అమ్మాయి ఎవరా? అని ప్రసూన ఆలోచించటం ప్రారంభించింది..."నీలాగే వుండాలి వదినా!" అని వేణు అన్న మాట జ్ఞాపకం వచ్చి. ఆమెకు మరదిమీద ఏదో క్రొత్త అభిమానం కలిగింది.

*   *   *

డిసెంబరులో తల్లిని తీసుకుని వేణు బళ్ళారి వచ్చాడు ఢిల్లీ ఇంటర్వ్యూకి రమ్మని పిలుపు వచ్చిందట. పది రోజుల్లో వెళ్ళాలి.

"ఏదో పరీక్షో, ప్రయాణమో ముందుపెట్టుకొని గాని, ఊరికే రాకూడదేమిటి?" అన్నది ప్రసూన.

"జ్వరం వస్తుందేమోనని భయం!" అన్నాడు వేణు.

ప్రసూన నవ్వింది. "అందుకే కాబోలు యీసారి అత్తయ్యను వెంట దీసుకొచ్చావ్!"

"అమ్మ పంపి చూడాలట...మీరింకా వెళ్ళలేదుగా, అందరం కలిసి వెళ్ళొద్దాం" అన్నాడు వేణు.

తీరా ప్రయాణమయ్యేటప్పటికి ప్రసూన భర్తకు ఆఫీసుపని లేవో అడ్డువచ్చాయి. మిగిలిన ముగ్గురూ

డ్రైవరుతో కారు తీసుకుని బయల్దేరారు.

విరూపాక్ష దేవాలయంలో తిరుగుతూ వుండగా వేణు అన్నాడు: "మొట్టమొదటి సారిగా ఈ ప్రదేశంలో అడుగు పెట్టుతున్నా, ఎందుకనో ఈ కట్టడాలు, శిల్పాలు, పరిసరాలు నాకు చిరపరిచితాలన్న అనుభూతి కలుగుతోంది వదినా!"

"బహుశా ఫోటోల్లో ఈ కట్టడాలు చూచి వుంటావు! చరిత్ర చదివి ఊహించుకొని వుంటావు, అదంతా జ్ఞాపకం వస్తోంది కాబోలు" అన్నది ప్రసూన.

"అలా కాదు. రోజూ మనం నడిచే వీధి, తరచు వెళ్ళే దేవాలయం, పాల్గొనే పూజలు, హరికథలు, ఉత్సవాలు—యివి కొన్ని సంవత్సరాల తర్వాత మళ్ళీ ఆ చోటికే తిరిగివస్తే మనకెంత గాఢంగా జ్ఞాపకం వస్తాయో, అలాగే యీ హంపీ బజారు, ఈ దేవాలయాలు ఇంత శూన్యంగా, నిర్జనంగా కనిపిస్తూ వున్నా, మనుష్యులతో ఉత్సవాలతో సందడిగా కళకళలాడుతూ వున్నట్టు ఏదో భ్రమ కలుగుతోంది. నాకు...నిజం చెప్పాలంటే పూర్వజన్మలో నేనిక్కడ రాయల సైన్యంలో ఒక సరదారు నైనట్లు గట్టిగా నమ్ముతున్నాను!"

"బాగుంది...అయితే విజయనగర ప్రజలజీవితాన్ని వర్ణిస్తూ ఒక చక్కని నవల తయారుచేయవచ్చు నే! ఊహాశక్తి అంత గాఢంగా వుంటే... అత్తయ్యా, మీ అబ్బాయి ఏదో పూర్వ జన్మలో యిక్కడ సర్దారుగా రాయలవారి సైన్యంలో వుండేవాడట!"

"సరదా రేమిటి, సైన్యాధ్యక్షుడే అయివుంటాడు! అమ్మాయ్, పూర్వజన్మస్మృతి అంటే అందులో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు...నాచిన్నతనంలో ఒకసారి మాయింటికి ఒక యోగివచ్చాడు..." వేణు ఏం చెప్పినా అది అందరూ అక్షరాలా నమ్మాలి! దాన్నెవరైనా శంకించటం ఆమె సహించలేదు; పూర్వ జన్మస్మృతుల్ని గూర్చి ఏవో కథలు చెప్పింది ప్రసూన అత్తగారు.

ప్రసూన వింటూ నడుస్తోంది. వేణు కొంచెం ముందున్నాడు. హంపీ బజారుదాటి కోదండరామ దేవాలయం దరికి నడుస్తుంటే, వేణు చప్పున నిలిచిపోయాడు. ఎడమవైపున తుంగభద్రను చూపి అన్నాడు: "ఇక్కడినుంచీ నదీ, యీ పరిసరాలు, యీదృశ్యం నాకు మరీగాఢమైన స్మృతిగా వుంది... ఇక్కడ నిల్చొని ఎన్నోసార్లు ఎవరితోనో మాట్లాడినట్లు నా ఊహ!"

ప్రసూన నవ్వుతూ అన్నది: "తర్వాత మాట్లాడవచ్చు; విఠలదేవాలయం యింకా చాలదూరం వుందట...తిరిగి వచ్చేటప్పుడు మాట్లాడరాదూ!"

విఠల దేవాలయం చూచినతర్వాత హాస్పేట తిరిగివచ్చారు ఆ రోజు.

మరుసటిరోజు హజార రామస్వామి దేవాలయంలో, రామాయణగాథ చెక్కబడిన శిల్పాన్ని చూస్తూ వుంటే, వేణు ఒక చిత్తరువు ముందు నిల్చొని కదలకపోవటం గమనించి, కౌతూహలంతో దగ్గరకు వెళ్ళింది ప్రసూన...సీత పర్ణకుటీరంముందు నిలబడి, బంగారు లేడి వైపు చూపిస్తూ 'అది తనకు కావాలంటూ వుంది శ్రీరామునితో. తర్వాత చిత్రం, రాముడు ఆ లేడిమీద బాణం వేయటం!

"ఆ లేడి ఎంత బాగుంది!" అన్నది ప్రసూన.

వేణు మాట్లాడలేదు. రెండుమూడు చిత్రాలు దాటివెళ్ళిన ప్రసూన వేణుతో: "ఆ లేడిమీద వ్యామోహమే కలగకపోతే సీతకు అంత అనర్థం వాటిల్లేది కాదుకదా!" అన్నది

వేణు ఆమె దగ్గరకు నడిచాడు: "అలా కాదు వదినా! సీత కారణ జన్మురాలు...సీతా రాములిద్దరూ కూడా రావణ సంహారంకోసమే జన్మించారు. అందువల్ల కాలాన్నిబట్టి కనిపించే హేతువులూ, మంచి చెడ్డలూ ఒక రకంగా వుంటే, కాలాతీతమైన హేతువులూ, మంచిచెడ్డలూ ఇంకోరకంగా వుంటాయి!"

"ఏమిటో వేణూ! ఇక్కడకూడా వేదాంతమేనా?"

గజశాల, దసరాదిబ్బ దర్శించటానికి వెళ్తున్నారు; వేణు అన్నాడు: "సర్దారు కథ చెప్పనా?"

"సర్దా రేమిటి?"

"మరచి పొయ్యావా వదినా! నా పూర్వజన్మకథ!"

"ఆఁ, అవును, చెప్పు! పూర్తిగా జ్ఞాపకం వచ్చిం దేమిటి?" అన్నది ప్రసూన చిరునవ్వుతో.

"ఆ సర్దారు ఒక యువతిని—పుష్పలావికను—ప్రేమించాడు...మొదటిసారి విరూపాక్షదేవా

లయంలో, తర్వాత హంపీ బజారులో, తుంగభద్ర ఒడ్డున ఆమెను కలుసుకున్నాడు...ఆ ప్రేమబంధం నాగపాశంలాంటిది...దానిలో అతను పూర్తిగా కట్టుబడిపోయాడు...ఒక నాటి వర్షపు రాత్రి ప్రేయసి మీది వ్యామోహం నిగ్రహించుకోలేక, రోగశయ్య మీద మరణావస్థలో వున్న తల్లిని వదలి వెళ్ళాడు... వెళ్ళాడు కాని అతని హృదయంలో పూర్వార్ధానికి, ఉత్తరార్ధానికి సంఘర్షణ...తెల్లవారే సరికి తల్లి మరణించింది...పశ్చాత్తాపం...—తర్వాత రాయలవారి జైత్రయాత్ర...సర్దారు యుద్ధభూమికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి ఏడాది దాటింది...పుష్పలావిక జాడ లేదు...హంపీ బజారులో రెండేళ్ళ క్రితం కనిపించాడొక విదేశీవర్తకుడు, ఆమె దగ్గర పువ్వులుకొనేవాడు, అతణ్ణి పెళ్ళిచేసుకొని వెళ్ళిపోయిందని విన్నాడు... జీవితం శూన్యమనిపించింది..."

"తర్వాత ఏమైంది?"

"తెలీదు."

"కథ రొమాంటిక్‌గా వుంది; కాని ముగింపునే చెప్పనా?...చాల వాస్తవిక దృష్టితో...ఇంకో అమ్మాయిని పెళ్ళిచేసుకొని పదిమంది పిల్లల తండ్రి అయ్యాడు...సైన్యాధ్యక్షుడయ్యాడు!"

ప్రసూన చెప్పిన ముగింపు మాత్రం చెవినిబడ్డ వేణుతల్లి "ఏమిటా కథ? నన్నూ విననీయండి!" అన్నది.

'మీ అబ్బాయి పూర్వ జన్మకథ, అత్తయ్యా!" అంటూ ప్రసూన వేణు చెప్పినకథ ఆమెకు చెప్పింది.

"అందుకే కాబోలు; నే నెప్పుడూ తనతోటే వుండాలని యిష్టపడతాడు వేణు! నన్ను కూడా తనతో ఢిల్లీ తీసుకు వెళ్తానంటున్నాడీ మాటు!"అన్నది నవ్వుతూ తల్లి.

"అయితే మీరూ ఢిల్లీ వెళ్తారన్నమాట! చెప్పనే లేదే!" అన్నది ప్రసూన ఆశ్చర్యంగా.

"నువ్వూ రావే అమ్మాయ్! కాశీ, ప్రయాగ చూచివద్దాం...నువ్వు పుణ్యతీర్థాలు సేవిస్తే మనవడు తప్పకుండా పుట్టుతాడు" అన్నదామె.

భూగర్భ దేవాలయందగ్గరకు వచ్చారు. అంగులో చూచే దేమీ లేదన్నారు వెంటవచ్చినవాళ్లు...వేణు తను వెళ్ళి చూడాలన్నాడు. ప్రసూన "నేనూ వస్తా" నన్నది. రాయల ఆలోచనా మందిరానికి భూగర్భ దేవాలయానికి సొరంగమార్గం వుండేదట పూర్వం... వేణు తల్లి రోడ్డుమీదే వుండిపోయింది...వేణుముందు, ప్రసూన అతని వెనుక, మెట్లు దిగి ముందు ఆవరణ దాటి లోపలికి వెళ్ళారు గర్భగుడిదాకా... అంగులో నీళ్ళు నిలిచి లోతుగా వున్నట్లు కనిపించింది, తర్వాత అంధకారం...వేణు గర్భగుడి కుడివైపుకు మళ్లాడు, ప్రసూన అతని వెనుక నేవుంది..."అమ్మో, పాము!" అని అరవబోయిన ప్రసూన గొంతు సగంలో ఆగిపోయి, చప్పున వేణుని గట్టిగా చుట్టుకొని, ముఖం అతని వీపున దాచుకొన్నది...వేణు పామును చూచి కదలకుండా నిలిచిపోయాడు...రెండుమూడు గజాల దూరంలో పడగఎత్తి నిలుచున్న త్రాచు, పడగ దించి సరసరా వెళ్ళిపోయింది!

"వదినా, వెళ్ళిపోయింది పాము!" అన్నాడు వేణు.

ప్రసూన తేరుకోవటానికి కొన్ని క్షణాలు పట్టింది. ఆమె దేహం వణుకుతోంది...ముఖాన చెమట...వేణు చెయ్యిపట్టుకుని మెట్లదాకా నడిచింది.

"అబ్బ! ఎంత గండం తప్పింది వేణూ! ఈ పాడు దేవాలయంలో ఏముందని వచ్చాం యిక్కడికి!" అన్నదామె.

వేణు మాట్లాడలేదు.

"అత్తయ్యా, త్రాచుపాము! నా ప్రాణాలు నిలువునా ఎగిరిపొయ్యాయి...వేణుకు ఎంత ధైర్యం! నిశ్చలంగా నిలుచున్నాడు" అని చెప్పింది అత్తగారితో ప్రసూన.

ఆ సంఘటన ఆమె మనస్సుమీద చెరగని ముద్ర వేసింది. తను అంతగా భయపడిపోవటం, వేణు చదురూ బెదురూ లేకుండా నిల్చోవటం, రెండూ ఆశ్చర్యాన్ని కలిగించాయి. తలచుకొన్నకొద్దీ తన ప్రవర్తన తనకే సిగ్గు తెప్పిస్తోంది. వేణు ఏమనుకొన్నాడో మరి! తను వేణూను అలా పట్టుకొని కళ్లు మూసుకోవటం ఏమిటి పసిపిల్లలా!...అప్పటినుంచి వేణు కొంచం ముభావంగా వున్నట్టుకూడా అనుమానించింది ప్రసూన.

బళ్ళారికి తిరిగివస్తూంటే, కారులో వేణు మౌనం భారంగాతోచి, ప్రసూన అన్నది. "త్రాచు పామును చూస్తే మనిషికి ఎందుకో అంత వెఱ్ఱిభయం!"

"విషజంతువుకదూ! కరిస్తే యింకేమన్నా వుందా!" అన్నది వేణు తల్లి.

"విషజంతువు లెన్ని లేవు! త్రాచును చూస్తే అంత విపరీతభయం ఎందుకో అర్థంకాదు!" అన్నది ప్రసూన తన్ను తాను నిరసించుకొంటున్నట్లు.

"దానికి కారణం త్రాచుపాములోవున్న విశిష్టత! సౌందర్యము, శక్తి, చైతన్యము, మృత్యువు యివన్నీ త్రాచుపాములో మూర్తిభావం పొందుతాయి వదినా! మన మనస్సులో మృత్యుభావనకు సౌందర్యం, చైతన్యం లేదు; అలాగే సౌందర్యభావనకు మృత్యుసంబంధం లేదు...కాని యీ భిన్నప్రవృత్తుల సంఘర్షణ, కాదు సమీకరణ, ఒక్కత్రుటిలో మన అనుభూతికి తెస్తుంది త్రాచుపాము. ఆ అనుభూతి అసామాన్యమైనది, అందుకే అది వెఱ్ఱిభయం! యోగ విద్యలో కుండలినీశక్తికి సర్పరూపాన్ని మనవాళ్ళు నిర్దేశించటానికికూడా యిదే కారణ మనుకుంటాను!"

వేణువి అన్నీ విచిత్రమైన వ్యాఖ్యానాలు, అనుకొన్నది ప్రసూన. కాని పాముఎదుట అతని ప్రవర్తన చూచినతర్వాత, అతని మాటల్ని నిర్లక్ష్యంచేసి ఏదో అనలేకపోయింది ఆమె. హంపీలో వేణు చెప్పిన కథనుగూర్చి మళ్ళీ ఆలోచించింది. సరదాకు చెప్పిన కథ అని యిదివరకు అనుకున్నా, అందులో కూడా వేణు ఏదో అర్థాన్ని వుద్దేశించే వుంటాడనిపించింది ఆమెకు...ఇల్లు చేరుకున్నతర్వాత, హంపీ విశేషాల్ని భర్తతో చెబుతూవుండేమాత్రం, వేణు మాటలన్నీ పిచ్చివేదాంత ధోరణిగా తోచాయి ఆమెకు...కథంతా విని భర్త నవ్వాడు; "తొందరగా వేణుకి పెళ్ళి చెయ్యటం ముఖ్యమని తెలుస్తూందికదా!...కాలేజిలో ఏ అమ్మాయినో ప్రేమించి నిరాశ చెంది వుంటాడు" అన్నాడు.

* * *

"వేణూ, నువ్వెవరినైనా ప్రేమించావా?" అని సూటిగా ప్రశ్నించింది ప్రసూన తర్వాత. ఒక్కక్షణం "ఎందుకు?" అన్నట్లు చూచి, "ఆఁ... పుష్పలావికను!" అని సమాధానమిచ్చాడు వేణు.

"తమాషాకాదు!...నిజంగానే చెప్పు!"

"నిజంగానే వదినా!...ఆనాడు నాకు ఊహాపథంలో మెదిలిన కథకూ నా మనస్సుకూ అవినాభావ సంబంధం వున్నట్లు, తిరిగివచ్చినతర్వాత గ్రహించాను...సీత బంగారులేడి తనకు కావాలంటుంది; దాన్ని బాణంవేసి చంపితేతప్ప అది దొరకదు; చంపటంతో మరి దాని స్వరూపమే మారిపోతుంది...సౌందర్యాన్ని పొందటం దాన్ని పోగొట్టుకోవటమే!... సీత లేడిని చూచి ఆనందించిన క్షణమొక్కటే అమృతక్షణం! 'అది ఎంత అందంగా వుంది'న్నతృప్తి, 'అది తనది కాదే' అన్న అసంతృప్తి, ఈ రెండూ సమంగా నిల్చిన క్షణం! కాని తర్వాత క్షణంలో 'అది తనది కాదే' అన్నభావం జయిస్తుంది, సీత శ్రీరామునికి తన కోరికను చెబుతుంది, ఇక కార్యకారణ సంబంధంతో కాలం అలా కదలిపోతుంది; దానితో సౌందర్యమూ చేజారిపోతుంది!...కాలాన్ని, కార్యకారణ సంబంధాన్ని అధిగమించే సత్యం, రెండు విరుద్ధప్రవృత్తుల సమీకరణ!...పుష్పలావిక—సౌందర్యం; తల్లి—ధర్మం...వానవచ్చినరాత్రి పుష్పలావికకోసం సర్దారు తహతహలాడిన క్షణం సౌందర్యం, ధర్మం సమీకరణ చెందిన అమృతక్షణం!"

"అయితే సౌందర్యంమీది కోరికను నిగ్రహించుకొని, సౌందర్యాన్ని పొందకపోవటమే కర్తవ్యం అంటావా?"

"అది కూడా కాదు! ఆ అనుభూతిలో, నిగ్రహించుకోవటంలోని అసంతృప్తి వుండదు, అలా అని కోరిక ఉద్ధృతమూ తగ్గదు...అది భాషకు మామూలు ఊహకు అతీతమైన సత్యం. పొందకుండా పొందటం, పొందీ పొందకపోవటం అనాలి; కాని అంటే అది అర్థరహితంగానే తోస్తుంది! మాటలో, ఊహలో కాదు, ప్రత్యక్షానుభూతిగామాత్రం అది సత్యం! సాధారణమైన జీవితానుభూతి—కోరటం, పొందటం, కోరటం—యిలా వుంటుంది ఎడతెగకుండా నిరంతర ప్రయాణంచేసే తరంగంలా. అది అలా కదలిపోతూ వుండటమే జీవనసరళి, కాలప్రవాహం! కాని మనిషి లోని ఏదో విశిష్టత [illegible] దు...కోరటంలో నిలిచి బాధపడుతాడు, లేక పొందటంలో పడిపోయి అంతా పేలవం అనుకుంటాడు...విముక్తిమార్గం తరంగంతో కదలిపోతూవుండటం ఒకటి; లేకపోతే తరంగాన్ని అధిగమించే ద్వంద్వాతీతమైన అనుభూతి యింకోమార్గం...నేను చెప్పిన విరుద్ధప్రవృత్తుల సమీకరణ ద్వంద్వాతీతమైన అనుభూతి!"

ప్రసూన ఆలోచిస్తూ కూర్చున్నది. ఆమె కేమీ బోధపడలేదు...వేణు వేదాంతం సంగతి ఎలావున్నా, అసలు వేణూను వ్యక్తిగా ఎలా అర్థం చేసుకోవాలో ఆమెకు అంతుపట్టటంలేదు...వేణు మాటల అర్థాన్ని ఆమె తరచటంలేదు; కాని సౌందర్యాన్ని గూర్చి, జీవితాన్ని గూర్చి యిలా గాఢంగా, మధురంగా, గంభీరంగా మాట్లాడే వేణూను ఒక అమ్మాయి ఎలా ప్రేమించాలో, ఆ అమ్మాయి ప్రకృతి ఎలా వుండాలో ఆలోచిస్తోంది.

"వేణూ! నీకు తగిన భార్యను వెదకటం చాల కష్టమైన కార్యమే!...అయినా ప్రయత్నిస్తున్నాను. చాల అందంగా వుండాలి కదూ!...నీతో తత్వజిజ్ఞాస చేసేటట్టు కూడా వుండాలి కాబోలు!"

"నీవలె వుండాలి వదినా!"

"నే నెందుకు పనికి వస్తాను బాబూ!" అని ప్రసూన లేచి వెళ్ళింది కలవరపాటుతో.

* * *

హంపీ వెళ్ళి వచ్చిన బడలికతో అస్వస్థురాలైన వేణుతల్లి ఢిల్లీ ప్రయాణం మానుకోవలసి వచ్చింది. వేణు ఒక్కడే ఢిల్లీ వెళ్లాడు.

ఇంటర్వ్యూ తృప్తికరంగా వుందనీ, తను కాశీ, హరిద్వారం చూచి పదిరోజుల్లో తిరిగి వస్తానని వేణు అన్నగారికి ఉత్తరం వ్రాశాడు.

పదిరోజులు పదిహేనై, ఒక నెల గడిచింది. మళ్ళీ ఉత్తరం రాలేదు. మద్రాసుకు వ్రాశాడేమో అనుకున్నారు; కాని వాళ్లకూ వేణు వార్త ఏమీ తెలీదు. వేణుతో ఢిల్లీ వెళ్ళిన స్నేహితుడు వేణు పేర మద్రాసు వ్రాసిన రెండు వుత్తరాలు మాత్ర చేరాయి. వేణు సెలెక్ట్ అయినట్లు ఫెడరల్ సర్వీస్ కమీషన్ వారు తెలియజేశారు కూడా! వేణు ఏమైనట్లు? వేణుకు వచ్చిన వుత్తరాలు చదివి, వేణు స్నేహితుణ్ణి కనుక్కున్నారు. కాశికి తనూ వెళ్ళాననీ, తర్వాత హరిద్వార్ కు వేణు ఒక్కడే వెళ్ళాడని మాత్రమే అతను చెప్పగలిగాడు. ప్రసూనభర్త హరిద్వార్ వెళ్ళి తిరిగివచ్చాడు...వేణు జాడలేదు! పత్రికల్లో ప్రకటించారు, రిపోర్టిచ్చారు, వేణునుగూర్చి ఏవిధమైన వార్తా లేదు!

భర్త నిరాశతో తిరిగివచ్చినరోజు ప్రసూన దుఃఖం అపుకోలేక పోయింది..."నదిలో పడిపోయ్యాడో, ఏమయ్యాడో నాతండ్రి!" అని వేణు తల్లి విలపించింది...కాని ప్రసూనకు ఆ అభిప్రాయం లేదు. "లేదు! వేణు హిమాలయ పరిసరాల్లో నే ఎక్కడో వున్నాడు...వేణు తప్పకుండా తిరిగి వస్తాడు!" అన్నది ప్రసూన.

విచిత్రమైన వ్యక్తి వేణు! అతని మూర్తి, అతని మాటలు, అభిమానం, నిత్యస్మృతులు ప్రసూనకు. అతని జాడ ఎప్పుడో తెలిసి తీరుతుందన్న ఆశ ప్రసూనకు జీవితంమీద కొత్త ఆసక్తిని పెంపొందించింది.

...ఇరవై ఏళ్ళు గడిచాయి వేణు అదృశ్యుడై! సన్నజాజుల పందిరి శకళ లాగుతూవుంది..."అలా వెళ్ళొస్తానమ్మా" అని గబగబా వెళ్ళిపోతున్నాడు వేణు! పంధొమ్మిదేళ్ల కొడుకు మాటకు ఉలికి పడి, 'వేణు అమృతుడు' అనుకొన్నది ప్రసూన.

# ముహూర్త ఫలము

## శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

“సరేకాని, మాకు జాతకానుకూల్యము చాలా బాగున్నదని చెప్పియుంటిరే? ఏదైనా పొరబాటు కలదేమో, ఒకసారి చూడండి.”

నా ఆత్మీయుల గుంపునకుచేరి నగరాంతరమున సంసారమును సాగించుచున్న ఒకానొక సువాసిని ఇంటికి ఈలోగా నేనొకసారి పోయియుండి, కుశల ప్రశ్నాగుల అనంతరము లోకాభిరామాయణముగా ఆమెతో సంభాషించుచున్న సమయమున, అల్లంత దూరమున ఆసీనురాలై, ంతలు, నింతలునగు తన సంతానము”లో చిన్నవారి నిగువురిని అంకపాళిలో లాలించుచు, తటాలున ఏదో స్ఫురణమునకురాగా, సాభిప్రాయముగ నన్ను చూచుచు వేసిన ప్రశ్న ఇది.

రమారమి పదునైదు సంవత్సరముల క్రిందట యోగ్యుడు, అనురూపుడు, అగువరునితో ఆమెకు వివాహము మహావైభవముగా జరిగినది. ఆ భార్యాభర్తలకు అన్యోన్యముగాకల భక్తిరక్తులు నిరుపమానములని ఎరుగుదును. సత్సంతాన సౌభాగ్యమును సమృద్ధిగా భగవంతుడు వారికి అనుగ్రహించినాడు. గొప్ప ఆర్థిక వసతిగల సజాత్యకుటుంబమునకు చెందినవాడు భర్త. ఉన్నత విద్యావంతుడైనా, వినయవివేకములు కల సజ్జనుడతడు. భూస్థితివలనవచ్చు ఆదాయముతో హాయిగా, ఇంట కూర్చుండి కాలు కదల్చక, సు నము చేయుటకు అతనికి మంచి అవకాశమున్నది. కాని, అట్టి సోమరి జీవిత మతనికి రుచించదు. ఇక, క్లబ్బులలో చీట్లపేకల వ్యవహారముతోనో, పనిపాటల గొడవలేని స్నేహితులతోటి నిరర్థక జల్పనములతోనో, సానివాడలలో లలితకళాభిరుచులతోటి విలాస విహారములతోనో, ప్రొద్దుపోక రాజ్యతంత్రములను చర్చించు పెద్దమనుష్యులతోటి వాదప్రతివాదములతోనో కాలయాపనము చేయుట అతని స్వభావమునకు సరిపడనిది. తగిన వృత్తిని సంపాదించుకొని నగరములో కొంత స్వతంత్రముగా, నిరాడంబరముగా జీవనము చేయుచున్నవాడతడు. కాక, భూస్థితిని చూచుకొని నిర్వహించుటకు పెద్దలు, వారికి అండగా తోడబుట్టువులు, ఉన్న కారణమున, అతనికి ఆస్తిగొడవ అంతగా అనవసరముకూడ. అనురక్తయు, అనుకూలయు అగు భార్యతో, సత్సంతాన సౌభాగ్యముతో, ఆనందించుచున్న ఆ యువకుని ప్రశాంత నిర్మల జీవితము నిస్సందేహముగా ఆదర్శప్రాయము.

వివాహమునకు పూర్వము వీరి జాతకములను పరిశీలించి యుంటిని. అప్పటికి దృక్పథములో నున్న వరులలో ఇతడే ఉత్తముడని తోచి, కన్యాజనకునికి అట్లే సలహా ఇచ్చియుంటిని. కన్యావరులు పరస్పర సందర్శనఫలము చాల తృప్తికరముగా నుండినది. దాని పరిణామమే వారి వివాహము. అన్యోన్యానురాగ విషయమున నా అభిప్రాయమును మార్చుకోవలసిన సన్నివేశము లేమియు కలిగియుండలేదు. కనుక, ఇప్పుడా సీమంతిని వేసిన ప్రశ్నకు నా కాశ్చర్యమైనది.

అంతలోనే ఆమె లేచి సమీపములోనున్న అలమారులోనుండి ఇంటి జాతకముల పుస్తకమును తెచ్చి నాకిచ్చెను. ఆమె సాయనజాతక చక్రమిదే—

| | | | |
|---|---|---|---|
| వ 25-58<br>వివాహ 23-19<br>పుణ్య 18-21 | భర్త 5-56 | శు 10-0 | |
| చ 28-51<br>గు 27-38<br>ప్రేమ 11-25<br>I 0-10 | (సాయనము) | | రా 6-39<br>య 14-49 |
| పుత్ర 28-56<br>శు 27-2<br>ర 15-47-28<br>కే 6-39<br>బు 3-4 | శుద్ధ జన్మ కుండలి | | దాంపత్య 3-18<br>ఇ 26-36(వ) |
| శ 3-58 | X 10-5 | | |

లగ్నము కుంభములో తులా నవాంశ. ఆ నవాంశాధిపతి శుక్రుడు లగ్నభావమందే కలడు.

“సు నయన వదన శరీరం,
సుఖినం, దీర్ఘాయుషం, తథా భీరుం,
యువతిజననయనకాంతం,
జనయతి హోరాగత శ్శుక్రః.”

అను 'సారావళి' వర్ణనము, స్త్రీ జాతక పరముగా అన్వయించినచో, జాతకురాలికి చక్కగా అతుక గలదు. చతుర్థభాగ్యాధిపతియగుటచే, యోగ కారకుడగు శుక్రుడు లగ్నములో నుండుట ఎంతో రమ్యముగా నున్నది.

"తుర్యేశ్వరే లగ్నగతే, గృహాది
నిర్మాపణం, సౌహృదతస్సుఖాని."
"భాగ్యాధిపే లగ్నగతే, శుభేక్షితే,
భాగ్యస్య వృద్ధి ర్బహుధా విశేషాత్."

అని "తాజకసుధానిధి" ఈ యోగమునకు సత్ఫలమును సూచించినది. గుణము, శీలము, విద్య, ధనము, చక్కగానుండుననియు, పిత్రార్జిత ధనము అంటదనియు, సభామూకత్వము వచ్చుననియు, పరాశర మతము.

"పిత్రార్జిత ధనత్యాగీ,
సభాయాం మూకవ ద్భవేత్,"
(బృహత్పరాశర హోర)

అని. స్త్రీజాతక పరముగా అర్థము చేసినచో, భర్త స్వార్జితముతో జీవించుననీ, నలుగురిలో మాటలాడవలసి వచ్చిన సందర్భములో ఇతరుల మనసు నొచ్చునేమో అనుశంకతో జాతకురాలు చెప్పవలసిమాట చెప్పక (శుక్రధర్మ మది) ఊరకుండుననీ, ఏర్పడుచున్నది. లగ్నాధిపతి శని ధనుస్సులో లాభభావములో నున్నాడు. కోదండ శని ఉత్తమగుణములు కలవాడు. నిర్వాహకశక్తి, ఖ్యాతి, విజ్ఞాన శాస్త్ర కౌశల్యము, ఇట్టివి శని వలన కలుగును.

"ప్రభుశీలో విఖ్యాతో,
లాభే, విజ్ఞానశాస్త్ర కుశలశ్చ."

అని 'హోరా సారము'. మరియు,

"సుశీలో, ధర్మవి, న్మానీ,
బహూదారగుణై ర్యుతః"
(బృహత్పరాశర హోర)

అనుట లగ్నాధిపతి లాభమందుండుటకు ఫలము.

ధనభావములో గురుచంద్రసంయోగ మున్నది. అందులో కుంభ గురువు కర్కాటక గురువువలె ఫలముల నిచ్చువాడని వరాహమిహిరాచార్యుడు చాటి చెప్పినాడు. ఈ యోగమునకు ‑ క సమృద్ధి, సంతాన భాగ్యము, పతి సౌఖ్యము, వినీతస్వభావము, ఫలములట!

"గురుచంద్రయోగజాతో,
ధనవాన్, సుతదారవాన్, వినీతశ్చ,
సర్వత్ర ఫలం ప్రోక్తం,
ముక్త్వా సహజారిభం, తయో ర్నీచం."
(హోరాసారము)

ఈ యోగముల సమష్టి ఫలము జాతకురాలిస్వభావములో నున్నవి.

అది యట్లుండె. ప్రకృతాంశమునకు వత్తము. సప్తమాధిపతి రవి లగ్నాభిముఖుడై దీప్తాంశలతో లగ్నమును స్పృశించుచుండుట భర్తకు పత్నీపరాయణత్వమును తెలుపగలదు. అందులో రవికి శుక్రసంయోగము. అనగా, విషయసుఖాధిపతితో భర్తృభావాధిపతి చేరుట! దాంపత్య ధర్మములో దీనికి ఉత్తమఫలము కలుగుట గొప్పకాదు. దాంపత్య సహామము భర్తృభావమందే నిలుచుట ప్రశంసనీయము. పైగా, లగ్నాధిపతి శనినుండి దానికి సకలార్థసాధకమగు ప్రత్యక్షస్నేహదృష్టి యున్నది. ఇక, భర్తృసహామమునకు సైతము ఆ లగ్నాధిపతినుండి అట్టి దృష్టి సౌకర్యమే కల్గుట జాతకురాలి పుణ్యంపుపంట! భర్తృభావాధిపతియగు రవితో అర్ధకోణశుభదృష్టిలో పుణ్యసహామముండుట ఆమె పూర్వపుణ్యఫలముగా అనుకూలుడగు భర్త లభించునను సూచన. రమ్యమగు దాంపత్య జీవితము జాతకురాలికి రాగలదని ఈ యోగముల వ్యాఖ్యానము.

ఈమె జాతకముతో భర్త జాతక మెట్లు అతుక గలిగినదో చూతము. (*)కుజశుక్రుల ఆత్యంతిక సంయోగముకల జాతక మతనిది. అనురాగమునకు గొప్ప విలువగల యోగమిది. ఈ గ్రహసంయోగ స్థానమునకు నిండుగా త్రికోణస్నేహదృష్టిలో జాతకురాలి కుజుడుండుట ఈ దంపతుల భాగ్యము. వారికిగల అన్యోన్యానురాగ సంపత్తి నిది వేనోళ్ళ చాటగలదు. భర్త చంద్రునితో జాతకురాలి రవికి మిత్రదృష్టి కలదు. పరస్పరభక్తి తాత్పర్యముల కీ యోగము తార్కాణ. అతని లగ్నము ఆమె గురుచంద్రుల సంయోగము నపేక్షించుచున్నది. అతని గురువు ఆమె లగ్నమును, లగ్నాధిపతినిసహా, శుభదృష్టితో చూచుచున్నాడు. ఆమె రవి (సప్తమాధిపతి) పైననే అతని ప్రేమసహామము స్థానము నేర్పరచుకొన్నది. అతని సప్తమాధిపతి (రవి)తో నిండుగా త్రికోణదృష్టిలో ఆమె ప్రేమ సహామము నిలుచుట!

ఈ దంపతుల వివాహబంధము ఉత్తమకక్ష్యకు చెందినదనుటకు ఇంకేమి కావలయును? దాంపత్య విషయమున దోషము లేమియు కానరావు.

జాతకముల నొకమారు పరిశీలించి ఆమెతో ఇట్లంటిని.

---

(*)గ్రంథవిస్తరభీతిచే భర్త జాతకి మిచట చూపలేదు. సందర్భమునకు వలసిన అన్యోన్యగ్రహాది యోగములు మాత్రము సూచించబడియున్నవి.

"ఇన్ని సంవత్సరములు కాపురముచేసిన తరువాత, ఇప్పుడు నీకు భర్తలో లోపము కానవచ్చిన దేమమ్మా?"

"అయ్యో? వారిలో లోపమున్నదని ఎవ్వరనిరి?"

ఆమె ప్రశ్నను నేను తప్పుగా అర్థము చేసుకొంటినను భావము ఆమె ముఖములో చూపట్టినది.

"మరి?" ప్రశ్నార్థకముగా ఆమెను చూచితిని. అందుల కామె

"నానుండివారికి ఎన్నియో కష్టములువచ్చియున్నవి కదా? నక్షత్రానుకూలము మాకు బాగుగా నుండినచో, ఇట్లు జరిగియుండెదేమో?" అని దీనముగా ప్రతి ఇచ్చెను.

"అమ్మాయీ! వివాహముకొరకు నక్షత్రానుకూల్యము చూచుసందర్భములో, కన్యావరులకు అన్యోన్యానురాగ బంధము చక్కగా, నిరపాయముగా నిర్వ్యాజముగా, ఉండవలయుననునదే ప్రధాన లక్ష్యము. మీ బంధమెట్టిదో, నా వ్యాఖ్యానము అనవసరము. ప్రమాణము నీవే! ఇక ఇతర కష్టముల మాట వేరు. ప్రపంచమున కష్టములే లేని వారెవరు? సీత ద్రౌపది......" అనునంతలో,

"మంచిదేకాని, నానుండి మావారికి కష్టములు కలుగునని నా జాతకములో నున్నది కాబోలు?"

అని తన సమస్యకు మార్గాంతరమును చూపినది. ఆమె కన్నులు చెమ్మగిల్లినవి పాపము!

"నీ నుండి నర్థకు ఏ కష్టములు కానీ రావు. అతని కష్టములను నీవు పంచుకొని అతని భారమును కొంత తగ్గించుచున్నావు. అంతే."

"ఏమోకాని, వారి కష్టములకు నేనే బాధ్యురాలనని నా భయము."

"నిస్సంశయముగా నీకు బాధ్యత ఏమీ లేదు." అంటిని.

"మరి ఎవరు బాధ్యులు?"

"చెప్పవలెనా? ఐతే, వినుము. నిర్ణయించిన ముహూర్తమును వదలి, ఒక దినము ముందుగానే నీకు వివాహము జరిపినారనుట మరచియుంటివి. సుముహూర్తము తప్పిపోయి దుర్ముహూర్తములో పెండ్లి జరిగినది. దాని ఫలమే మీ కష్టములు. ముహూర్తమును ఆ రీతిగా మార్చిన మహానుభావులే బాధ్యులు."

నా సమన్వయము ఆమెకు తృప్తికాలేదు. ఆమె పూర్వపక్షమిది:

"నిర్ణయించిన ముహూర్తమునాడు మాకు తారాబలము లేదనికదా, మా మామగారట్లు మార్చిరి! మరి, దోష మెటయినది?"

సమాధానము చెప్పవలసివచ్చెను.

"అయితే, క్షణకాలము ఓపిక పట్టుము. ఆ ముహూర్తచక్రములను చూచినదే నీకు అర్థముకాగు."

చక్రములను గుణించితిని. వివాహము జరిగిన ముహూర మిది:—

| | | | |
|---|---|---|---|
| | శు 29-15 | బు11 9(వ)<br>ర 13 40<br>X 16 45 | వ 7-25<br>శ 24-12 |
| కే 1-37 | (సాయనము)<br>—<br>వివాహ ముహూర్త | | కు 19-38 |
| పుణ్య 0-10 | చక్రము | | రా 1-37<br>య 6-27<br>I 16 10<br>గు 17-43 |
| | | ఇ1-61 (వ) | చ 27-40 |

వైశాఖ శుక్ల ద్వాదశీ గురువారమున ఉత్తరా నక్షత్రములో సాయన సింహలగ్నపు సింహనవాంశలో ఈ వివాహము జరుగుట! నిర్ణయించి యుండినది వైశాఖ శుక్ల త్రయోదశీ శుక్రవారమున హస్తా నక్షత్రములో సాయన సింహరాశిలోని కన్యానవాంశ. దీని చక్ర మిది:—

| | | | |
|---|---|---|---|
| | | శు 0-28<br>బు10-31(వ)<br>ర 14-39<br>X 19-0 | వ 7-29<br>శ 24-20 |
| కే 1-34 | (సాయనము)<br>—<br>నిర్ణయించియుండిన | | కు 20-12 |
| పుణ్య 12-7 | ముహూర్తము<br>— | | రా 1-34<br>య 6-28<br>గు 17-47<br>I 18-0 |
| | | ఇ 1-50(వ)<br>చ 9-46 | |

ఈ రెండు చక్రములందలి గ్రహస్థితిని పోల్చి చూచితిమేని, ఒక్క చంద్రస్థానములో తప్ప తక్కిన వానిలో చెప్పుకోతగినంత మార్పు చూపట్టదు. లగ్నము సింహనవాంశపోయి కన్యానవాంశ అయినది. అంతే.

కాని, వివాహకాలమున చంద్రునికి ఏ గ్రహముతో నైనా సంయోగము ఉండరాదనుట ముఖ్య సూత్రములలో నొక్కటి. చంద్రునికి గ్రహసంయోగమున్నచో "సగ్రహచంద్ర" మను సాంకేతిక నామము కల మహాదోషముగా పరిగణించబడుచున్నది. ఏ గ్రహముతో చంద్రుడు చేరినప్పుడు ఏమి ఫలము వచ్చునో, ముహూర్తశాస్త్ర సూత్రములు చెప్పుచున్నవి. కుజునికి వ్యాధి, బుధునికి సంతాన రాహిత్యము, గురువునకు దౌర్భాగ్యము, శుక్రునికి సాపత్న్యము, శని వలన సన్యాసము ఫలమట! కాని, నూతన గ్రహసంయోగములకు మన ప్రాచీనగ్రంథములలో ఫలము సూచించబడలేదనుట వాస్తవము. అయినా, దానికి ఫలము లేదనుకొనుట పొరబాటు. ముహూర్తకాలమున చంద్రునితో ఏ గ్రహము కానీ, చేరరాదనుట మూలసూత్రము. ఈ ఉపపత్తిని పురస్కరించుకొని ఏ గ్రహస్వభావమువలన ఏ ఫలము రావచ్చునో, సులభముగా మనము ఊహించుకొనవచ్చును.

ఇచట, చంద్రుడు ఇంద్రసంయోగమునకు పోవుచున్నాడు కదా! ఇంద్రుడు మహామాయావి; సత్యాసత్యములను తారుమారుచేసి చూపగల ఐంద్రజాలికుడు; టక్కు, టమారు విద్యలలో నిపుణుడు. అహితకరుడుగా ఏర్పడినప్పుడు, ఆ గ్రహము సిద్ధపరచు పరిస్థితులలో మోసమో, ద్రోహమో, ఒనరింపగలడు. యోగ్యుడు అయోగ్యుడుగా, శీలవంతుడు దుశ్శీలుడుగా, సుగుణము దుర్గుణముగా, చూపట్టుట అతిసులభము. నమ్మించి నట్టేట ముంచుట అతని విద్య. ఆడికలు, అపవాదులు, నీలాపనిందలు, సమృద్ధిగా అనుభవించవలసివచ్చును. ఆ గ్రహము తెచ్చిపెట్టు సంకట పరిస్థితులు తప్పించుకొనగల్గుట సులభము కాదు. అదే ఇంద్రుని చమత్కారము.

ఇట్టి చంద్రునితో వివాహకాలమున చంద్రుడు చేరినచో, ఇంద్రప్రభావము ఆ దంపతుల వైవాహిక జీవితములో ఏదోవిధముగా చూపట్టక తీరదు కదా? ముహూర్త చంద్రుడు ధనస్థానములో నున్నాడు. ఆర్థిక సమస్యలలో ఇంద్రమాయ అగుపడుట సహజము. రావలసిన ద్రవ్యమో, ఆస్తియో రాకపోవుట, చేతనున్న ద్రవ్యము ఏదో కారణమున ఉన్నట్టుండి మాయమగుట, ఇతరుల నష్టములకు అనవసరముగా బాధ్యత వహించవలసివచ్చుట, లేనిపోని అపనిందల పాలగుట, మున్నగు ఫలములు రావచ్చును. ఇట్టి పరిస్థితులలో పుణ్యసహమముసహా ఆ యింద్రుని కేంద్రవేధ పాలగుట మరింత శోచనీయము. జన్మకాలములో ఇంద్రుడు దుష్టుడుగా నున్నవారికి, ఇట్టి ముహూర్తయోగము మహాక్లేశకారి యగుటలో ఆశ్చర్యములేదు.

ఇంతమాత్రము కాదు. ఈ ముహూర్తమునకు ఇతర దోషములు సయితము కొన్ని పట్టియున్నవి.

(1) అనగా ద్వాదశీతిథి? ఇది పక్షచ్ఛిద్రము. వివాహమునకు తగినది కాదు.

"ద్వాదశ్యాగ్యాసకరీ" అని మహర్షులు చెప్పిరి.

"ద్వాదశీ మమమీంశైవ,
వర్జయేత ప్రయత్నతః."

అను నిషేధ సూత్రము సహా కలదు.

(2) ముహూర్తకాలమున రవి చంద్రాంతరము 184° భాగలు అగుటచే తిథి త్యాజ్యకాలములో పెండ్లి జరుగుట

(3) గురువారముతో ద్వాదశీ తిథి చేరినచో, 'దుష్టతిథివార'మగును. శుభకార్యముల కూడనిది ఇది.

(4) వివాహలగ్నమునకు క్రూరమగు సింహనవాంశ హితము కాదు.

(5) ఇంద్రవేధ చంద్రునికి మాత్రమే కాక, లగ్నమునకు అర్ధకేంద్రము, సప్తమమునకు సార్ధకేంద్రము, వధూవరులను నేరుగా ఇది బాధించగలదు. ఇన్నింటిలో ఇంద్రవేధయే మేరువు పూస.

ఈ లగ్నములో బృహస్పతి ఉండుట వాస్తవము. గురువు లగ్నములో నుండెనేని, దోషములు నశించుననుట సామాన్యసూత్రము. ఇది అల్పదోషముల విషయమే కాని, మహాదోషములను గూర్చి చెప్పిన శాస్త్రము కాదు. ఈ మర్మమును విద్యామాధవసూరి ఎంతో స్పష్టముగా చాటి చెప్పియున్నాడు:

"శుభగ్రహాణా ముదయోస్తి నిత్యం
నతావతా కర్మ శుభం విదధ్యాత్,
గ్రాహ్యో మహాదోష వివర్జితోయం,
ఇదం ముహూర్తస్య పరం రహస్యం."

(విద్యామాధవీయము)

అని. మరుదినము నిర్ణయించిన ముహూర్తమున ఉత్తమమగు త్రయోదశి తిథి. చంద్రుడు ఇంద్రసంయోగమును దాటి 8 భాగల పట్టు ముందుకు పోయినాడు. కనుక, అతనికి ఇంద్రవేధ రాదు. లగ్నసప్తమములు సయితము అతని వేధను తప్పించుకొని యుండును. తిథిత్యాజ్యాది దోషములు లేవు.

# దుర్ముహూర్త ఫలము

"ఇతి, తులా, జతుమ, ప్రమదా, ధనుః
ప్రథమఖండే, మఖండఫలం జగుః"

(వివాహబృందావనము)

అనుటచే, లగ్నమండలి కన్యానవాంశ ఉత్తమ ఫలము నీయజాలినది. లగ్నాధిపతి రవితో, భవలాభాధిపతి బుధునితో, త్రికోణ శుభదృష్టిలో నున్నది పుణ్యాహము. చక్కని ఆర్థిక సౌకర్యము నిచ్చు యోగ మిది. ఎన్నియో విధములుగా ఈ ముహూర్తము ఇతర ముహూర్తముకంటే, ఉత్తమఫలము నిచ్చియుండ గలదు.

ముహూర్తము నిట్లు మార్చుట వధూవరులకు హితము కాదు. అంటే, గురుద్దేశముతో పెద్దలు ఇట్లు ముహూర్తమును మార్చిరని కాదు. నిస్సంశయముగా వధూవరుల క్షేమచింతతోనే ముహూర్తమును మార్చుట. ఉద్దేశములో లోపములేదు కాని, శాస్త్రజ్ఞానము లేనివి నక్షత్రసూచకులిదో బుద్ధిలోపమని. వరుని నక్షత్రము విశాఖనుండి ప్రవేశించినచో, త్రయోదశినాటి నక్షత్రము 25 వది అగును. అనగా, మూడవ నవకములో ఏడవది అనుట! అగుటచే, ఆ నక్షత్రము వరునికి 'నైధనతార' అగుచున్నదని భయపడి, ముందు నాడు 'సాధనతార' అగునని ఈ మార్పు చేసినారు. వృశ్చికములో 18°-19' అతని చంద్రస్థానము అచటి నుండి ముహూర్త చంద్రుడు 321°-27° దూరమగును. కనుక మూడవ నవకములో 81°-27' అగు ననుట. ఏడవతార 80° నుండి 93°-20' వరకు వ్యాప్తిలో నుండగలదు. ఆ తారలో మూడవ పాదము (86°-40' నుండి 90°-0' వరకు) మాత్రమే దుష్టమనియు. ఇతర ప్రదేశములు శుభమే అనియు, మహర్షులు నిర్ధరించినారని ముహూర్తము మార్చినవా రెరుగరు.

"ఆద్యంశో విపత్ త్యాజ్యః;
ప్రత్యరే చరమో (అ) శుభః;
వధే త్యాజ్యః తృతీయోంశః;
శేషా స్త్వేష్వపి శోభనాః." (గురువు)

అను అపవాదసూత్రము తెలియని దోషమది.

కాని, మార్పుచే సాధించిన ఘనకార్యమేమో గమనింపుము. పెండ్లినాటి ఉత్తరానక్షత్రము వధువునకు ఎనిమిదవ నక్షత్రము (మిత్రతార)గా ఎంచుకొన్నారు. కాని, ఆమె జన్మచంద్రస్థానమునుండి వివాహ చంద్రస్థానము 208°-49' అనగా, రెండవ నవకములో 88°-49' కాగలదుకదా? ఇది స్పష్టముగా ఏడవతారలో త్యాజ్యమగు మూడవపాద ప్రదేశమే అగునని వారికి తెలియలేదు.

మరియొక్కటి! వధువు జన్మచంద్రునికి అష్టమ భావములో ముహూర్తచంద్రుని నిలిపి వివాహముచేసినట్లయినది కదా?

"అష్టమగే నష్టసుఖా,
నిత్యోద్విగ్నా, వికర్షితా సద్భిః"

క్లేశము, సుఖాభావము, అపవాదము, ఈగోచారయోగపు ఫలము. ఇట్టి ముహూర్తము వధువునకు క్లేశకరమగుట వింతకాదు.

విషయమంతయు సావధానముగా విని జాతకురాలు క్షణకాలము చక్రములను పరికించి, చిన్నగా నిట్టూర్చి, దైన్యమును సూచించు చూడ్కులతో, నన్ను చూచుచు—

"మరి! ముహూర్తములో దోషమున్నదని మీరైనా చెప్పియుండరాదా?" అనియెను.

"చెప్పియే యుంటిని. నీ మామగారిది గట్టిపట్టు. అతనితో ఈ సందర్భమున విరసము సంపాదించుకొన్నచో, మంచిసంబంధము తప్పిపోవునేమో, అని భయపడి, అతని ఇష్టానుసారమే జరిపినాడు నీ తండ్రి.

"మూర్ఖం ఛందానువర్తేన,
యాథార్థ్యేన పండితం."

అని పెద్దలు చెప్పిన నీతి. ఇప్పటి కాలములో కన్యాజనకుల కష్టములు నీకు తెలియనివికావు. వరుడు దొరకుటే మహాప్రయాస. పుణ్యమా అని, తగిన సంబంధము లభించినపుడు, దానికి విఘ్నము తెచ్చుకొనుటకు ఎవరు సాహసింతురు? 'భగవంతుడు వ్రాసినట్లు జరుగు'నను సమాధాన మొకటి ఉండనే ఉన్నది కదా? వరుని తండ్రికిసహా జ్యోతిశ్శాస్త్రముపైన అభిమానము, అందులో కొంత ప్రవేశము కలదని ప్రతీతి. కన్యావరుల హితమును మనస్సులో ఉంచుకొనియే ఈ మార్పు చేసియుండునని అమాయకుడు నీ తండ్రి విశ్వసించినాడు. ఇట్టి సన్నివేశములలో నేను చేయగలిగినదేమో, నీవే ఆలోచించుము" అంటిని.

ఆమె నిరుత్తర అయినది. క్షణకాలము ఊరకుండి మరల ప్రారంభించితిని.

"అమ్మాయీ! ఇది అంతయు మనస్సులో ఉంచుకొనియే, జాతకశాస్త్రము వ్యాసంగము చేయుమని నీతో అప్పుడప్పుడు చెప్పుచుంటిని. పాశ్చాత్య గ్రంథములు, మన గ్రంథములుసహా, అర్థము చేసుకొనగల యోగ్యత నీకున్నది. అభ్యసించియుండినచో, రానున్న దశాదులను గమనించి తగినరీతిగా జాగరూకతతో ప్రవర్తించియుందువు. కాని,....."

అనునంతలో జాతకురాలు అందుకొని, కొంచెముగా కనుబొమలు చిట్లించి,

"అంటే, నా అజాగరూకతవలననే కష్టములు వచ్చినవని మీ అభిప్రాయ మన్నమాట!" అని విమర్శించెను. వాస్తవస్థితిలో చాలా తెలివి, జాగరూకత, సమానశక్తి, కలది జాతకురాలు. ఇట్లు సమాధానము చెప్పితిని.

"నా అభిప్రాయమును నీవు సరిగా గమనించలేదమ్మా! అత్తమామలకు నీయందు గొప్ప విశ్వాసమున్నదని గట్టిగా నమ్మి భక్తి శ్రద్ధలతో వారిని సేవించుచుంటివి. ఇప్పుడు దాని సత్యము తేలినది. నీ భక్తికి, నమ్మకమునకు, తగిన ఫలము రాకపోవుటే నీ మనఃక్లేశమునకు కారణము. నీ జాతకములో భర్తృస్థానమునకు (VII) దశమభావము, అనగా చతుర్థస్థానములోనున్న కుజునికి (శ్వశుర స్థానాధిపతికి) వరుణుని అర్ధకేంద్రవేధ ఎంత నిశరముగా నున్నదో చూడుము. మామగారితో మనస్పర్థలు వచ్చు సూచన ఇది. ఇది తెలుసుకొనియుంటివేని, అట్టి నమ్మకము నిరర్థకమని, ప్రమాదకారియని సులభముగా గ్రహించియుందువు. ఇంత క్లేశమునకు అవకాశము లేకుండునట్లుగా ప్రవర్తించియుందువు."

"ఈ రహస్యము నాకెప్పుడుకాని మీరు చెప్పనేలేదే?" అని ఆమె తీక్ష్ణముగా చూచినది.

"అమ్మాయీ! అత్తమామలపైన—అందులో వారు గొప్ప ధనికులు—అపార భక్తివిశ్వాసములుకల కోడలికి వారిపై అసూయ కలిగించుమాట చెప్పుట ఏమి నీతి? అట్లు చెప్పియుంటినేని, అనుభవము లేని నీవు నా మాటలు విశ్వసించియుందువా? ఆలోచించుము. అప్పుడు ప్రాపంచికముగా నాకు ఎట్టి ఫలము వచ్చియుండెడిదో?" అని, క్షణమాగి, మరల, "విషయము శాస్త్రముద్వారా నీవే గ్రహించినచో క్షేమమని తలంచియే, దానిని వ్యాసంగము చేయుమని పదేపదే నీకు సలహా ఇచ్చుట. శాస్త్రవిశ్వాసము లేక, నిరాదరించితివి" అంటిని.

అందుపై ఆమె పూర్వపక్షమిది: "పోనిండు. జాతకములో లేనిఫలము ముహూర్తమునుండి రాగలదా?"

ప్రశ్న సమంజసమైనదే. కాని, ఇది గొప్ప చిక్కు సమస్య.

"తిథివారర్క్ష లగ్నాదే,
ర్యాముక్తం సదసత్ఫలం,
తత్సర్వం జాతకాధీనం
న స్వతః ఫలదం స్మృతం."

అని ప్రాచీనుల సిద్ధాంతము. ముహూర్తపు ఫలము జాతక ఫలమునకు అధీనమనుట! అనగా, ముహూర్తమునకు ఫలము లేదని కాదు. ఒక విధముగా ఈ రెండింటికిని సేవ్యసేవక సంబంధమున్నదనవచ్చును. జాతకము యజమానుడు, ముహూర్తము భృత్యుడు. యజమానుని ఆజ్ఞ ననుసరించి భృత్యుడు పని చేయవలయును కదా? జరుగవలసిన కార్యపు స్వభావమును నిర్ణయించువాడు యజమానుడు. ఆ కార్యమునకు స్వరూపము నిచ్చువాడు భృత్యుడు. జాతకము దైవాధీనము. ముహూర్తము పురుషకారాధీనము. దైవము సూచించు ఫలస్వభావమునకు పురుషకారము యొక్క స్వరూపమును కల్పించగలదు. అనగా, జాతకము సూచించు ఫలమునకు ముహూర్తము ఒక స్వరూపము నిచ్చుననుట!

జాతకురాలికి ధనభావమందు గురు చంద్ర సంయోగమున్నది కదా? ఆ సంయోగమునకు ఇంద్రుని సమసప్తక వేధ ప్రబలముగా నున్నది. ఆర్థిక విషయములలో ద్రోహమునకో, మోసమునకో, అపనిందలకో, ఆమె గురి కావలయుననుట దైవఫల స్వభావము. ఎన్నియో రూపములలో అది రావచ్చును. కాని, వివాహ ముహూర్తములో చంద్రునికి ఇంద్ర సంయోగము, పుణ్యసహమమునకు ఇంద్రుని కేంద్రవేధ సహా సంపాదించి ఇచ్చుటచే వైవాహిత జీవిత సంబంధముతో ఆ దైవఫలము అనుభవించవలెనని ఆశీర్వదించినట్లు, అథవా శపించినట్లు కథ జరిగినది. అష్టమభావము స్త్రీ జాతకములలో అత్తవారింటి ద్రవ్యమును సూచించును. జాతకములో అష్టమభావములోనున్న మాయావి ఇంద్రుడు ఆ ద్రవ్యమునకు 'కరటక-దమనక' విద్యతో సంబంధము ఉండగలదని సూచించును. ఇంద్రమాయతో ఆ సంబంధము ఎన్నిరూపములయినా ధరించవచ్చుననుట. సమయ సందర్భముల కనుగుణముగా దానికి ఎన్నియో అవకాశములు కలుగును. ఒకప్పుడు వెలకల వస్తువొకటి మాయమైనది. ఎన్నాళ్ళకో ఈ నష్టమును కనుగొన్న అత్తమామలు నిర్దోషియగు జాతకురాలిపై నిందమోపి, సొమ్ము నపహరించి పుట్టినిల్లు చేర్చినదని, ఆమె భర్తతో కొండెములు చెప్పినారు. కాని, వివేకశాలి భర్త సహధర్మచారిణి శీలమును సందేహించలేదు. తన వాదమునకు బలము వచ్చునట్లుగా ఎచ్చటి

నుండియో ఒక శకునపక్షి సాక్ష్యమునుసహా వారు కష్టపడి సంపాదించి చూపినారు. కాని, పరిశోధించి అది నాటకమని కనుగొని, తండ్రి అభిప్రాయమునకు విసికి, వేసరి, గౌరవముగా బలుసాకైనా తిని బ్రతుకుట మేలని నిర్ధరించి, ఇల్లువదిలి, నగరాంతరముచేరి, జాతకురాలి భర్త ఏదో ఉద్యోగమొకటి సంపాదించుకొని తన కుటుంబమును పోషించుచున్నాడు. కుమారునికి వేరు కన్యకను పెండ్లి చేయుటకు పెద్దలు ప్రయత్నించినా, జాతకురాలిని చూచి ప్రేమించిన వరుడు తన సంకల్పమును మార్చుకొనలేదట! ఈ దంపతులు అన్యోన్యతకు భంగము కల్గించుటకై ఈ ప్రయత్నము జరిగినదేమో అని సయితము కొందరు సందేహించినారు. ఈ దంపతుల బంధము సృఢమయినది. వారి జాతక గ్రహముల అన్యోన్యమైత్రి అమూల్యము. స్త్రీయమగు ఆర్థిక సౌకర్యమునకు దూరమై, నిరాడంబరముగా కాలము కడుపుచున్న భర్తకు తోడునీడయై, కష్టములకోర్చి, "జీవన్ భద్రాణి పశ్యతి" అని దైవమును నమ్మి జాతకురాలు కాలము గడుపుచున్నది.

వివాహమై పదునొకండు సంవత్సరములు నిండినదాకే జాతకురాలిపై ఈ నింద మోపుట! ఆమె చలితగురువు, నికరముగా జన్మశనికేంద్రవేధకు వచ్చిన కాలమది. గురువు ధనభావముతో అధిక సంబంధము కలవాడగుటవలన, ద్రవ్యవిషయమున నష్టము, క్లేశము రావలసిన దశ నడచుచుండినది. ఆ గురువునకు ఇంద్రవేధ యుండుటచే, ఈ దశాఫలములో మోసమో, కుట్రలో, కుతంత్రములో మిళితమగుట తప్పదు.

ఇట్లుండగా, అప్పటికే ముహూర్తకాలికిసహా జీవమానదశలు సాధించినచో, ముహూర్త శుక్రుడు చలించి రవి సంయోగమున వచ్చియుండెను. దశకు తగినట్లు (నెల దినముల బాలింతరాలామె) రత్నము వంటి పుత్రుని ప్రసవించియుండినది. ధనాధిపతి బుధుడు చలించి యముని కేంద్రవేధపాలయినాడు. ప్రబల దుష్టఫలము ఆర్థికముగా వచ్చుదశ ఇది. ఇట్టి స్థితిలో చలిత వివాహలగ్నము జాతకురాలి ఇంద్ర సంయోగమును సంపాదించుకొనుట, చలిత చతుర్థ భావము జన్మకాలపు ఇంద్ర గురువుల మధ్యమునకు వచ్చి, వివాహ చంద్రునితో మిత్రదృష్టి నార్జించుట అప్పుడే. ఎవరి దుర్మంత్రమో మామగారి మనస్సును చెరిచినది. చలిత గురువు ముహూర్త కుజునితో సార్ధకేంద్రమునకే వచ్చియుండెను. ముహూర్త చక్రములో చతుర్థాధిపతి కుజుడు మామగారిని తెలుపును. గురువు వలనవచ్చిన క్లేశములో కుజుని వేధ చేరియున్నదనుట. చలిత ముహూర్తచంద్రుడిపుడు జన్మచంద్ర స్థానమునే చేరుకొని వైవాహిక జీవితమునకు దశాఫలమును చేర్చినాడు.

మరియొక్కటి. నిందారోపణము జరిగిననాటికి జాతకురాలి దైనిక కేంద్రములను గుణించితిమేని చతుర్థభావము నికరముగా కన్యారాశిలో 8° లో నుండును. అనగా, ఆమె చలిత గురువునకు సమసప్తకములో ఉండుననుట. జన్మశనితో కేంద్రవేధ, ముహూర్త కుజునితో అర్ధకేంద్రవేధ కలస్థానమది. మామగారి అనుగ్రహ మీ రీతి ఫలించినదనుటకు వేరు సాక్ష్యము కావలయునా?

రానున్న దశలయొక్కయు, ముహూర్తము యొక్కయు స్వభావమును జాతకురాలు గ్రహించ గలిగియుండెనేని, దుష్టదశాకాలములో దూరముగా నుండి దుష్ఫలమును చాలవరకు తగ్గించుకొనియుండును. నమ్మి మోసపోవలసిన అవసరము వచ్చియుండదు. ఏదో నష్టమో, నిందయో వేరువిధముగా ఏర్పడి, ఇంత కష్ట మనిపించియుండదు.

సరి! ఇది గత జలసేతుబంధనము. ఇక, రెండు మూడు సంవత్సరములు గడచినచో, దశలు మారగలవు. తరువాత తొందర యుండదు. జాతక వాగ్దానములను గమనించి జాతకురాలు తన జాగరూకతతో ప్రవర్తించవలసియుండును. శాస్త్రవ్యాసంగము చేయుట ఆమెకు శ్రేయస్సు.

విషయము నంతయు సావధానముగా విన్న తరువాత జాతకురాలి ముఖము కొంత కలకదేరినది. అంతలో ఆమె కుమారులలో నొక పసివాడు ఇంటి ముందర తోడిబాలురతో బొంగరము లాడుచుండిన వాడు, కాలుజారి క్రిందపడి కాలికి చిన్నగాయము చేసుకొని, భోరున ఏడ్చుచురాగ,

"అవకాశము దొరకుటే కష్టము. అయినా, ప్రయత్నింతును."

అనుచు వాని నెత్తుకొని సమాధానము చేయ సాగుటచే నా కథ ముగిసెను.

"సుఖ దుఃఖకరం కర్మ
శుభాశుభ-ముహూర్తజం."

# వాం ఛా ను మి తి

## శ్రీ సంపత్కుమార

ఒక కొండ కొమ్ముకొన ని
ల్వక క్రిందికి గుండు జారిపడు నవ్వడి పో
లిక, మిన్ను నవ్వికొనిన
ట్లొక ఉరుమది దిక్కుకొనలనుం డిటు వచ్చెన్.

ఎట ఏమూలనొ ఒక్కగర్జ, మరి అట్లే ఒక్క విద్యుత్తు, వే
సటలం గుండు నెడందకున్, జిరము వెచ్చన్గ్రాగు ప్రాణాని కూ
రటలం గూర్పగ జాలు, పైన మరి తంద్రాశీల మీా మబ్బు లిం
తటినై మింటిని గప్పెడున్ బ్రదుకులోనన్ జిల్లపందిళ్లుగా.

మూలల్ మూలలనుండి చిన్నచిన మబ్బుల్, క్రొత్త అందాల నీ
లాలై, విచ్చిన నల్లకల్వలయి, లీలా లాస్యకృత్కేకి పిం
ఛాలై, ఎల్లెడ మింట గ్రమ్ముకొని స్వచ్ఛాయా ప్రసారమ్ములన్
నేలన్ సర్వమునందు స్వప్రభుత నందెన్ వార్షికస్వామ్ములై.

ఈ విద్యుత్తులు విచ్చుకొన్నయవి, తా మీా గాఢనీలాభ్ర మా
లా వల్లీ తనువెల్ల పువ్వులయి, హేలాహాసముల్ మోము నిం
డా విప్పారిన ఈ వియత్తు మనసంతా నిండు వాంఛాళియై,
ఏవో నూతనలోక నిర్మితికి చిత్రించే ప్రభా రేఖలై.

ప్రామిన సన్నజల్లు వలిపంపుతెరల్ విడదీసికొంచు, ఊ
హా మధురమ్ముగా వెలుగుచల్లిన దారులనుండి వచ్చి సౌ
దామని నాఎడంద కెడదన్ గదియించిన నేమి యయ్యె! వాం
ఛామితి లేని ఈ మనసు సౌఖ్య మధొక్క గనేమమాత్రమై.

ఈసన సన్నజల్లె గిలిగింతలుగా నునుసిగ్గువోవు పృ
థ్వీసతి, తాను గంధవతి, విచ్చిన వేయివిధమ్ములైన ఉ
చ్ఛ్వాసము లట్లుగా, మధుర వాసనలెల్లను వ్యాకరించు నా
ఈ సుకుమార మానస మిదెల్ల పురాస్మృతి బంధకస్తవమా.

# వాంఛాసమితి

మరి ఈ వాసనలెల్ల నూత్నములు సంస్పందమ్ములా ఏమి ? జీ
వ రహస్యమ్ములుగా మనఃపుటిని నీవారాంత శూకాగ్ర భాః
పరమమ్ముల్ పరిలీనముల్ చిరములై, వ్యాపించు నీనాడు, బా
హిరమైనట్టి సధర్మకర్షణముతో ఈఎల్లయుం దామునై.

నేనై తా మొదలైన వాసన లివగ్ని, ఆమె నేత్రాంత వీ
క్షానైశిత్యమునన్ సహస్రవిధ వాంఛారేఖలై చీలి, సం
ధ్యా నృత్యచ్ఛిఖి పింఛకేసరములై, తాపింఛ నీలాంబుద
శ్రేణీ కోణ మనోహరారుణ విభాశ్రీలై, ఎదన్ కల్పెడున్.

ఈ వాంఛల్ బడి లక్షయాతనలు, మిన్నెత్తైన దీ వాంఛ, మి
న్నా, విస్ఫారు తమోగుణమ్ము బహుధానై ముబ్బుతున్కల్, తథా
భావమ్మందును నొక్కసారి సుఖ మాభాసించు, ఐరమ్మద
శ్రీ విస్ఫూర్తి వలెన్ నిరంతరధురారేఖానిరాసమ్ముగన్.

వెలిగిన దివ్వె కొట్టకొన విచ్చిన చిక్కని ధూమరేఖ, మి
న్నలమిన గాఢధూమమున ఆడెడు చిన్నరి విస్ఫులింగ, మీ
పోలకువ నున్న దీసుఖము పొందుట దుఃఖము పొందుటల్; నిరా
కులముగ లేసి ఏ ద్వివిధకుంచితమా అనుభూతి మార్గముల్.

అల సర్వమ్మననుండి వేరయి 'తృతీయఃపంథ'లో సాగు వాం
ఛలతో సంచలనమ్ము పొందెడు మన సౌఖ్యమ్మిదేమో ? ఇది
ట్టు లటంచున్ మరి వేరువేరు విడిపాటుంగూడ చేయంగ లే
క, లిలీక్షామతి నయ్యెదన్ వివృత లోకమ్మందు ఒక్కండనై.

ధనువై సామి మనోజ్ఞచక్రము వియద్భాగమ్ము, చిన్నారి చ
క్కని రెక్కల్ విదలించుచున్ జను బలాకాశ్రేణి తా నారిమై
నన జల్లుల్ విశిఖమ్ములైన మదనస్వామీ ! ఇదో; గుండె వి
చ్చిన ఈ బాడబరీతి వాంఛను వెచ్చింతున్ త్వదర్థమ్ముగన్.

# భాష: వ్యాకరణ

శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి

భావప్రకటన సాధనాల్లో భాష ప్రధానమైంది. "అతిపరిచయా దవజ్ఞా" అన్నట్టు అతి పరిచితమైంది కావటంవల్ల వ్యక్తులజీవితంలోను, నాగరికతా నిర్మాణంలోను భాషకున్న ప్రాధాన్యాన్ని మనం గుర్తించలేం. దాన్నిగురించి సాధారణంగా ఆలోచించంకూడా. కంటికి అన్నిటికంటె దగ్గరిది కనురెప్ప. దాన్నే కన్ను చూడలేదు. అయినా కంటిని రక్షించటంలో అది తన పన్ని తాను నిర్వర్తించుకుంటూనే ఉంటుంది. అటువంటిదే భాషకూడా. మనో నేత్రానికి బాహ్యప్రపంచాన్ని చూపించేదీ, బాహ్యప్రపంచాన్నించి దాన్ని రక్షించేది భాష. నాగరికత్తోపాటు భాష పెరుగుతూ, తనతో నాగరికతను వృద్ధిపొందించుకుంటూ పోతుంది. ఈ శక్తి భాషకు ఎలా వచ్చింది? భాషే లేకపోతే మానవ సమాజం, మానవ విజ్ఞాన సంస్కృతులు ఏ స్థితిలో ఉండేవి? అసలు భాషంటే ఏమిటి? భాషకు ఆలోచనాశక్తికి గల పరస్పర సంబంధం ఏమిటి? ప్రపంచంలో మానవులందరి అంతఃకరణప్రవృత్తులు ఒకే రకంగా ఉన్నా—ఇన్ని రకాల భాషలు ఏర్పడ్డానికి కారణం ఏమిటి? భాష ఒక్కాలంలో ఉన్నట్టు ఇంకోక్కాలంలో ఎందుకుండదు? భాషలు ఎందుకు ఎలా మారతాయి? మొదలైన ప్రశ్నలు విజ్ఞానవంతులైన వ్యక్తులను అన్ని దేశాల్లోనూ చిరకాలంగా బాధిస్తూనే ఉన్నాయి. ఈ విధమైన చర్చలకూ, భాషాశాస్త్రానికీ పుట్టినిల్లు భారత దేశమే. వీటిల్లో కొన్ని ప్రశ్నలకు జవాబులు మనకు సృష్టి మర్మాల్లాగే తెలియవు. అవి యథార్థాలని మాత్రమే గుర్తించగలం. మరికొన్ని పరిశీలనవల్ల తెలుసుకోవచ్చు. అవి శాస్త్రవిషయాలు. తాత్వికులకు, తార్కికులకు మాత్రమే జొరబడ్డానికి వీలైన ఊహామార్గాలు విడిచిపెట్టి కేవల పరిశీలన గమ్యాలైన శాస్త్రవిషయాలను ఈ వ్యాసావళిలో క్రమంగా తీసుకుందాం.

అసలు భాషంటే ఏమిటి? అనేది మొదటి ప్రశ్న. ఒకవస్తుతత్వాన్ని పూర్తిగా తెలుసుకున్నవాళ్ళకి ఆ వస్తువును గూర్చి టూకీగా నిర్వచించటం కష్టం. అతివ్యాప్తి—అవ్యాప్తులు లేని నిర్వచనాలు సాధారణంగా దుర్ఘటం. భాషను గురించి మాట్లాడ్డానికి మళ్ళీ భాషనే సాధనంగా ఉపయోగించాలి. మాటలకు స్వతస్సిద్ధంగా లేని నిర్వచన సామర్థ్యాన్ని ఎలా తెచ్చి పెట్టగలం?

'గౌః' అంటే పొయ్యేది కాబట్టి ఆ పేరు వచ్చిందన్నారు (గచ్ఛతీతి గౌః). కాని దీనికి అతివ్యాప్తి దోషం పడుతుంది. నడిచే జంతువు ప్రతిదానికీ 'గౌః' శబ్దం వర్తించదు. పోతే, గోవు 'గడ్డి మేస్తుంది, దానికి నాలుకాళ్ళుంటాయి, గంగడోలుంటుంది' మొదలైన గోలక్షణాలన్నీ (సామాన్యాలు విశిష్టాలు గూడా) 'గౌః' శబ్దార్థంలో లేవు. ఇది అవ్యాప్తి దోషం. అయితే 'గౌః' అనగానే గోవు అని ఎలా తెలుస్తున్నది? ఇది కేవలం మనోగతమైన శబ్దార్థసంబంధచ్ఛాయ ఆ జంతువును చెప్పటానికి 'గ్-ఔ-స్' అనే మూడు వర్ణాల సమూహాన్ని ప్రయోగించారు. ఈ మూడు వర్ణాలు ఆ క్రమంలో కలిసి వినబడ్డప్పుడు—పూర్వం ఏర్పడి సంస్కార రూపంగా ఉన్న సంబంధజ్ఞానంవల్ల—ఆ జంతువే కళ్ళకు కడుతుంది. దీన్ని బట్టి ఏ భాషలోనూ సహజంగా శబ్దాలకు నిర్వచన శక్తి - సమగ్రంగా వస్తుతత్వాన్ని చెప్పేశక్తి - లేదని తెలుస్తుంది. ఈ శక్తి మనస్సులో ఏర్పడ్డ సాంకేతిక సంబంధమే. ఈ సంబంధం ఎంత స్ఫుటంగా ఉంటే అర్థస్ఫూర్తి అంత రుజుటితిగా కలుగుతుంది. ఇక ప్రకృత విషయానికి వద్దాం.

భాష నియతమైన వాగ్వ్యవహారం. 'వ్యవహారం' అంటే వ్యక్తులు సంఘజీవులుగా అన్యోన్య ప్రయోజనానికి నడుపుకొనే వ్యాపారం (Social behaviour) అనుకోవచ్చు. వాక్కు అంటే ఉచ్చరిత ధ్వనుల సమూహం - అచ్చులు, హల్లులు, ఊనిక స్వరం, మొదలైనవి. ఈ ధ్వనులను ఇష్టం వచ్చినట్లు కలిపితే మాటలు ఏర్పడవు గాబట్టి, ధ్వనుల కలయికవల్ల మాటలేర్పటానికీ, మాటల కలయికవల్ల వాక్యా

ఏర్పట్టానికీ, భాషలో ఏవో కొన్ని నియతపద్ధతులుండాలి. పైన చెప్పింది అన్ని భాషలకు సరిపడే వివరణ. ఇక ప్రత్యేకంగా తీసుకుంటే ప్రతి భాషకూ వ్యక్తిత్వం ఉంటుంది. ఇది రెండు రకాలు. ఒకటి బాహిరం—ఇది దేశకాల పరిమితత్వం. ప్రతి భాషను ప్రపంచంలో ఏ కాలంలో ఏ ప్రాంతంలో ఎంతమంది వ్యవహరిస్తున్నదీ చెప్పవచ్చు. రెండోది ఆంతరం—ఇది భాషానిర్మాణానికి చెందిన వ్యక్తిత్వం. ధ్వనుల దగ్గర్నుంచి వాక్యందాకా ఉన్న అన్ని అంతరువుల్లోను గల అన్యోన్య సంబంధం ప్రతి భాషకు విలక్షణంగా ఉంటుంది. ఉదా. తెలుగు దేశ్యభాగంలో పదాది సంయుక్తాక్షరాలు స్న—, స్ప—, స్ట—, స్క—, క్ల—లాంటివి ఏర్పడవు. ఆంగ్లంలో ఇవి చాల సాధారణమైనవి, Snake, Spin, Stand, School, club, మొ. సంస్కృతంలోనూ పదాదిని సకార టకారాల కలయిక, 'స్ట—' లేదు. ఇదేవిధంగా ప్రతిభాషలోని మాటల నిర్మాణం తీసుకుంటే—పదాల ఆది మధ్యాంతాల్లో ఏయే ధ్వనులు కలుస్తాయో ఏవి కలవవో నిరూపించవచ్చు. ప్రాచీనాంధ్రంలో పదాంత దీర్ఘాలు లేవు. ప్రబంధకాలంలో వచ్చిన 'నవలా, జగా' లాంటివి, ఎరువు తెచ్చుకొన్నవిగా చూపెట్టవచ్చు. అదే విధంగా కొన్ని భాషల్లో రెండు వచనాలు మరికొన్నింట్లో మూడు వచనాలు (ఉదా. సంస్కృతం) ఉంటాయి. తెలుగులో క్రియలోనే కర్తగతార్థం అవుతుంది. 'వచ్చాడు' అన్నప్పుడు కర్త 'వాడు' అని చెప్పక్కర్లేదు. ఆంగ్లంలో కర్తృపదాన్ని తప్పక వాక్య భాగంగా చెప్పాలి. ఈ విధమైన నిర్మాణ వైలక్షణ్యం ప్రతి భాషలోను ఉంటుంది. మనకు అర్థంగాని ఏ చైనీస్ భాషనో, ఆఫ్రికాలోని స్వాహిలి భాషనో వింటున్నప్పుడు ఆ భాషాధ్వనులూ, భాషేతరధ్వనులు (అంటే మామూలు చప్పుళ్ళు) మనకు ఒకే విధంగా ఉంటాయి. అంటే అవి రెండూ అర్థరహితాలుగానే ఉంటాయి. కారణం ఆ భాషల్లోను మన భాషలోలాగా అచ్చులు, హల్లులు మొదలైనవి ఉపయోగిస్తారుగాని—అవి ఏవిధంగా కలిసి మాట ఏర్పడుతాయో, ఎలా కలిసినప్పుడు ఏ అర్థాన్ని తెలియజేస్తాయో—మనకు తెలియదు. కొద్దిలో చెబితే—ఆ భాషా నిర్మాణము మనకు తెలియదన్నమాట.

అయితే మరో ప్రశ్న. నవ్వు, ఏడుపు మొదలైనవి ఉచ్చారణావయవాలతో చేసే అర్థవంతాలైన ధ్వనులే కాబట్టి ఇవీ భాషలో చేరుతాయా అని. చేరవు. ఎందుకంటే ఇవి భావ ప్రకటన సాధనాలైనా—వీటిలో నియత నిర్మాణం లేదు. ధ్వనులవల్ల మాటలేర్పడి—వాటి వల్ల వాక్యాలేర్పడ్డట్టూ—నవ్వు ఏడుపులవల్ల ఏర్పడ్డ ధ్వని సర్వస్వాన్ని కొన్ని ముక్కలుగా విడగొట్టి—పదాలను అచ్చులు, హల్లులుగా విడగొట్టినట్టు—వాటి మధ్య కొన్ని మరికొన్నిటితో కొన్ని పద్ధతుల్లో కలవటంవల్ల నవ్వు మొదలయినవి. ఇన్ని రకాల ఏర్పడ్డాయని నిరూపించలేం. అంతకంటే బలీయమైన ఉపపత్తి—నవ్వు, ఏడుపులు ఆకలి దప్పుల్లాగా మానవులకు జన్మసిద్ధాలు. భాష పరిసరాలనుబట్టి శైశవంలో అలవడుతుంది. ఏడుపు నవ్వులకు భాషాధ్వనులకులాగా వ్యక్తిత్వం లేదు. అన్ని కాలాల్లోనూ, అన్ని భాషల్లోనూ, ఈ రెండూ అందరికీ అర్థమౌతాయి. బిడ్డ పుట్టగానే ఏడుస్తుంది. అది సృష్టిసిద్ధం. మరికొన్నాళ్ళకు నవ్వుతుంది. కాని తన మాతృభాషాధ్వనులను, శబ్దాలను తల్లిదగ్గర చాలా నెల్లుపోయిం తర్వాత కాని క్రమంగా నేర్చుకోలేదు. అందుకని ఆ రెండూ భాషలో చేర్చటానికి వీల్లేదు.

వాగ్వ్యవహారంలో వాస్తవికంగా వ్యక్తులు గుర్తించి ప్రయోగించేవి వాక్యాలు మాత్రమే. వాక్యభాగాలైన ధ్వనులు, వర్ణాలు, పదాలు, పదబంధాలు (Phrases), ఉపవాక్యాలు (Clauses) వ్యాకరణ విభాగంవల్ల ఏర్పడ్డవే కాని వ్యవహర్తల జ్ఞానజన్యాలు గావు. వ్యాకర్త భాషాసృష్టిలో ఉన్న నిర్మాణావయవాలను విడగొట్టి వీటి పరస్పర సంబంధం నిరూపించేవాడేగాని తన ఊహకొద్దీ వీటిని సృష్టించేవాడు గాదు.

ఈ నిర్మాణావయవాల్ని వ్యాకర్త ఎలా గుర్తిస్తాడో చూద్దాం. భాషలో సాదృశ్యంకల కొన్ని వాక్యాలు తీసుకోండి. ఉదా. చిన్నవాక్యాలే తీసుకొందాం. ఇల్లు పెద్దది. ఇంటికి వెళ్ళను. ఇంట్లో లేడు. ఇల్లెంత దూరం? ఈ నాలుగు వాక్యాలు నేటి తెలుగు వ్యవహారంలో కొన్ని పరిస్థితుల్లో స్వాభావికంగా మనమందరం ప్రయోగించేవే. ఒక్కొక్క వాక్యాన్ని అర్థవంతాలు, అవిభాజ్యాలు—అయిన కనిష్ఠరూపాల కింద విభజిద్దాం. అర్థవంతమైన కనిష్ఠరూపం అంటే ఆ రూపంలోని ఏకదేశానికి—అర్థం లేకుండ ఉండాలి. వేరేవిధంగా చెబితే, ఒక రూపంలో

ఏ కొంత భాగమైనా తీసివేసి దాని స్థానంలో మరో రూపం చేర్చినా అది సహజంగా ఉంటే, ఆ మొత్తం రూపం విభాజ్యమన్నమాట. 'ఇల్లు పెద్దది' అన్న వాక్యాన్ని విభజిస్తే ఇల్లు—పెద్ద—ది, అని మూడు అలాంటి భాగాలు చెయ్యవచ్చు. ఇల్లు—అన్నదాని లోని యేకదేశాలకు 'ఇ—ల్—ల్—ఉ'లకు అర్థంలేదు. కాబట్టి అదంతా తీసుకోవాలి. అలాగే 'ప్—ఎ—ద్—ద్—అ' అన్నది. కాని 'పెద్ద—ది' అన్నదాన్లో రెండు కనిష్ఠభాగాలున్నాయి. 'పెద్ద' స్థానంలో చిన్న—, గొప్ప—, తెల్ల—మొదలైనవి చేర్చవచ్చు, చిన్న—ది. గొప్ప—ది, తెల్ల—ది ఇత్యాది. అలానే '—ది' స్థానంలో—వి,—వాడు,—వాళ్లు, మొదలైనవి చేర్చవచ్చు, పెద్ద—వి, పెద్ద—వాడు,—వాళ్ళు ఇత్యాది. కాని 'పెద్ద' రూపాన్ని పెన్—ద, పె—ద్ద, పెద్—అ అని విభజించి వాటి ఏకదేశంలో మరో రూపాన్ని దేన్నీ చేర్చటానికి వీల్లేదు కాబట్టి 'పెద్ద' అంతా అర్థవంతమైన కనిష్ఠరూపంగా తీసుకోవాలి. అదేవిధంగా రెండో వాక్యాన్ని 'ఇంటి—కి—వెళ్ల్—అ—ను' అని ఐదు అర్థవంతమైన కనిష్ఠరూపాలుగా విభజించవచ్చు. 'ఇంటి—', 'ఇల్లు' అన్నదానికి 'కి' ప్రత్యయం ముందు వచ్చిన రూపాంతరం. '—కి—' 'దిక్కు'లేక 'వైపు'ను సూచిస్తుంది. 'వెళ్ల్' గమనార్థక ధాతు రూపం. '—అ—' ధాత్వర్థంలో వ్యతిరేకతను సూచిస్తుంది. '—ను' ఉత్తమ పురుష బోధకం. పైవిధంగా అడ్డగీతల్తో వేరుచేసిన వాక్యభాగాల స్థానంలో మరి కొన్ని అలాటి అర్థవంతమైన భాగాల్ని చేర్చవచ్చు.

'చెరువు—లో—మునిగ్—ఏ—డు. కాని అడ్డగీతల మధ్యనున్న భాగాల్ని అంతకంటె చిన్నవిగా విడగొట్టి వాటి స్థానంలో అర్థవంతమైన వేరే భాగాలు చేర్చటానికి వీల్లేదు. అలాగే మూడు, నాలుగు వాక్యాల్ని పైవిధంగా వ్యాకరిస్తే 'ఇంట్—లో—లే—డు' 'ఇల్ల్—ఎంత—దూరం?' అని కనిష్ఠ రూపాలు చూపించవచ్చు.

ఇప్పుడీ నాలుగు వాక్యాలూ కలిపి పరిశీలిద్దాం.

1. ఇల్లు—పెద్ద—ది
2. ఇంటి—కి—వెళ్ల్—అ—ను
3. ఇంట్—లో—లే—డు
4. ఇల్—ఎంత—దూరం—?

పై వాక్యాలన్నిట్లోనూ ఇల్లు అని అర్థం వచ్చే శబ్దం వేరు వేరు పరిసరాల్లో నాలుగు రూపాల్లో వ్యవహరిస్తున్నాం. ఏయే పరిసరాల్లో ఈ నాలుగు రూపాలూ వస్తాయో పరిశీలించి చెప్పవచ్చు. విశేషణ విశేష్య సంబంధం లేనిచోట పరపదం హల్లుతో మొదలైతే 'ఇల్లు' అనీ, ఉకారేతరమైన నామ విభక్తి పరమైతే 'ఇంటి' అనీ మిగిలినచోట్ల 'ఇంట్—' అనీ ఉంటుందని చెప్పవచ్చు. ఈ విధంగా ఒకే అర్థంకలిగిన శబ్దం భిన్న పరిసరాల్లో పొందే రూప భేదాలు నియతంగా వుంటాయి.

అలానే మిగిలిన వాక్యావయవాల్లో ప్రతి అర్థవంతమైన భాగానికీ ఉన్న రూపభేదాల గరిష్ఠ సంఖ్య తేల్చి వాటి అన్యోన్యసంబంధం నిరూపించవచ్చు. రెండో వాక్యంలోని 'కి' అన్నదానికి వేరు వేరు పరిసరాల్లో వచ్చే రూపభేదాలు మొత్తం కి,-కు,-క్ అని మూడు మాత్రమే. ఉదా. నా—కు—చెప్ప్—అండి. నా—క్—ఏం—సంబంధం ? ఇలాగే మిగిలిన వాటికూడా భిన్న వాక్యాల్లో వేరు వేరు పరిసరాల్లో వచ్చే రూప భేదాలూ, వాటిమధ్య ఉండే సంబంధమూ, నియతంగా కనిపిస్తుంది.

ఏ ఒక్క వాక్యం తీసుకున్నా దాన్లో ఉండే అర్థవంతమైన భాగాలు కలిసే క్రమం కూడా కొంతవరకు నియతంగానే ఉంటుంది. 'ఇంటి—కి—వెళ్ళ్—అ—ను' అనే వాక్యంలో ఉన్న క్రమాన్ని విపరీతం చెయ్యటానికి వీల్లేదు. అంటే 'ఇంటి—కి' అనే బదులు 'కి—ఇంటి' అని 'వెళ్—అ—ను' అనే బదులు 'ను—వెళ్ళ్—అ' అనీ తారుమారు చెయ్యటానికి వీల్లేదు. ఈ క్రమంకూడా అర్థవంతమే. నామవిభక్తులు విశేష్యానికి పరంగానే వస్తాయి అలానే క్రియా నిర్మాణంలో మొదట ధాతువు, దానికి పరంగా కాలార్థకరూపం, దాన్ని అనుసరించి పురుషార్థకరూపం నియతక్రమంలో వస్తాయి.

ఇప్పుడు పై చర్చ కంతటికీ సారాంశం—భాషా వ్యవహారంలో వాస్తవికంగా ఉన్న వాక్యాల్ని అవిభాజ్యాలూ, అర్థవంతాలూ అయిన భాగాలుగా విడగొట్టి ప్రతిభాగానికీ, మిగిలిన వాక్యాల్లో భిన్న పరిసరాల్లో వచ్చే దాని రూపభేదాలకూ, ఉన్న అన్యోన్య సంబంధాన్ని, ఒక్కొక్క భాగానికి ఆయా వాక్యాల్లో గల మిగిలిన భాగాల్తోగల సంబంధాన్ని నియతంగా అంటే సూత్రప్రాయంగా నిరూపించవచ్చు. దేశకాల పరిమితమైన వాగ్వ్యవహారంలో ఈ విధంగా నిరూపించిన నియతి సర్వస్వాన్ని వ్యాకరణం అంటారు.

అంటే వ్యాకరణం భాషా వ్యవహారానికి ద్వైమానిక వర్ణనం (Two Dimensional Description) అన్న మాట. అందులో ఒకటి వాక్య నిర్మాణక్రమం, రెండోది రూప నిర్మాణక్రమం. దీన్ని ఈ క్రింది రేఖా-చిత్రంలో సూచించవచ్చు.

| | 1 | 2 | 4 5 |
|---|---|---|---|
| 1 ఎ | ఇంటి— | కి— | —అ—ను |
| 1 బి | ఇంట్— | | |
| 1 సి | ఇల్లు— | | |
| 1 డి | ఇల్ల్— | | |

అడ్డంగా ఉన్న రేఖ వాక్యావయవాల మధ్య నున్న సంబంధక్రమాన్ని తెలియజేస్తుంది. 1–2 మధ్య, 3–4–5 ల మధ్య ఉన్న సంబంధం నియతం. కాని ఈ రెండు పదబంధాల (Phrases) క్రమం, శైలీభేదాన్ని బట్టి మారవచ్చు. 'వెళ్ళను—ఇంటికి' అన్నప్పుడు అర్థ భేద ముంటుంది. నిలువుగీత ఒక్కొక్క అర్థవంతమైన ప్రతి వాక్యావయవానికున్న రూపభేదాల మొత్తాన్ని, వాటి భేదక పరిసరాల్ని సూచిస్తుంది.

ప్రతిభాషలోనూ ఉన్న ఈ నియతి శాస్త్ర విషయం. ఇది భాషకూ భాషకూ విలక్షణంగా ఉంటుంది. ఇది వ్యవహారంలో ఉండటంవల్లనే ఆయా వ్యవహర్తలు ఒకరి నొకరు అర్థం చేసుకో గలుగుతున్నారు. అర్థంచేసుకోటం అనే ప్రయోజనానికి భంగంరాకుండా ఉండటం కోసమే ప్రతి వ్యక్తీ తన ఇష్టం వచ్చినట్టుగా ఈ నిర్మాణ క్రమాన్ని మార్చడు, మార్చలేడు. వీలైనంతవరకూ దాన్ని సమగ్రంగా సంపాదించుకోటానికే ప్రయత్నిస్తాడు. కాని కొన్ని భౌతిక రాజకీయాటంకాల వల్ల ఒకే భాష వ్యవహరించే భిన్న ప్రాంతాల మధ్య ధ్వనుల దగ్గర్నుంచీ, వాక్యందాకా ఉన్న ఈ నిర్మాణంలోని అంతరువుల్లో ఈషద్వైషమ్యాలు ఏర్పడుతుంటాయి. వీటినే మాండలిక భేదా లంటాం. దేశకాలమానాల్లో ఒకే భాషకు చెందిన వ్యవహారమండలాలు ఎంతదూరమైతే ఈ వైషమ్యాలు అంత విరివిగా పెరుగుతాయి. ఇవి ఒక అవధి దాటినతర్వాత వీటిమధ్యనుండే అవగాహన క్షమత్వం (intelligibility) చాలాదూరమై పోయి ప్రతి మాండలికమూ ప్రత్యేక భాషగా మారి పోతుంది. ఈ విషయం మరో వ్యాసంలో తీసుకొందాం.

తెలుగు భాషకు 15 శతాబ్దుల చరిత్ర ఉంది. ఆరో శతాబ్దినించీ తెలుగుశాసనాలు దొరుకు తున్నాయి. కాని అంతకు పూర్వమే తెలుగుభాష ప్రత్యేక భాషగా కొన్ని శతాబ్దులుగా వ్యవహారంలో ఉండి ఉండాలి. కాని చారిత్రిక కాలం తీసుకొన్నా, తెలుగు ఆరోశతాబ్దంనించీ ఎన్నో గు రించగలిగిన మార్పులు పొందుతూ వచ్చింది. స్థూలంగా ఈ పరిణామదశలు గోచరించే కాలాలకు కొన్ని హద్దు లేర్పరుచుకొని ఒక్కొక్క కాలంలో ఉన్న వ్యవహారానికి ఒక వర్ణనాత్మక వ్యాకరణం రాసుకుంటూవచ్చి ఆలాటి వ్యాకరణ విషయాల ్య సంబంధాన్ని నిరూపిస్తే అది చారిత్రక వ్యాకరణం (Historical grammar) అవుతుంది. అంటే ఒక భాషా చరిత్రతో వర్తిల్లే కాలమానాన్ని అనుసరించిన పరిణామదశలనిర్మాణక్రమాల్లో—వర్ణనాత్మక వ్యాకరణాల్లో—గల పరస్పరసంబంధ నిరూపణమే చారిత్రక వ్యాకరణం.

ఒకే కుటుంబానికి చెందిన భిన్న భాషల సంబంధం ఒక్కొక్కప్పుడు చరిత్ర కందదు. చరిత్ర కందినంత వరకు సోదరభాషల్లోగల నిర్మాణాన్ని సమగ్రంగా నిరూపించి, అప్పుడు వాటిమధ్యగల సాదృశ్యాల ఆధారంతో వాటి పూర్వచరిత్రనూ (Pre-history), మాతృకనూ కొన్ని సూత్రాలద్వారా నిర్మించవచ్చు. సామ్యవైషమ్యాలు ఆధారంగా చేసిన ఈ భాషా మాతృక నిర్మాణాన్నీ, దానికీ జన్యభాషలకూగల పరస్పర సంబంధాన్నీ గురించి చెప్పేది తులనాత్మక వ్యాకరణం (Comparative Grammar) అంటారు.

ఉదాహరణకు: ఈనాడు మనం వ్యవహరించే "పెద్దవాడు" అనే పదబంధానికి పూర్వపూర్వరూపాలు చరిత్రలో పరిశీలించుకొంటూపోతే 'పెద్దవాడు' 'పెర్దవాణ్డు' 'పెర్దవాన్రు' అని శాసనాల్ని బట్టి నిరూపించవచ్చు. ఎనిమిదో శతాబ్దానికి పూర్వం 'పెర్ద' అని శాసనాల్లో కనిపిస్తుంది. (చూ. 'పెర్దళ్' అహదనకర శాసనం, పంక్తి 27, ఇండియన్ ఏంటిక్వేరీ, సంపుటి 13, పేజీ 187.)

తొమ్మిదీ పదీ శతాబ్దులనాటికే 'ర్ద' అనే సంయుక్తాక్షరంలో సమీకరణం వచ్చి 'ద్ద'గా మారి పోయింది. (చూ. 'పెద్దత్రోవ', ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటి 5, పేజీ 140, నెం. 16, పంక్తి 27.)

'వాణ్డు' శబ్దంకూడా తొమ్మిది పది శతాబ్దులకే 'వాణ్డు/వాండు' అని శాసనాల్లో రాస్తూ వచ్చారు. తరువాతి కాలంలో 'ణ్డు' లోని అనునాసికం పూర్వాచ్చు మీద అనునాసిక్యంగా మారిపోయుంటుంది. ఆ తరువాతి కాలంలో అనునాసిక్యం కూడా పోయి ఇప్పటి 'వాడు' అనే రూపం ఏర్పడ్డది. ఈ పరిణామదశల మేరలు కాలవిభాగంలో నిరూపించటానికి ఇతోధికమైన పరిశ్రమ జరగాలి. కాని స్థూలంగా చారిత్రకంగా పూర్వరూపమేదో పరరూపమేదో క్రమపద్ధతిలో ప్రదర్శించవచ్చు. చరిత్ర కందినంతవరకు 'పెద్ద' అనే నేటి రూపానికి మొదటి రూపం 'పెర్ద' అనీ, 'వాడు' అన్న దానికి మొదటిరూపం 'వాణ్డు' అని మాత్రమే మనం చారిత్రక వ్యాకరణాన్ని బట్టి చెప్పగల మన్నమాట. కాని ఈ రెండు ప్రాచీన రూపాలూ అంతకుముందు చరిత్ర కందని కాలంలో ఏ మార్పులు చెందేయో, అసలు వీటి ప్రాథమిక రూపాలేవో మనకు చారిత్రక వ్యాకరణం చెప్పదు. వాటిని నిర్మించాలంటే ఈ రూపాల్తో తుల్యమైన రూపాలు మిగిల్న సోదరభాషల ప్రాచీనతా స్థితిలో ఎలా ఉండేవో పోల్చి చూసుకోవాలి. ఇప్పటి చర్చకు 'వాణ్డు' శబ్దం మాత్రం తీసుకొందాం. దీనికి సరియైన సోదర రూపాలు:

| | |
|---|---|
| తమిళం | అవన్ |
| మళయాళం | అవన్ |
| కన్నడం | అవమ్, అవను, అవ |
| కూయి | అఅన్జు |
| కోలామి | అమ్ద్ |
| నాయకి | అవ్న్ద్ |
| పర్జి | ఓద్, ఓడ్ |
| ఒల్లారి | ఓణ్డ్ |
| గదబ (కొణ్డేకోర్) | ఓఁడ్ |

ఈ పైరూపాలన్నిట్నీ పోల్చి చూస్తే తమిళ మలయాళ కన్నడాలు మినహా మిగిల్న వాటన్నిటి చివరి వర్ణాలు 'ణ్డు' అనే దాని పరిణతి రూపాలుగా కనబడతాయి. తమిళ మలయాళ కన్నడాలకు '*అవన్' అనేరూప మాతృకను (Proto-form) మిగిల్న భాషలన్నిటికీ '*అవణ్డు' అనే రూపమాతృకనూ నిర్మించవచ్చు. (చుక్క గుర్తు కొన్ని ధ్వని సూత్రాలనుబట్టి నిర్మించిన మూలభాషా రూపాలను సూచిస్తుంది) ఈ '*అవణ్డు' అనే రూపం నించి తెలుగులోనూ, మిగిల్న మధ్య భారత ద్రావిడ భాషల్లోనూ, ఈనాడు ఏర్పడ్డ శబ్దాలు ఏయే పరిణామాలకులోనై వచ్చిందీ కొన్ని ధ్వని సూత్రాల (Phonetic Laws) ద్వారా నిరూపించవచ్చు. ధ్వని సూత్రాలంటే ఏమిటి? వాటి ఆధారంతో సోదరభాషలపూర్వరూపాల్ని ఎలా నిర్మించాలి? ధ్వని సూత్రాలకపవాదాలేమన్నా ఉంటాయా? ఉంటే ఏ కారణాలవల్ల? అనే ప్రశ్నలు ఈ వ్యాసావళిలో వేరొకచోట ప్రత్యేకంగా తీసుకుందాం.

ఇంతవరకూ ఉపోద్ఘాతరూపంగా చూపించదల్చుకున్నది—భాషకూ వ్యాకరణానికీ ఉన్న సంబంధం, వ్యాకరణాల్లో ఉన్న తరగతులూ, వాటి అన్యోన్య సమన్వయం మాత్రమే. ఈ వ్యాసాన్ని బట్టి తేలిన సారాంశం. ప్రతి భాషావ్యవహారంలోనూ పరిశీలన గమ్యమైన దైవ్యమానిక నియతి ఉంటుంది. ఈ నియతిని నిరూపించటమే వర్ణనాత్మక వ్యాకరణ ప్రయోజనం. దేశ కాల మానాల్ని అనుసరించిచేసిన అనేక వర్ణనాత్మక వ్యాకరణాల సమన్వయ రూపంగా ఏర్పడ్డవే చారిత్రకతులనాత్మక వ్యాకరణాలు. అంటే అన్నిరకాల వ్యాకరణాలకూ మూలం వర్ణనాత్మక వ్యాకరణ మన్నమాట. దీని లక్ష్యం దేశకాల పరిమితమైన భాషా వ్యవహారంలో ఉండే నియతిని ప్రదర్శించటం. ఈ నియతి ధ్వనుల మొదలూ వాక్యందాకా అన్ని అంతరువుల్లోనూ అనుస్యూతంగా ఉన్న నిర్మాణ క్రమం. దాన్ని గుర్తించి, క్రోడీకరించి ప్రదర్శించటమే వ్యాకర్త పని. ఈ పనులకు కావలసిన పరిశోధన పద్ధతులేవో వాటి నెలా ఉపయోగించాలో ఒక్కొక్క అంతరువూ తీసుకొని రాబోయే వ్యాసాల్లో యథాశక్తిగా ప్రదర్శించే ప్రయత్నం చేస్తాను.

# శ్రావణంలో ఒక రా

శ్రీ హారీత శివశర్మ

బ్రతుకు చెడిన మనిషిలాగు
పడివున్నది ఆకాశం
అతుకుల మాసికలతోడి
ఉడుపుల మేఘమ్ములతో.

జడి జడిగా వానపడదు
జడనువడిన గాలిలోన
నడివేసగి శ్రావణమున
పడగవిప్పె మబ్బులలో.

ఋతువు ఋతువు కాకపోయి
గతిమాలిన మేఘమ్ములు
ఉక్కతప్ప చుక్కచినుకు
పుక్కిలించి ఉమియ వయో!

జడను వడిన గాలిలోన
జడను గూడ నిల్వలేదె!
వడవానల శ్రావణమున
ద్రుహిణాండం బ్రతుకునెట్లు!

మరల పొగలు మేఘమ్ములు
జనుల వగలు రేయెండలు
శుక్లపక్ష రాత్రివేళ
శ్రావణమున కారెండలు.

చంద్రుడు ఆకాశంలో
ఉండి యేమిలాభమయ్యె!
చంద్రమబ్బు రేయెండలు
పిండిన వడ వానలలో!

ధరలు పెరిగి జీవితమును
తరసా బాధించినట్లు
కడుసాగిన నడివేసగి
శ్రావణమున బాధించునో!

ఋతుధర్మం బన్యతాధ్యం
బందుపడ్డ ఈరోజున
శ్రావణమున రేయెండలు
చంద్రనిష్వ లూదునోకో!

ఋతుధర్మం తిరిగి, మరల
ఋతమార్గంలో పడునా!
గతిమాలిన శ్రావణమున
బ్రతుకునేల పుష్పించున!

బ్రతుకు చెడిన మనిషిలాగు
పడివున్నది ఆకాశం
బ్రతుకు పండి మనిషిలోన
నిండించున నంకాశం!

# ధర్మము - ధర్మి : గుణము - గుణి

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

శక్తి అనే పదానికి అనేకార్థాలు ఉన్నట్లే, ధర్మము, గుణము అనే పదాలకుకూడా అనేకార్థాలు ఉన్నవి. రామునియొక్క ధర్మం రామత్వం, ఘటముయొక్క ధర్మం ఘటత్వం అని మనం మామూలుగా చెప్పుకుంటూ ఉంటాం. రామత్వం అంటే దశరథుని కొడుకూ సీతాపతీ మొదలయినవనిన్నీ, ఘటత్వం అంటే పొట్టా మెడా మొదలయినవి ఉండడం, నీరు తీసుకోరాదగిన వీలు కనబడడం, ఈ మొదలయిన లక్షణాలనిన్నీ, అర్థాలు చెపుతాం. అయినా శాస్త్రాల దృష్టి ననుసరించి ధర్మం అనే మాటకూ గుణం అనే మాటకూ వేరువేరు అర్థాలు కనబడతవి, ఈ రెండూ ఏకార్థ బోధకాలుగానూ కనబడతవి.

సాంఖ్యయోగుల దృష్టిలో ధర్మమంటే ధర్మియొక్క శక్తి. ధర్మి అంటే ద్రవ్యం. మట్టి అనేది ఒక ద్రవ్యం. దాంట్లో అనేక శక్తులు ఉన్నవి. అది దుమ్ము కాగలదు, ముద్ద కాగలదు, కుండ కాగలదు, పెంకులు కాగలదు, మళ్ళా పొడిదుమ్ము కాగలదు, ఈ రీతిగా ఇంకెన్నో కాగలదు. ఇవి అన్నీ దాని శక్తులే. ఇట్టి శక్తులే ధర్మాలు.

యోగదర్శన భాష్యంలో—'ధర్మికి యోగ్యత ఉన్న శక్తియే ధర్మము' అని ఉన్నది.1 క్రియాదులచే ఏదో విధంగా తెలియదగినది కావడమే యోగ్యత. నిప్పు ముట్టుకుంటే బొబ్బలెక్కుతవి. ఈ బొబ్బలు చూచి నిప్పులకు బొబ్బలెత్తించే శక్తి ఉన్నదనే జ్ఞానం కలుగుతుంది. కాబట్టి బొబ్బలెత్తించే శక్తి అనగా 'దాహికాశక్తి' అగ్నికి ధర్మం అని అంటాం. ఈ శక్తి బొబ్బలెత్తించడానికి అనగా దాహక్రియకు కారణం. 'దాహికాశక్తి' దాహక్రియచే అవచ్ఛిన్నం. అనగా విశేషితం. దహనం యోగ్యత. దహనంచే విశేషితమైన 'దాహికాశక్తి' అగ్నికి ఒక ధర్మం అన్న మాట.

ధర్మి ధర్మదృష్టిలో శక్తికిన్నీ శక్తివల్ల కలిగే క్రియకున్నూ భేదం చేయవలసిన ఆవశ్యకత ఉండదు. ఎంచేతనంటే, క్రియా—, దానికి మూలమైన శక్తీ—, కూడా, ధర్మమే. ద్రవ్యమును మనం ఏ రూపంతో తెలుసుకుంటామో లేక తెలిసికోగలమో అది అంతా ధర్మమే. కాబట్టి ఈ ధర్మి ధర్మదృష్టిలో శక్తి క్రియలకు భేదం చేసినందువల్ల ఒరిగేది ఏమీ లేదు.

గుణపదాన్ని ధర్మము అనే అర్థంలో వాడినప్పుడు ఘనద్రవ్యంలో కనిపించే విశేషాలు అని చెప్పడమే. 'గుణాలంటే ధర్మాలు' అని పయిరీతిగా వ్యవహరించినపుడు గుణి అని అంటే ధర్మి అన్నమాట.

ఏ గుణంచేత వస్తువు మనకు బోధపడుతుందో అదే ఆ వస్తువు ధర్మం. ఎఱ్ఱకుండ ఒకటి ఉన్నదని అనుకుందాం. ఎర్రదనమూ గట్టితనమూ పొట్టా సొట్టా మెడా పొడా మొదలయినవి కలిగి ఉండడం కుండ ధర్మాలు. బోధగమ్యాలయిన యీ ధర్మాలుగల కుండ ధర్మి.

ఇక శక్తిని ధర్మమని అన్నప్పుడు శక్తి అనాగత ధర్మం అని అనవలసి ఉంటుంది. భూత భవిష్యద్వర్తమాన రూపంగా ఉండే ధర్మం 'ఉన్నది లేక ఉండును' అని ఈ రీతిగా వ్యవహరించవలసి ఉంటుంది. ఈ వ్యవహారం పదబోధ్యమైన త్రైకాలిక ధర్మ సమాహారం. తెలుగు వైయాకరణులు దీనిని తద్ధర్మార్థకం అని అంటారు. ఈ కల్పన ఈ ఊహ—(Conception) కాలత్రయాన్ని వెనుకొని ఉండే పదార్థాన్ని అంటిపెట్టుకొని ఉండే భావం లేక బోధ. ఇది ధర్మి. కాలత్రయ త్రివిధ ధర్మాలలో అనుగతంగా ఉండేవస్తువేదో అది ధర్మి.2 అనగా పదార్థానికి లెక్కపెట్టడానికి వీలులేనన్ని ఉదితానుదిత ధర్మాలు ఉంటవి. వాని ప్రోపు ఏవస్తువులో—ఏ ద్రవ్యములో ఉంటుందో ఆ వస్తువు—ఆ ద్రవ్యం ధర్మి. ధర్మము = బోధగమ్యమైన ఏదో ఒక భావం.

కారణమునూ కార్యమునూ కూడా ధర్మంచేతనే కనిపట్టవలసి ఉన్నది కాబట్టి కారణం కార్యధర్మానికి ధర్మి. ఆ కారణానికి ఇంకొక కారణం కనిపించినప్పుడు పరకారణ మనే కార్య ధర్మానికి పూర్వ కారణ ధర్మం ధర్మి. ఈలాగా కార్య కారణ రూపంగా గాని వికృతి ప్రకృతి రూపంగా గాని ఉన్న ధర్మాలకు కారణమూ లేక ప్రకృతీ ధర్మి.

---

1. ధర్మిణో యోగ్యతావచ్ఛిన్నా శక్తిరేవ ధర్మః (3–14.)

2. 'శాంతోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ.' (యోగ. ద 3–14.)

ఇపుడు వెనుదిరిగి చూచి 'ఏదో ఒక ప్రకారంగా తెలిసికోబడే భావాన్ని మనం ధర్మం అని అంటాం' అని నిబ్బరంగా చెప్పవచ్చు.

ఇట్టి ధర్మం త్రివిధం. 1. శాంతధర్మం లేక అతీత ధర్మం 2. ఉదితధర్మం లేక వర్తమానధర్మం 3. అవ్యపదేశ్యధర్మం లేక అనాగత ధర్మం.3

ఈ ధర్మాలు కాలాన్నిబట్టి విభక్తాలయినట్లు ఇట్టే తెలుస్తుంది కాని ఇంగులో ఒక విశేషం ఉంది. మనకు వర్తమానధర్మమే గోచర మవుతుంది. గోచరం కానిది అతీతానాగత ధర్మం. ఈ రెండూ వర్తమాన ధర్మాలు కావని వేటతెల్లమే కాని వర్తమానధర్మాలు కూడా అవుతవి. అవి గోచరం కావు కాబట్టి అతీత ధర్మమనినీ అనాగత ధర్మమనినీ అంటూ ఉంటాం. ధర్మిలో ఈ ధర్మాలు లేవని అనడానికి వీలులేదు. అవి వర్తమానాలు కావచ్చు. అనగా సూక్ష్మరూపంతో ఉండవచ్చు. కాబట్టే—'అతీతానాగత పదార్థాలు సూక్ష్మంగా ఉన్నవి'4 అని పతంజలి భగవానుడంటాడు. ఒక మట్టిముద్ద తీసికొందాం. దీనిలో పిండత్వం వర్తమానధర్మం. ధూళిత్వం ఘటత్వం మొదలయినవి అతీతానాగత ధర్మాలు. మొదటిది వ్యక్త ధర్మం. ఇటీవలివి అవ్యక్తధర్మాలు లేక సూక్ష్మ ధర్మాలు.

కాలం అనేది లేకపోయినా సూర్యాదుల గమనాన్ని పురస్కరించుకొని మన ఉపయోగం కొరకు ఉన్నచందంగా భావిస్తాం. ఆ భావనచేత వ్యవహారాలు చక్కదోసుకుంటాం. ఈ రీతిగా మనకు కాలజ్ఞానం రూఢమై పోయింది. అందువల్ల భూతకాల వస్తువూ భవిష్యత్కాల వస్తువూ లేదని అనుకుంటాం కాని ప్రకృత వ్యాపారోపరూఢ వస్తువులో అనగా అణులులో ఉన్న వస్తువులో భూత భవిష్యద్ధర్మాలు అవ్యక్తంగా ఉన్నవి. మనకు గల జ్ఞానం విభక్తం. వస్తువును కాలభేదంచేత విభక్తంగా తలపోసి అతీతానాగతధర్మాలు వర్తమాన ధర్మిలో లేవని అనుకొంటాం. వర్తమానమైన నిమిత్తమే నైమిత్తికాన్ని అనగా ద్రవ్యాన్ని5 వర్తమానావస్థను పొందిస్తుంది. ధర్మి అనేక ధర్మాత్మకం. ఆ ధర్మాలన్నీ మనం కల్పించుకున్న కాలంలో ఉన్నవి. వర్తమానధర్మం విశేష వ్యక్తిసంపన్నమై ద్రవ్యంలో ఉన్నటులు అతీతానాగతాలు ఉండవు. నాలుగు తట్టల మట్టితో కుండలూ మూకుళ్ళూ చేయవచ్చునని అనుకుందాం. ఈకుండలూ మూకుళ్లూ ఆ మటిలో అనాగతరూపంగా ఉన్నవి. అనగా అవ్యక్తంగా సూక్ష్మంగా ఉన్నవి. ఘటత్వం అనే ధర్మాన్ని వర్తమానంగా చేయడానికి అనగా అభివ్యక్తం చేయడానికి కుమ్మరి ఉండాలి. కుమ్మరి కర్మేంద్రియాలూ జ్ఞానేంద్రియాలూ ఇచ్ఛా, డబ్బు సంపాదించేకోరికా, పనీ ఈ మొదలైనవన్నీ కూడా నిమిత్తాలు. కాబటి ధర్మిలో అనభివ్యక్తంగా ఉన్న ఫలాన్ని లేక కార్యాన్ని వర్తమానంగా పరిణమింపజేయడంలో నిమిత్తం సమర్థమాతుంది. ఈ ఘట్టం అంతా సంగ్రహించి ఇలా చెబుదాం—బోధ లేక జ్ఞానం లేక చిత్తవృత్తి, ఒకదానివెంట మరొకటిగా అనగా వరుసగా కాలంలో ఉండేవి కాబట్టి తెలియబడిన లేక ప్రకాశం పొందిన ధర్మాలు భూతాలనిన్నీ ప్రకాశం పొందుచున్నవి లేక తెలియబడుచున్నవి వర్తమానాలనిన్నీ బోధకు విషయం కాబోయేవి భవిష్యత్తులనిన్నీ లోకవ్యవహారం అన్నమాట6.

'గుణాలంటే సత్త్వరజస్తమస్సులు' అని అనుకున్నప్పుడు గుణాలంటే విశేషాలు—విశేషణాలు— అని అర్థంకాదు. త్రాళ్ళు అని అర్థం. ప్రవాహరూపమైన యీ ప్రపంచం, అంతూ పొంతూ లేకుండా ముప్పేటగా పేనబడుతుంటూ సాగిపోయే మోకు. ఆ మోకులో గుణాలు మూడూ మూడు పేటలు. కాగా సత్త్వరజస్తమోఽర్థంలో వాడబడిన గుణపదానికి తాడని అర్థం.

ప్రపంచాన్ని కార్యకారణ - వికృతి ప్రకృతి రూపంగా విశ్లేష (Analysis) చేసి మూలం పట్టుకొన్నపుడు ఉపాదానకారణమైన త్రిగుణాల సామ్యం కలుగుతుంది. అక్కడ ధర్మధర్ములు రెండూ ఒక దానిలో ఇంకొకటి కూరుకోపోతై. ఎట్లా అంటే:

## సత్కార్యవాదం

'కారణంలో కార్యం ఇమిడి ఉంది' అని చెప్పడం సత్కార్యవాదం. ఇదే 'నాఽసతో విద్యతే భావః' అనే గీత. కుమ్మరి మట్టితో కుండలు చేస్తున్నాడు. ఇదివరకు లేనిదేమీ ఇప్పుడు పుట్టుకు రాలేదు. మట్టి నలుసుల సన్నివేశంమాత్రం మారింది. నలుసు నలుసూ చూడగలవాడుంటే కుమ్మరి ఆ నలుసుల నన్నిటినీ కుండ ఆకారంగా సవదరించినటులు కనుక్కొని యిది మట్టే అని అనుకోగలడు. అయితే

---

3. శాంతోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ (యోగ. ద. 3-14.)

4. 'అతీతానాగతం స్వరూపతోఽస్తి — (యోగ ద. 4-12.)

5. దండచక్ర కులాలాదులు నిమిత్తం. మట్టిలో సూక్ష్మరూపంతో ఉన్న ఘటం నైమిత్తికం.

6. యోగులకు కాలత్రయమూ వర్తమానమే.

ఇలా చూడలేక సముదాయంమాత్రమే చూడగలిగి, కుండతో మాత్రమే పరిచయం గలవారు, లోగడ లేని వస్తువొకటి కొత్తగా పుట్టుకొచ్చిందని అంటారు. నిజాని కది ఒక ఆకారంలో ఉంచిన మన్నే.

ఈ రీతిగా కార్యాలన్నీ కారణాలలో ఇమిడి ఉంటాయనినీ, ఒకటిగాని పెక్కులుగాని నిమిత్త కారణాల క్రియాకలాపాలచేత ఆయా కార్యాలు అభివ్యక్తాలవుతాయనినీ సత్కార్యవాదం చెబుతుంది. ఈ రీతిగా ప్రపంచావిర్భావం అభావంలోంచి—శూన్యంలోంచి—కొత్తగా పుట్టుకొరావడంకాదు, మరి దేశకాలాలలో సన్నివేశభేద మాత్రమే అని తెలిసివస్తుంది. మహత్తత్త్వం లగాయతు పరమాణువు వరకూ ఈ ప్రపంచం అంతా ఇంతే.

దృశ్యమైన ప్రపంచమంతా ధర్మాలూ ధర్ములే (ఘనద్రవ్యాలే) అని చెప్పే ధర్మ ధర్మివాదంలో 'కారణంలో కార్యం ఉంది' అనే పై సంగతి సమ్మ సరిపోతుంది. ఊహాగూఢమైన ఏదో ఒకదానికి లక్షణం చెప్పబోతామని అనుకోండి, అప్పుడు — 'ఏది ఫలానా ఫలానా గుణాలు లేక ధర్మాలు లేక శక్తులు కలదో అది' అని చెబుతాం. ఇందులో ఆ 'ఏది' అనే దానికి లక్షణం చెప్పమంటే ఇప్పుడు చెప్పిన గుణధర్మ శక్తులకంటె ఇంకా ముఖ్యవిశేషాలకోసం పరికిస్తాం. ఉదాహరణానికి—భూమి అంటే యేమిటి? అని అడుగుతారని అనుకుందాం. ఏది నల్లగా ఇంకా అల్లా ఉంటుందో ఇల్లా ఉంటుందో అది భూమి అని అంటామని అనుకుందాం. ఆ 'ఏది' అంటే యేమిటి అని అడుగుతారు. అప్పుడు మనకు తెలిసినంత మేరకు పోయి పరమాణువులు అనో ఇంకేమో అనో, వానికి మరికొన్ని విశేషాలు చేర్చి ఆ'యేది'ని లక్షిస్తాం. పరమాణువులకు మరొక మూలకారణం సరిగా తెలియకపోతే సందేహంలో పడతాం. అనగా మన అజ్ఞానాన్ని ఒప్పుకున్నట్టు. కాని ఇంకొక మూలకారణం మటుక్కు ఉండడానికి హేతువు లేనప్పుడు ఏమనాలి? అది కారణం లేని వస్తువు, కాబట్టి నిత్యం అని అనాలి.

ఏదయినా వస్తువులో ఉండగలది ధర్మం అని చెప్పాం. ఇంకా సరిగ్గా చెప్పి చూదాం—ఏదో ఒక విధంగా తెలిసికోబడే ఆకార—ప్రకార విశేషం ధర్మం. ఆకార—ప్రకారాలకు మార్పు కనబడుతుంది. అనగా పరిణామం ఉంది. అంటే ధర్మాలకు మార్పు ఉందన్నమాట. ఒక ఆకారం—ప్రకారం—ధర్మం, మారినప్పుడు అదేమయినట్టు? అది అవ్యక్తావస్థలో ఉన్నట్టు. ఎందుచేతనంటే ఉన్న దెప్పుడూ పోదు,— 'నాఽభావో విద్యతే సతః'. వెనుకటి మాదిరి హేతువులు తటస్థించినప్పుడు మళ్ళా ఆ ధర్మం పొటమరించవచ్చు. కాబట్టి భూతధర్మం ఒక అవ్యక్త సత్తా. భావిధర్మాలూ అంతే. గుండ్రంగా చేసిన మట్టిముద్దను చదునుగా చేశాం. గుండ్రతనంపోయి చదునుతనం వచ్చింది. దాన్ని మళ్ళా కోసుగా ఆకారించవచ్చు. ఈ రీతిగా ఎన్నెన్నో ఆకారాలెత్తదగిఉందికదా మట్టిముద్ద! కాబట్టి ధర్మి అనేది లెక్కలేని ధర్మాల ప్రోవు; మరి దాన్ని వివిధ విధాలుగా బోధపరచుకోవచ్చు. వర్తమాన ధర్మాలే కనబడతై, మిగతావి ఉన్నట్లు ఊహింపబడతై. కాగా వ్యక్తావ్యక్తధర్మాలకు కూటం గది.

## బౌద్ధమతం

బుద్ధులలో ఒక తెగవారు ఈ ప్రపంచమంతా ధర్మాలే, ఈ ధర్మాలు అనుక్షణమూ శూన్యంలోంచి పుట్టుకొచ్చి మళ్ళా శూన్యంలోనే పోతున్నవి అని అంటారు. శూన్య మంటే అభావం. మరికొందరు పుట్టుకొస్తున్నమాట నిజమేకాని దేంట్లోంచి పుట్టుకొస్తున్నయో అది అజ్ఞేయం అని అంటారు. ఈ రెండు మతాలూ ఆదరింపదగినవి కావు.

మొదటివాదంలో ప్రత్యయమూ ప్రతీత్యమూ ఈ రెంటికీ శూన్యంచేత సంబంధం విచ్ఛిన్నమవుతున్నది. బౌద్ధుల పరిభాషలో ప్రత్యయ మనగా కారణము. ప్రతీత్యమనగా కార్యము. కార్యకారణాలకు సంబంధం విడగొట్టగల ఊహలో సందర్భశుద్ధి లేదు. శూన్యం లేక అభావం అనేది దేనికీ అధికరణం కాజాలదు. ఆధారం లేకుండా నిరాధారంగా ధర్మాలు పుట్టి శూన్యంలోకి పోతై అనేది ఊహాతీతం. ఇక రెండవవాదం అజ్ఞేయత. అజ్ఞేయతలో ఒక విధమైన జ్ఞేయత ఉండనే ఉంటుంది. దానిని వివేచించి విస్పష్టం చేస్తే సత్త్వము, రజస్సు, తమస్సు అనే ఆధారం అవుతుంది.

## త్రిగుణాలు

సాంఖ్యయోగుల దృష్టిలో ఆధారం లేక మూలం శూన్యం కాదు, మరి తప్పించుకపోయే మాయామృగమూ కాదు, ఈ గుణత్రయమే ప్రపంచానికి ఉపాదానకారణం. ధర్మధర్మి దృష్టిలో ఉపాదానకారణం, తన కార్యాలకు ధర్మి. ఈ దెస మట్టి, కుండలకూ ఇటుకలకూ పెంకులూ మొదలయినవానికీ
ఈ పెంకులు మొదలయినవానిలో మట్టి అనుగతంగా

ఉన్నా అని మట్టికి వేరుగా ఉన్నట్టులు తోచునే కాని మట్టి యొక్కయే వేరు వేరు ధర్మాలు లేక రూపాలు లేక ఆకృతులు. ఈతాడు పట్టుకొనిపోదాం. భూతాలు తన్మాత్రము లనబడే పరమాణువులకు మరి పరమాణువులూ మనస్సహితాలయిన ఇంద్రియాలూ అహంకారానికీ మళ్ళా ఆ యహంకారం, అప్ప-నేనుకూ లేక మహత్తత్త్వానికీ తానది మళ్ళా గుణత్రయానికీ ధర్మాలుగా కనిపిస్తయ్. గుణాలకు మరొక మూలం లేకపోవడాన ధర్మ ధర్మిభావం దాంతో సరి.

సత్త్వరజస్తమస్సులు ఘనద్రవ్యాలు కావు మరి స్వయం పర్యాప్తాలైన సత్తా విశేషాలు (entities). ఉదాహరణానికి రజస్సు అనే మూలభావాన్ని చూదాం. పరిణమించడం లేక వికారం చెందడం, దాని గుణం లేక విశేషం కాదు, మరి శీలం. దాంట్లో వికారం తప్ప మరొకటి లేదు, ఉన్నదంతా వికారమే. కాబట్టి మూల రజస్సుకు వికారం గుణం కాదు మరి స్వయం పర్యాప్తమైన వికార స్వభావమే. కాబట్టే—'ప్రధానంలో ధర్మమునూ ధర్మినీ విడదీయడానికి వీలులేదు' అని యోగభాష్యం చెబుతుంది.

## వైకల్పిక ధర్మాలు

ధర్మాలు వాస్తవాలూ వైకల్పికాలూ. చెప్పకుండా తెలిసేవి వాస్తవాలు. చంద్రునికి తెల్లదనం. ఎండమావులకు జలత్వం ఆరోపిత వాస్తవం. వైకల్పికాలనేవి వాఙ్మాత్రం. అనంతత్వం, సత్తా, ప్రకృతి యీ మొదలైనవి వైకల్పికాలు. వ్యాకరణప్రకారం త్వ, తల్ ప్రత్యయాలు చేరడానికే ఇవి గుణ వాచులైనవి. త్రిగుణాలే ప్రకృతి కాబట్టి గుణాలంటే తాళ్ళు అని అర్థం కాబట్టి ప్రకృతి వైకల్పిక ధర్మవాచి. త్రైగుణ్యంవలె నైర్గుణ్యమైన చైతన్యం ధర్మధర్మి దృష్టికి అతీతం.—'నిర్గుణత్వాన్న చిద్ధర్మా'. ఇలా అయినప్పటికీ మన మొక ధర్మం కల్పించి వాడతాం. అది మన కలవాటు. ఆవశ్యక కాకున్నా మామూలు చొప్పున ద్రష్టకు అదృశ్యుడనే విశేషణం వేస్తాం. ఇది ఎన్నో 'నేతి నేతి' రూపాలను పిలిచి పెట్టింది7. 'విశేషేణ అపరామృష్టా దృక్' అని అంటాడు వ్యాసులు. విధి ముఖంగా ద్రష్టకు 'దృశిమాత్రుడు' అనియే లక్షణం. నిషేధముఖంగా చెప్పబడిన లక్షణ శతం చూచి కొందరనుకుంటారు—సాంఖ్య యోగుల మతంలో పురుషుడు నిషేధ ముఖంగా గాని చెప్పబడడానికి వీలులేదని.

వాస్తవ ధర్మాలు బాహ్యాలూ మరి ఆంతరాలూ. బాహ్యధర్మాలు మూలంలో మువ్విధాలు: అవి ప్రకాశ్య కార్యజాడ్యాలు. శబ్దాది గుణాలు ప్రకాశ్యాలు అనగా జ్ఞానేంద్రియబోధ్యాలు. క్రియ అంతా కార్యముగా పరిణమిస్తుం దన్న మాట. కాఠిన్యాదులు జాడ్యధర్మాలు. కాఠిన్యం భూధర్మం కాన ఇది జడధర్మం. ఆంతర ధర్మాలు మూలంలో ప్రకాశ క్రియాస్థితుల రూపాంతరాలైన బోధ చేష్టా ధృతులుగా ముత్తెరగులు. ఈవాస్తవధర్మాలకు అవస్థాంతరం అనగా పరిణామం ఉంది. కాని వినాశం అంటూ లేదు.

## ధర్మి వికారి

ధర్ములు అన్నింటికిన్నీ ధర్మాలు అనేక ప్రకారాలతో అనేకం. కాబట్టి ధర్ము లనబడే వన్నీ వికారులు.

వికారం అంటే ఒక ధర్మం అడగి వేరొకధర్మం కలగడం. చితిశక్తి ధర్మధర్ములకు అతీతం కాబట్టి కూటస్థం. అనగా నిర్వికారం నిత్యం, అవినాశి.

ఏది ఏకతత్త్వస్వరూపమో మరియు అసంయోగజమైన పదార్థమో అది కారణహీనం. దానికి నాశం కల్పనీయం కాదు. దాన చితిశక్తి అవినాశి.

ఇక...మూలదృశ్యమైన త్రిగుణం నిత్యపదార్థం-"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" గీత.

ప్రకాశ - క్రియా - స్థితులు (సత్త్వరజస్తమస్సులు) ఎంతకాలంనుంచీ ఉన్నవో, ఎంతకాలం ఉండబోతాయో?

'ఇవి ఉన్నవి, ఉండగలయవి' అనియే సమాధానం చెప్పవలసి ఉంటుంది. ఇవి ప్రత్యేకించి అసంయోగజాలు. కాబట్టి నిత్యాలు. చిత్తం మొదలయినవి ద్రష్ట్ర దృశ్య సంయోగజాలు కాన నాశం అనగా లయం పొందుతవి. కాని వాని మూలకారణమో అది అవినాశి.

ప్రకాశక్రియాస్థితులు జాతివాచకాలు కావున (Generalisations) సాధారణోపాదాన పదాలు.8 దృశ్యమంతా ప్రకాశక్రియాస్థితులే అని అనడం 'మృత్తికేత్యేవ సత్యమ్' అన్న చందంగా వ్యాపకమైన సత్యాన్ని చెప్పడమే.

---

7. చూ—బృహదారణ్యకం.

8. ప్రకాశక్రియాస్థితి శీలం భూతేంద్రియాత్మకం దృశ్యం' (యో. 4-208.

# బాష్ప ప్రసూనములు

శ్రీ. మోటూరి వేంకటరావు

చెలువపుఁ దళ్కు లూర్చి వికసించెడు క్రొన్నన లేరి కూర్చి నీ స
ల్లలితపదాంబుజాత యుగళమ్ముపయిం గయిసేయు కోర్కె నే
నిఁక దిగనాడి ఒక్క సుమమేని హసింపని దారి సంజ నీ
డలఁ దిరుగాడి నీ గుడిని డాసితి రిక్తకరాలతో ప్రభూ !

ద్వారము సేరినంతఁ గనుదమ్ముల విందయి నందనాప్సర
స్త్రీ రమణీయ లాస్యము రచించు విత మ్మొలదీవె యొండు కి
మ్మీర కనత్ప్రభాయుత సమీకృత మంజ లతాంత పుంజ శో
భా రుచిర స్వరూపవిభవమ్ము వెలార్చుచుఁ దోఁచె దేవళిన్ !

సుమములఁ గాంచి పూల సొగసుందనముం దిలకించి, ప్రాంచ దు
త్క్రమణము నా హృదంచలము ప్రమ్ముకొనన్, గొనవ్రేళ్ళతోఁ బ్రసూ
నములను ద్రుంచఁబోయి యెలనాఁగల నిద్దపు ముగ్ధ కంఠ నా
ళము లాగి నుత్తరించు నటులం దలపోయుచు నేఁ జలించితిన్.

చాఁచిన నా కరమ్ము వికచప్రసవమ్ములఁ గోసివైచు క్రూ
రాచరణమ్ము పొల్పడక అల్లన వ్రాలె—తదీయ కమ్ర రే
ఖాచయ పుష్పబంధురవికాసము నా కనుచూపులోఁ గృపా
వీచుల రేపె, బాష్ప జలబిందువు లూరి స్రవింప ధారలై.

విరులకు మారు నా నయనవీథులలోఁ గరుణాశ్రుమాలికో
త్కరములు సంతరించుకొని తావక దివ్యపునీత మందిరాం
తరమును జొచ్చి, నీ చరణధామముపై మిహికారహాద్ద్యుతుల్
దొరఁగ, సితాంబుమౌక్తికతతుల్ గురిపించితి నో దయామయా !

నా కడగంటి జీవన కణా లటు రాలుచుఁ ద్వత్పదాంక ము
ద్రా కలితమ్ములై మధు సుధా భరితామల కోమల ప్రసూ
నాకృతులం ధరించి తొలఁకాడె, వివిక్త పరీమళ ప్రమో
దాకరమైన ఆక్షణ మనంత తపః పరిపాకముం గనన్.

# సంస్కృత సాహిత్యము: ముస్లిముల సేవ

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ప్రపంచములో మతములకు పరస్పర ప్రేమ ఒక భాషపై మరియొకభాష వారికి ప్రేమ ఉండుట వలనను, ఇతర మత సహనము వలనను నేర్పడును. ఈ తత్త్వములవలన భరత ఖండములో ముసల్మానుల పరిపాలన కాలమున హిందూ మహమ్మదీయులకు పరస్పర మత సహనము ఏర్పడెనని చెప్పవచ్చును.

భారతి ప్రజలు ఏజాతి వారినైనను తమలో కలుపుకొని జీవించు అలవాటు కలవారు. భారతదేశములో మధ్యయుగమున మహమ్మదీయ, హైందవ నాగరకతలకు ఐక్యము ఏర్పడినది. భారతీయులు సత్య మెక్కడనున్నను గ్రహించు స్వభావము కలవారు. తత్త్వగ్రహణ సమయమునందు వారు జాతి, మతముల విభేదమును పాటించరు. మధ్య యుగమునాటి ఈ మత సహనమే ఈనాడు హిందూ మహమ్మదీయుల ఏకత్వానికి ఆధారమైయున్నది. హిందువులు మహమ్మదీయ దేవతలను, ముస్లిములు హిందూ దేవతలను కొలుచుట కూడ మన దేశములో ఆచారముగ నుండుటకు మనయీ మత సహనమే కారణము. దీనికి తార్కాణముగ తాజ్ అను మహమ్మదీయ మహిళ కృష్ణభక్తురాలై దేవుని గానము చేసెను. సత్యమును గ్రహించుట యందే దృష్టి గల మన పెద్దలు మత భేదమును దృష్టియందుంచరైరి. ఆళ్వారాదులు వ్రాసిన భక్తి గీతములను రామానుజుల వంటి ఋషి సత్తములు కూడ స్వీకరించి పాడిరి. ఈ శ్రేణికి చెందిన వారే వంగదేశములో చైతన్యుడు, అస్సాములో శంకరదేవుడు, మహారాష్ట్రములో తుకారాము, నామదేవులు మొదలైన మత నాయకులు. రామానందస్వామి శిష్యులు నట్టివారె. వారిలో రవిదాసను హరిజనుడు, శేన అను మంగలి, కబీర్ అను మహమ్మదీయుడు సుప్రసిద్ధులు. ఈ విధముగా మన దేశములో హిందూ మహమ్మదీయులకు మానసికముగా నేర్పడిన యీ స్నేహసంబంధమే ఆ రెండు జాతుల భాషా సాహిత్యముల కలయికకు, పరస్పర సహనభావమునకు దారి తీసినవి.

వంగదేశములోని అనేక మహమ్మదీయ విద్వాంసులు కృష్ణభక్తులై ఆ దేవుని పై వంగభాషలో గ్రంథములను రచించి వంగసాహిత్యమునకు దోహదము కల్పించిరి. హుసేన్ షాహ రాజు చైతన్యునకు శిష్యుడయ్యెను. ఆయనయే కాక వంగదేశములో నాసిర్ మహమూద్, ఫకీర్ హబీబ్, సయ్యద్ ముర్తజా మొదలైనవారుకూడ రాధా కృష్ణులకు భక్తులైరి. అలీరజా, అక్బరు షాహ మొదలైనవారు గొప్ప వంగ కవులని ప్రసిద్ధులైనారు. ఈ విధముగా అనేకులు ముసల్మానులు హిందూసంస్కృతి వ్యాప్తికొరకు ప్రయత్నించిరి. వారు సంస్కృతసాహిత్యమును పోషించుచు ఆ భాషలో గ్రంథరచనము కూడ చేయుచు వచ్చిరి. ఇట్లే హిందూ పండితులు, రాజులు, మహమ్మదీయ సంస్కృతి సాహిత్యముల వ్యాప్తికి దోహదమొనర్చి యా భాషలో గ్రంధరచనములను గూడ సాగించిరి.

అనేక మహమ్మదీయ రాజులు సంస్కృత సాహిత్యమును ఉదారముగా పోషించిరి. వారి న్యాయస్థానములలో సంస్కృత విద్వాంసులకు, కవులకు గౌరవము, ప్రోత్సాహము, ధనము లభించుచుండెను. ముస్లింరాజుల ఆస్థానమును అలంకరించిన సంస్కృత కవులలో భానుకరుడు, అక్బరీయకాళిదాసుడు, జగన్నాథ పండితరాజు ఈ ముగ్గురు చాల ప్రముఖులు. మహమ్మదీయరాజులలో సంస్కృతకవులను ఉదారముగా ఆదరించి పోషించినవారిలో "షహాబుద్దీన్, నిజాంషాహ, షేర్ షాహ, అక్బర్, షాహజహాన్, ముజఫర్ షాహ, బుర్హాన్" ముఖ్యులు. ముసల్మానులు పోషించిన సంస్కృత కవుల కావ్యములు మనకు ఇప్పుడు లభించుచున్నవి. వాటివలన మహమ్మదీయ పాలన కాలములో జరిగిన హిందువుల సాంస్కృతికాభివృద్ధి తెలియుచున్నది. దురదృష్టవశమున ఆ విద్వాంసులు ఆ దినములలో సంతరించిన రికార్డులు, గ్రంథములు నష్టమైపోయినవి.

మధ్యయుగములో మహమ్మదీయ రాజులు సంస్కృత భాషా వ్యాప్తికిగాను చాలా శ్రద్ధచూపిరి. వారిలో వంగదేశీయ ముసల్మానులు ముఖ్యులు. క్రి. శ. 1282 నుండి 1825 వరకు వంగదేశమును పరిపా

లించిన నాసిర్ షాహ విద్యాపతితో మహాభారతమును వంగభాషలో వ్రాయించెను. ఈ విద్యాపతి తన గ్రంథములో ఈ నవాబును, మరియు సుల్తాన్ గయాసుద్దీన్‌ను ప్రస్తావించెను. ఈ నాసిర్ షాహ నవాబే "కృత్తివాసుడు"అను వంగ కవిచేత రామాయణమును వంగభాషలో వ్రాయించెను. హుస్సేన్ షాహ చక్రవర్తి కోరికపై "మాలాధర బసు" అను బెంగాలి కవి భాగవత పురాణమును వంగ భాషలో అనువదించెను. ఈ చక్రవర్తికి మంత్రియైన పరాగల్ ఖాన్ ఆజ్ఞచేత "కవీంద్ర పరమేశ్వరుడు" మహాభారతమును స్త్రీపర్వమువరకు అనువదించెను. ఈ కవిని పరాగల్ ఖాను మిక్కిలి ప్రోత్సహించి ప్రతి దినము తన మిత్రులలో పరాగల్ పూర్‌లో కవీంద్రుని భారతానువాదమును వినుచుండెను. ఈ ఖానుని కొడుకు చుటీ ఖాన్ చిటగాంగులో గవర్నరుగా నున్నప్పుడు "శ్రీకర నంది"తో మహాభారతాశ్వమేధ పర్వమును వంగభాషలో అనువదింపజేసెను.

బెంగాలు నవాబులే కాక ఢిల్లీ పాదుషాలు కూడా సంస్కృత సాహిత్య ప్రచారమునకు దోహదమును కల్పించిరి. బాబరు సార్వభౌముడు భారతీయ నక్షత్ర శాస్త్రము అభివృద్ధి పరచెను. అతని రాష్ట్రిమంతటను ఆ శాస్త్రము ప్రచారములోనికి వచ్చెను. సమరఖండములో ఒక నక్షత్ర వేధశాలను ఈ నవాబు నిర్మించెను. ఆ కాలములో చేసిన పరిశోధనప్రకారముగా అఖిలభారత మహమ్మదీయులు తమ కార్యకలాపములను జరుపుచువచ్చిరి. సంస్కృత విద్యావ్యాప్తికి హుమయూన్ చేసిన ప్రోత్సాహము అంతగా కనపడదు. కాని అతని కొడుకు అక్బరు సార్వభౌముడు అతి విశేషముగా ఆ విద్యను ప్రోత్సహించెను. క్రీ. శ. 1582 లో అక్బరు నకీబ్ ఖానుకు మహాభారతమును ఫార్సీలో అనువదించవలెనని ఆజ్ఞాపించెను. అక్బరు స్వయముగా ఈ కార్యమునందు శ్రద్ధవహించి ప్రతి దినము రాత్రి వేళల మహాభారత విషయములను నకీబుకు తెలుపుచు వచ్చెను. ఈ పనిలో నకీబుకు సహాయము చేయవలసినదని అబ్దుల్ ఖాదర్ అనే పండితునికి అక్బరు ఆజ్ఞ నిచ్చెను. కొన్ని నెలలలోనే రెండు పర్వములు అనువదింపబడెను. ఈ మహాభారతానువాదములో తోడ్పడినవారు ముల్లాషేరీ, సుల్తాన్‌హాజీ, షేక్ ఫైజీ మొదలైనవారు కలరు. ఇది మహాభారత కథానువాదమే. ఈ పుస్తకమునకు "రజ్మ్‌నామా" అని అక్బరు పేరిడెను. అనగా "యుద్ధపుస్తకము" అని అర్థము. గ్రంథ రచనానంతరము మంచి చిత్రములు గూడ ఆయా కథాసందర్భములలో అక్బరు వ్రాయించియుండెను. ఈ రచనకు అక్బరు 40,000 బంగారు నాణెములను ఖర్చుపెట్టెను. దీనికి ఉపోద్ఘాతమును అబుల్ ఫజల్‌తో వ్రాయించి యీ గ్రంథ ప్రతులను మంత్రులకు సామంతులకు పంచెను. క్రీ. శ. 1585 నుండి 89 వరకు అబ్దుల్ ఖాదరు రామాయణమును అక్బరు ఆజ్ఞచేత అనువదించెను. ఆ సార్వభౌముని కోరికపై అబ్దుల్ ఖాదరు మహమ్మదీయ మతమును స్వీకరించిన ఒక దాక్షిణాత్య పండితుని సహాయముతో అథర్వ వేదమును పార్సీలో అనువదించెను. ఈ కార్యమును సరిగా నెరవేర్చనందుకు చక్రవర్తి ఈ పనిని షేక్ ఫైజీకి అప్పగించెను. హాజీ ఇబ్రహీం సర్ హిందీ అను విద్వాంసుడు గూడ ఈ పనిలో తోడ్పడెను.

ఫైజీ లీలావతీ గణితమును, ముకమల్ ఖాను నక్షత్రశాస్త్రమును, మౌలానా షాహ మొహమ్మద్ సంస్కృతములోని కాశ్మీర చరిత్రను పారశీక భాషలోనికి అనువదించిరి. మౌలానా ఇమాముద్దీన్ కల్హణుని రాజతరంగిణిని అనువదించెను. నసరుల్లా ముస్తఫా హరివంశమును, మౌలానా హుస్సేనీ పంచతంత్రమును పారశీకభాషలోనికి అనువదించిరి. "నల దామన్" అను పేరుతో నలదమయంతుల కథను ఈ కవి "లైలా మజ్నూ" కథను అనుసరించి వ్రాసెను. అక్బరు సార్వభౌముడు అబ్దుల్ ఖాదర్‌ను "ద్వాత్రింశత్ పుత్తలిక" అను గ్రంథమును ఒక బ్రాహ్మణ పండితుని సహాయముతో అనువదించవలసిందని ఆజ్ఞాపించెను. అబుల్ ఫజల్ పర్యవేక్షణలో "గంగాధర, మహేశ మహానంద" అను గ్రంథములు అనువదింపబడెను.

దారాషికోహ గొప్ప సంస్కృత విద్వాంసుడు. అతడు అఖిలభారత సంస్కృత విద్వాంసులను ఆదరించి పోషించెను. ఆయన బ్రాహ్మణ పండితుల సహాయముతో అనేక ఉపనిషత్తులను పారశీకభాషలోనికి అనువదించెను. అతడు ఈ గ్రంథముయొక్క ఉపోద్ఘాతములో తాను కాశ్మీరములోనున్న ముల్లాషాహ అను సూఫీకి శిష్యుడై సూఫీ మతమునుగూర్చి పూర్తిగా తెలుసుకొన్నాననియు, తన పరిశ్రమ అంతయు వ్యర్థమైనదనియు, తాను హృదయపూర్వకముగా ఆశించిన మనశ్శాంతి సూఫీ మతమువల్ల తనకు లభించలేదనియు, ఆ మనశ్శాంతి వేదములు ఉపనిషత్తులు చదువుటవలన

తనకు కలిగినదనియు వ్రాసినాడు. "యోగవాసిష్ఠము"గూడ అతడు అనువదించెను. ఈ గ్రంథమును పూర్వము అక్బరుకూడ అనువదింపజేసియుండెను. "సముద్ర సంగమము"అను గ్రంథమును దారాషికోహ వ్రాసి, అందులో సూఫీ మతమునకు హిందూ మతమునకు సమానములైన అంశములను ప్రస్తావించెను.

దారాషికోహ తన మేనమామ షాయిస్తాఖాను చేత బహుశా సంస్కృత సాహిత్యమునందు ప్రోత్సహించబడియుండునని తెలియుచున్నది. షాయిస్తాఖానుడు గొప్ప సంస్కృత పండితుడు. కవి. అతని శ్లోకములు చతుర్భుజుని రసకల్పద్రుమములో ప్రస్తావింపబడినవి. మధ్య యుగమున మహమ్మదీయ ప్రభువులు హృదయపూర్వకముగ సంస్కృతమును ఆదరించుటయేగాక ఆ సాహిత్యములో గ్రంథములుగూడ రచియించిరి. మహమ్మదీయ ప్రభువులను ఉదాహరణముగా పెట్టుకొని అప్పటి హిందూరాజులుగూడ అనేక సంస్కృత గ్రంథములను వ్రాయించిరి. బెంగాల్ ముస్లిం రాజుల పోషణలోనే సంస్కృతములో నవ్యస్మృతి, నవ్యన్యాయము అను రెండు శాస్త్రశాఖలు పుట్టినవి.

పైన ఉదాహరించిన విషయములవలన హిందూ మహమ్మదీయ సంస్కృతులు క్రీ॥ శ॥ 11 వ శతాబ్ది నుండియే భారతదేశములో కలసిమెలసి యున్నట్లు తెలియగలదు. ఈ విధముగా ముసల్మానురాజుల పోషణలో అభివృద్ధి చెందిన కవులు గ్రంథములు కొన్ని మాత్ర మిక్కడ ప్రస్తుతింపబడును.

భానుకరుడు:—ఈ కవి ముస్లిములు పోషించిన కవులలో మొదటివాడు. వారి ఆదరమును అధికముగా పొందినవాడు. కవికి "భానుదత్తుడు"అను పేరుకూడ కలదు. ఇతడు 12 వ శతాబ్ది పూర్వార్ధమునందుండినాడు. ఇతడు గీతగౌరీశ, రసతరంగిణి, పద్యవేణి అను గ్రంథములను రచించెను. నిజామ్‌షాహ, షేర్ షాహ రాజుల పోషణలో నుండెను. ఈయన తన కృతిలో "కా హానిః శేరసాహ క్షితిప కుఃమణేరశ్వ కోటీశ్వరస్య" అని తన ప్రభువును పొగడెను. షేర్ షాహ సభలోను, నిజామ్‌షాహ సభలోను గౌరవమును పొందెను. నిజామ్‌షాహనుగూర్చి ఈ కవి రచించిన అనేక శ్లోకములు లభించుచున్నవి.

"అయం కామో నిజామో వా
కిం త్వయా వ్యవధారితం"
"నృపతి నిజామ్ చమూచరణార్పిత
జనిత ప్రభూత పీడాభిః."
"ధరణీధర నిజముశాహ యుష్మత్
కరకరవాలకరాళ కాలసర్పః"
"తత్ కిం రాజపథే నిజామధరణీ
పాలోయ మాలోకితః"
"క్షోణీకామ నిజాముశాహ విలసత్
సిందూర కుంద్రసజి"
క్షోణికామ నిజాము తావక భుజం
లబ్ధ్వా భుజంగేశ్వరం"
"నిజామవసుధాధిపే క్షితిపతి శోణకోణే దృశా"
"నైవ ప్రాపి క్వచిదపి తతః శ్రీ నిజామద్వితీయః"
"పద్వద్గోష్ఠీ గరిష్ఠ ప్రతిభటదమన
శ్రీ నిజామ ప్రతీభః"
"క్షోణీకామ నిజామశాహ భవతః
ప్రౌఢప్రతాపానలైః"
"జాయంతే శ్రీ నిజామ పృథురణ భవతః
ప్రౌఢనిస్సాణనాదాత్"
"దిగ్బాలా తనుతే నిజామనృపతే
వాతం పతాకాంశుకైః"

ఈ మొదలైన శ్లోకములను భానుకరుడు నిజాం శాహ పోషణలో ఉండి రచియించెను.

అక్బరీయ కాళిదాసుడు:—ఈ కవి అక్బరు చక్రవర్తి కాలములోనుండెను. 'రామచంద్ర యశః ప్రశస్తి" అను కావ్యమును రచించి రేవా రాజున కంకితమిచ్చెను. ఈ కావ్యము ఆ రాజు పేరనే ప్రసిద్ధిబడసెను. ఇతడు నాలుగు వందల సంవత్సరముల క్రితము ఉండినాడని తెలియుచున్నది. ఇతని పేరువల్లనే, అక్బరున కితడభిమానపాత్రుడని తెలియుచున్నది. ఇతడు అనేక రాజుల ఆస్థానములను అలంకరించెను. దళపతి, జల్లాల వీరభానుపుత్ర, రామచంద్ర మొదలగు హిందూ రాజులను కూడ కొలిచెను. ఇతడు అక్బరు చక్రవర్తిని అద్భుత మహా చక్రవర్తిగా వర్ణించెను.

"వేల్లత్యంభోధరశ్రీ రకబరధరణీ
పాల పాణీ కృపాణీ
గాజీజల్లాలుదీన క్షితిపకులమణే
ద్రాక్ ప్రయాణే ప్రతీతే"
"వీరత్వం కార్ముకంచే దకబరకలయ
స్యుగ్రటంకార ఘోషం"
"దిజ్ఞాగారబ్ధగుంపస్తవ విశదయశః
కేసరీ కాబిలేంద్ర"

"...అర్ధతి వాసుకిం స్వయశసా
ఢిల్లీంద్ర చూడామణిః"
"తత్ సత్యం శ్రీ హుమాయూంకులతిలకమణే
భీషణాత్ భీషణోసి"

ఈ విధముగా అనేక రీతుల అక్బరు చక్రవర్తి నీతడు వర్ణించెను. ఈ కవి వ్రాసిన 'సూక్తి సుందర' మను కావ్యములో అక్బరు యుద్ధయాత్ర వర్ణింపబడినది. ప్రకృతివర్ణనలోను, యుద్ధ వర్ణనలోను నితడు సిద్ధహస్తుడు. ఇతనికి "అక్బరీ కాళిదాసు" అను పేరు ఆకాలములో బిరుదనామముగా నుండెనని తెలియుచున్నది. సకలాలంకార నిబద్ధమైన రచనతో నీ కవి తన ముస్లిము ఏలికలను అభివర్ణించెను.

జగన్నాథపండిత రాజు:—ఈ పండితకవి క్రీ.శ. 1628 నుండి 1658 వరకు ఉన్న షాహజహాన్ చక్రవర్తి ఆస్థానకవి. దారాశికోహ కూడా ఇతనిని ఆదరించెను. ఇతడు ఆంధ్రదేశములో గోదావరీ తీరమునందలి ముంగండ గ్రామనివాసి. వేగినాటిశాఖకు చెందిన ఆంధ్ర బ్రాహ్మణుడు. ఇతని తల్లితండ్రులు లక్ష్మి పేరుభట్టులు. తండ్రి అనేక శాస్త్రములలో మహాపండితుడు. జగన్నాథుడు తండ్రి వద్దనే విద్యాభ్యాసము చేసెను. జగన్నాథుడు ఇస్లాము మత గ్రంథములను, సాహిత్యమును చాల త్వరగా చదివి ఆ మతములో ఖాజీని ఓడించెను. ఈ అద్భుతమును విని ఢిల్లీ పాదుషా జగన్నాథుని తన దర్బారుకు పిలిపించెను. జగన్నాథుడు "లవంగి" అను ఒక ముస్లిమ్ బాలికను ప్రేమించి పెండ్లియాడెను. ఆ యవనస్త్రీని "యవనీ రమణీ విపదశ్శమనీ, యవనీ నవనీతకోమలాంగీ" లోనగు శ్లోకములచేత వర్ణించెను. జహంగీరు కాలములో అతడు ఢిల్లీకి పోయెను. అతడు నూరుద్దీన్ చక్రవర్తిని "వ్యాకుప్య న్యారదీన క్షితిరమణ" అని వర్ణించెను. నూర్జహానుకు సోదరుడైన "ఆసఫ్‌ఖాన్" అను షాహజహాన్ మంత్రి పైన 'ఆసఫ్ విలాసము' అను కావ్యమును రచించి షాహజహాన్ వలన పండితరాజ బిరుదమును పొందెను. జగన్నాథుడు తనదృష్టిలో ఇద్దరే ప్రభువులు అని "ఢిల్లీశ్వరోవా, జగదీశ్వరోవా మనోరథాన్ పూరయితుం సమర్థః, అన్యైః నృపాలైః పరిదీయమానం శాకాయ వాస్యాల్లవణాయ వా స్యాత్" అను శ్లోకములో తెలిపెను. షాహజహాను దర్బారులోనే ఈ కవి చాలా కాలము గడపెను. ఇతడు కొంతకాలము దారాశికోహ పోషణలో కూడా ఉండెను. దారాశికోహ హత్య తరువాత నిర్వేదమును చెంది జగన్నాథుడు ఢిల్లీ వదలి, కాశీ చేరెను. "ఇతడు కులభ్రష్టుడైనందుకు అప్పయ దీక్షితులితనిని గర్హించగా, కోపముచే జగన్నాథుడు దీక్షితుల గ్రంథములకు ఖండనములు వ్రాసి తన ప్రియురాలైన లవంగితో గంగలో మునిగెను." అని యొక కింవదంతి కలదు. ఇతడు "ఢిల్లీవల్లభపాణి పల్లవతలే నీతమ్ నవీనం వయః" అని చెప్పుకొనెను. ఆసఫ్ విలాస కావ్యాంతము నందలి గద్యములో "నవాబ్ ఆసఫ్ ఖాన్ మనః ప్రసాదేన సార్వభౌమ శ్రీ షహాజహాఁ ప్రసాదాధిగత పండిత రాజ పదవీ విరాజితేన జగన్నాథేన" అని చెప్పుకొనెను.

అమృతదత్తుడు:— ఈ కవి షహాబుద్దీన్ దర్బారులో నుండెను. ఈ నవాబు కాశ్మీరరాజు. కాశ్మీరముపై దాడివచ్చిన "మీరా షాహ" అను నవాబును షహాబుద్దీన్ బెదరించు శ్లోకమును అమృతదత్తు డీవిధముగా వ్రాసెను:

"కాశ్మీరాగంతు కామస్య మీరశాహాఖ్య భూపతేః,
శహాబుద్దీన భూమీంద్రః ప్రాహిణోదితి లేఖకం"

ఈ కవి క్రీ. శ. 12 వ శతాబ్దిలో నుండెను.

పుండరీక విఠలుడు:— ఇతడు క్రీ. శ. 16 వ శతాబ్ది అంతమునందు ఖాన్‌దేశ రాజ్యమును పాలించిన బుర్హాన్‌ఖాన్ దర్బారులో నుండెను. ఈ నవాబు తండ్రి తాజ్ ఖాన్, తాత అహమద్ ఖాన్. పుండరీక విఠలుడు ఈ నవాబు ఆస్థానములోనుండి "రాగమాల" అను సంగీతశాస్త్ర గ్రంథమును రచించెను.

హరినారాయణ మిశ్రుడు:—ఈ కవి 17 వ శతాబ్ది మధ్యభాగమున వెలసిన శాహజహాన్ కాలములో నుండెను. ఇతని రెండు శ్లోకములు మాత్రమే లభించుచున్నవి. అందొకటి శాహజహాన్ వర్ణన పరముగనున్నది. "శ్రీమచ్ఛాహ జహాఁ ప్రభావమి తదిదం మాహాత్మ్యం" అనునది ఆ శ్లోకము.

వంశీధరమిశ్రుడు:—ఈ కవి శాహజహాన్ చక్రవర్తి భార్యచే గౌరవింపబడెనని యితని పద్యామృత తరంగిణిలోని ఒక శ్లోకమువలన తెలియుచున్నది. "ఢిల్లీంద్ర శాహజహాన మహిష్యాః సేవకో వంశీధరః" అని యితనినిగూర్చి చెప్పబడెను.

చతుర్భుజుడు —ఈ కవి ఔరంగజేబు మేనమామ, మంత్రియునగు శాయస్తాఖాన్ పోషణలో నుండి అతనిపై కృతజ్ఞతా సూచకముగా 'రసకల్పద్రుమము' అను కావ్యమును రచించెను. ఈ కవి క్రీ. శ. 17 వ శతాబ్ది అంతమున నుండెను. ఇతని గ్రంథము లభించుటలేదు. కాని అందులోని ఖానుని వంశవర్ణన శ్లోకములు మూడు లభించుచున్నవి. ఖానుని తాత పేరు ఇతమాద్దౌలా అని

రితమా
ద్దాలేతి నామా భవత్."

అను శ్లోకమువలన తెలియుచున్నది. ఖానుని తండ్రి పేరు "అసక్ ఖాన్" అని

"సుతను రసకఖానః సూనురస్మాత్ కృతారిః"

అను శ్లోకమువలన తెలియును. శాయిస్తాఖానుని గూర్చి

"శాస్తాఖాన నృపో విహస్తమతిభృ
చ్ఛస్త్రాస్త్ర శాస్త్రార్ణవే"

అని చెప్పబడినది.

"జానామిదానాయ సువర్ణశైలం
స్తనాయ తావత్ వదనాని వేధాః,
శాయిస్తఖానస్య యశః ప్రతాప
సామ్రాజ్య సోమద్యుమణీ ససర్జ."

అని వర్ణింపబడినది.

...క్ష్మీపతి:—ఈ కవి 18 వ శతాబ్ది ఆదిభాగములో మొగల్ పాదుషా మంత్రియగు అబ్దుల్లా ఆశ్రయములోనుండి "అబ్దుల్లా చరితము" అను చంపూ గ్రంథమును రచించెను. 1720 లో మహమ్మద్ షాహ రాజ్యమునకు వచ్చెను. ఈ గ్రంథములో 1707 నుండి 1720 లో జరిగిన చరిత్రాంశములు వర్ణింపబడినవి. 1721 లో ఆంగీర మరణించెను. ఈ గ్రంథములో అక్బరు, జహంగీర్, శాహజహాన్, ఔరంగజేబుల ప్రస్తావము కలదు. లక్ష్మీపతి యీ చంపువులో, ఔరంగజేబు కొడుకైన మహమ్మద్ షాహ దర్బారులో మంత్రిగా నున్న అబ్దుల్లా మంత్రిత్వమునుండి తొలగింపబడినపుడు తిరిగి మంత్రిత్వ సంపాదనకై అతడు చేసిన దాడి వర్ణింపబడినది.

"ఔరంగజేబ మారభ్య వ్యవహార స్వయా ఖిలః"

ఇత్యాది శ్లోకములవల్ల పై యంశములు స్పష్టమగును. అబ్దుల్లా, హుస్సేన్ అలీఖాన్, సైయద్ ఖాన్ అను ముగ్గురు సోదరులు. వీరిలో అబ్దుల్లా డిల్లీ మంత్రి; మహమ్మద్ షాహ, హాసన్‌ను హత్య చేసినప్పుడు అబ్దుల్లా సహించక షాహపైన దాడిచేసి ఓడిపోయెను. కాని షాహ అతడు పూర్వము చేసిన సేవను తలచి తిరిగి మంత్రిగా అతనిని నియమించెను.

"దారాశాహం నిరుత్సాహయు క్తం కృత్వారణాంగణే
ఔరంగజేబహస్తాబ్జే నయ లక్ష్మీః సమర్పితా"

అని అబ్దుల్లాను పొగడెను.

"ఔరంగజేబ భూనాయకులాంభోధికలానిధే,
బేదిలీ (నిరుత్సాహము) మమజాతాస్తి..."

ఇత్యాదులు యీ గ్రంథములోని ముఖ్యఘట్టములు

లక్ష్మీపతి అనేక శాస్త్రములలో పండితుడు. అతనికి కురానుగూడ బాగుగా తెలియును. అరబ్బీ, పార్సీ పదములు విశేషముగా నీకవి తన సంస్కృత కావ్యములో వాడి ఆ భాషలలో తనకుగల పాండిత్యమును తెలిపెను. ఉదాహరణముగా:—

"స నరో గోస్తనీంత్యక్త్వా కరోతి గోస్తభక్షణం"

"గోష్త్" అను పదమును "గోస్త"గా వాడినాడు. అనగా మాంసము.

"యత స్తతోమయా భుక్త్వా జహరం త్యజ్యతే వపుః"

"జహర్" అనగా విషము. ఈ పదమును "జహరం" అని ద్వితీయాంతకర్మపదముగా వాడినాడు.

"గునాహమంతరా త్యక్తుం కరోతి స్వస్య దిల్లకే"
కంబక్తః సోపి, ..." "గునాహ" దోషము. "దిల్లక"మనగా ఆత్మ. "కంబక్త" అనగా దురదృష్టుడు. ఈలాగే 'పంజరస్థిత శేరవత్' అని. "శేర్" అనగా పులి. 'జవాబం కిం ప్రదాస్యతి' అని జవాబ్ అను పదము వాడినాడీ కవి.

"వజీరేషు చ గోషిత్సు దుష్మనీ యైర్విధీయతే"

"వజీర్" అనగా మంత్రి, "దుష్మనీ" అనగా ద్వేషము. "చంద్రేణముస్తరీ". ముస్తరీ అనగా బృహస్పతి. "శరాబపానతో నష్ట చష్మైః నృపతినందనైః" "శరాబ్" అనగా సారాయి. "చష్మ" అనగా కన్ను. ఇది "చక్షుస్" అను సంస్కృతపదమునకు ఫార్సీ రూపము. "మదాంధస్తు యథా ఫీలః" అను చోట ఫీలః అనగా ఏనుగు. "తత్కాలమేవ ఖబర్ ప్రగాహకేణ" అను వాక్యములో 'ఖబర్' అనగా వార్త. "మాహతాబకర స్పృష్ట మంభోజమివ" అనుచోట మాహతాబ్ అనగా చంద్రుడు. 'సుభాహ గోఛలం కృత్వా' అని మరియొకచోట వ్రాసెను. "సుబాహ" అనగా ఉదయము, 'గోసల్' అనగా స్నానము. 'హిలాలమంతరా చంద్ర ఆశ్మానే న విరాజతే' "హిలాల్" అనగా అర్ధ చంద్రుడు. "ఆశ్మాన్" అనగా ఆకాశము. "ఫ్రామోశీ న విధాతవ్యా బరదాస్తం విధీయతాం" అని యొకచో నీకవి వ్రాసెను. "ఫరామోశీ" అనగా కోపము. "బరదాస్తు" అనగా ఓర్పు. 'దలీలమస్తి మే సత్యం'. "దలీల్" అనగా ప్రమాణము.

ఇట్టివి ఎన్నియో ఫార్సీ అరబ్బీ భాషాపదములను సంస్కృతశ్లోకములలో కలిపి లక్ష్మీపతి యీ కావ్యమును మణిప్రవాళము చేసినాడు. ఇతడు కవియే గాక చరిత్ర పరిశోధకుడు కూడా.

ఈ ఉదాహృత విషయములవలన క్రీ. శ. 11 వ శతాబ్ది నుండియే హిందూ మహమ్మదీయ సంస్కృతులు మనదేశములో కలిసి మెలసి యున్నట్లు తెలియుచున్నది.

# సూర్యతనయాసు

శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు

పాతక పాత హేతువయి పావనమై పురుహూతనీల ర
త్నాతతకాంతినొప్పు భవదంగ మహార్ణముఖమందు గాంచ నే
పాతకి నోచునో యమున! వాని మనంబున నిల్చు నీరద
వ్రాతసమచ్ఛవిం బొలుచు వారిజనాభుని రూపసంపదల్.

కలుషపరంపరల్ హరుని కంఠలసద్ద్యుతితో హరించు నీ
జలములఁ గ్రుంకి యచ్చరల చామరచాలసమీరసేవ్యులై
బలరిపుపీఠమెక్కుదురు పాపులు నీదు మహానుభావముల్
జలరుహబంధునందనిరో! సన్నుతి సేయఁగ నేర్తురే నరుల్.

కలిత మదాంధగంధగజగండవిలోల మిళిందనాద సం
కులములు భూపముఖ్యుల ప్రకోష్ఠము లొల్లఁ గళిందనందినీ
చెలువగు నీ తటాంతర విచిత్రవనంబులఁ గందమూలముల్
ఫలములు వృత్తిగాఁగ నిజవాసరముల్ గ్రమియింతు మౌనినై.

స్ఫురదురుమౌక్తికప్రకరశోభలు లోపలఁ బైకి నింద్ర నీ
లరుచులు గల్గు నీదు సలిలంబులఁ గ్రుంకు నరోత్తముండు భా
స్కరతనయా! భజించు క్షణకాలము భీషణసౌమ్యమైన యా
హరిహర దివ్యరూపము మహోద్భుతమంద నుమారమాసఖల్.

కలితోత్తుంగ తరంగసంకుల భవద్గంభీరవాఃపూరముల్
నలినాప్తాత్మజ! నేత్రపర్వముగ సందర్శించునందాక యీ
లలనామోహము పాపభీతియును గాలవ్యాళదౌష్ట్యంబు దు
ష్కలిసామ్రాజ్యము దండపాణి భటనిశ్శ్వాసాగ్ని ధూమచ్ఛటల్.

"కాళిందీ" యను నక్షరంబులను హృత్కంజాతమం దెవ్వఁడే
లీలాయుక్తి భజించుఁ దత్కరమునన్ నిల్చున్ సమస్తార్థముల్
నీలాశ్మచ్ఛవులీను నీ జలములన్ నిష్ఠాగరిష్ఠాత్ముఁడై
తేలంగల్గిన దత్ప్రభావగరిమల్ దెల్పంగ శక్యంబులే?

# సూర్యతనయా స్తుతి

పరధనము న్హరించుటయు బ్రాహ్మణహత్య సురాభిలాషయున్
గురుసతితోడి పొత్తు మదిఁగోరుట కాంచనచౌర్యమాదిగా
నరు లొనరించు పాపముల నాశమొనర్పఁ బ్రతిజ్ఞఁబూని యో
తరణికుమారి ! నీ జలము దాపుననుండ నఘంబులంటునే !

నీదగువారిపూరముల నిత్యముఁ గ్రోలుచు రాధికా మనో
నాథుని పుణ్యగాథలు మనంబున ధ్యానమొనర్చుచున్ మహా
మోదముతోడ నీదుతటభూరుహ పంక్తులలోఁబరేత రా
ట్సోదరి! మౌనిభావమున శుద్ధమతిన్ జరియించు టెన్నఁడో.

జననీ ! నీ విమలాంబుపూరములలోఁ జన్మంబు వోనాఁడు నే
మనుజుం డాతని పాపసంఘము లెదన్ మన్నించు వైవస్వతుం
డనుజప్రీతిని భాస్కరుండును దదీయాంగంబు భేదించుటన్
గనియున్ గోపమునొందఁ డమ్మరో! నిను న్గన్నట్టి మోహంబునన్.

తరణి తనూజ ! గోపవనితారసికప్రియ! దండహస్తసో
దరి ! యమునా ! సమస్తజన తాపవినాశిని ! పాపహారిణీ !
సరసపయఃప్రపూర ! యని స్నానమొనర్చుచు నీదు నామ సం
స్మరణ మొనర్ప సప్తభవసంచితపాపము లెల్ల రూపఱున్.

(పండితరాయల అమృతలహరికి ఆంధ్రానువాదము.)

# వైదిక కావ్యాలలో జైనుల కైవాడం

శ్రీ కె. కుశాలప్పగౌడ

భారత భవ్యాకాశంలో భారత రామాయణాలు సూర్యచంద్రులవంటివి. వివిధ మత భాషలున్న మన దేశంలో ఈ భారత రామాయణాలు వివిధ రీతులుగా దేశకాలానుసారంగా మార్పు చెందాయి. వాల్మీకి రచితమైన రామాయణరసఘుని పలువురు కవుల ప్రతిభాకుల్యాలలో ప్రవహించి పలు మత క్షేత్రాలను సారవంతం చేశాయి. ఈ కారణంవల్లనే మనదేశంలో జైనబౌద్ధ వైదికసంప్రదాయాల రామాయణ భారతాలు వ్యాపించాయి. కన్నడనాడులో సాహిత్య ప్రోద్గమకాలంలో జైనులు ప్రబలులైనందున ఆ మత ప్రతిచ్ఛాయలు వారు రచించిన వైదిక కావ్యాలలోను ప్రతిబింబించాయి. కన్నడ సాహిత్యంలో ఆదికవి అని పేరుపొందిన పంపకవి వేంగీ మండలాన్ని 10 వ శతాబ్దం మధ్యభాగంలో (941) పాలించిన చాళుక్య అరికేసరి ఆస్థానంలో విరాజిల్లి జైన పురాణమైన ఆదిపురాణాన్ని మొదట రచించాడు. తర్వాత రాజు కోరికపై సుప్రసిద్ధమైన విక్రమార్జున విజయమునే సమస్త భారత సారాన్ని చారిత్రక వ్యక్తులతో పౌరాణిక ఘటనలను సమ్మేళనంచేసి, రచించి కీర్తి పొందాడు. తర్వాతి కవులలో కొందరు మొదట జైన పురాణం, మరొక లౌకికకావ్యం రచించడానికి ఇది మార్గదర్శకమైంది. వీరిలో రన్నకవి పంపకవి అడుగు జాడలలో నడిచాడు. పంపకవి సమస్త భారతేతిహాసాన్ని సంగ్రహించి విక్రమార్జున విజయాన్ని రచించగా, రన్నకవి సింహావలోకనక్రమంతో ఒక పర్వంలోని కథలో భారతాన్ని ఇమిడించినాడు. పంపకవి జినాగమాన్ని ఆదిపురాణంలోను, లౌకికాన్ని విక్రమార్జున విజయంలోను వెలయించగా, రన్నకవి లౌకికానికి సాహసభీమవిజయాన్ని, జినాగమానికి అజితపురాణాన్ని మీదుకట్టాడు. అంతేకాదు. కావ్యపు అంతరంగుణాలలో ఒకదానికి మరొకటి ప్రతిద్వంద్వి అన్నంతగా చిత్రించాడు. చాళుక్య అరికేసరి సామంతచూడామణికాగా, పంపకవి అతని గుణశీలాలను అమ్ముడుపోయి, అతని బిరుదులను అర్జునునికి ఆరోపించాడు. ఉదాహరణకు:—అరికేసరికిగల సాహసాంక, గుణార్ణవ, ఉదాత్తనారాయణ, సామంతచూడామణి అనే బిరుదులను అర్జునుని వర్ణించే పట్టులలో అక్కడక్కడ కనిపిస్తాయి. రన్నకవి కావ్యంలో రాష్ట్రకూటులనుంచి రాజ్యం కైవసం చేసుకొని కల్యాణి చాళుక్య వంశస్థాపకుడైన సూర్యుడి తైలప చక్రవర్తి వంశానువర్ణనమే భీముని వంశానువర్ణనం. అతని కుమారుడు ఇరివ బెడంగ సత్యాశ్రయుని—సాహసభీమ, చాళుక్య కంఠీరవ, చాళుక్య కందర్ప అనే కవి మనమెచ్చు - బిరుదులు గదాయుద్ధంలోని భీమునికి కూడా చెలుతాయి. ఈవిధంగా కర్నాటకక్షాత్రయుగంలో అవతరించి కవులుగాను కదనవీరులుగాను గంటంలోను, కటారిలోను అద్వితీయమైన కైవాడం చూపి, యశస్వులైన ఈ కవులిద్దరిలో బింబ ప్రతిబింబ సామ్యం కనిపించినా, పంపకవి పంపకవిగానే, రన్నకవి రన్నకవిగానే ఉండిపోవడం కూడా కానవస్తుంది. అంతేకాక, పంపకవికి శిష్యునిలాగ ఉన్న రన్నకవి పంపకవినిగురించి తన గదాయుద్ధ కావ్యంలో ఒక్కమాటైనా అనక పంపకవికి సామంతునివలె ఉన్నప్పటికీ కవిచక్రవర్తిగా శోభిస్తాడు.

ఆది పంపకవి తర్వాత అభినవపంపకవి ఒకడు ఉద్భవించడానికి సుమారు నూరేళ్ళు అవసరమైంది. పంప రన్న కవులిద్దరి మధ్యగల సామ్యం ఆదిపంప, అభినవ పంపకవుల మధ్య లేదు. ఒకరు భారతం రచించారు. మరొకరు రామాయణం అథవా రామచంద్ర చరిత పురాణం రచించారు. వైదికులకు (వేదమతానుయాయులకు) ధర్మగ్రంథాలుగా పరిగణించబడిన ఈ రామాయణ మహాభారతాలు జైన సంప్రదాయంలో లౌకిక కావ్యాలవుతున్నవి. పంప రన్న కవులు పెట్టిన పద్ధతి యిది. అభినవ పంప (నాగచంద్ర) కవికి ముందే పొన్నకవి రచించిన లౌకిక కావ్యమైన భువనైక రామాభ్యుదయ మనేది ఉందనే ఉల్లేఖనాలు, ఉదాహృత పద్యాలూ కేశిరాజు శబ్దమణిదర్పణం మొదలైనవాటిలో లభించినప్పటికీ, సమగ్రగ్రంథం లభించ

లేదు. కనుక కన్నడంలోని జైనరామాయణాలలో అభినవ పంపకవిదే మొదటిది. సుప్రసిద్ధమైన వైదిక కథలను గ్రహించడంవల్ల అభినవ పంపడని చెప్పుకొన్నాడో ఏమో! ఇద్దరూ మూలకథల ఉత్తమ సంగ్రాహకులు గనుక నాగచంద్రునికి ఈ పేరుకు (అభినవ పంపడనే పేరుకు) అర్హత ఉండవచ్చు; ప్రతినాయకుల చిత్రణంలో ఇద్దరికీ సామ్యం కనిపించినా కనిపించనూ వచ్చు; అయితే, ఇద్దరిమార్గమూ వేరు వేరు. శైలి అయితే పూర్తిగా భిన్నం. ఆది పంపడయితే వైదిక సంప్రదాయానుయాయి. ఆయన రాజు ఆస్థానకవి. తను జైనుడైనప్పటికీ పూర్వుల వైదికరక్తం తన ధమనులలో ప్రవహిస్తూ మనస్సు జినధర్మంలోను, అహింస అనే ఆకాశగంగలోను పునీతమైంది. అయినా మతాంధత లేదు; ఆ మతం ఈ మతమనే భ్రమలేదు. దీనికితోడు రాజు ఆప్తమిత్రుడు. చనువున్న నెచ్చెలి! గుణాలకు అర్హుడు; తనకు ఒడయుడు; ఆశ్రయ దాత. రాజు కీర్తిని తన దుందుభి గభీరధ్వనితో ఘోషించడానికి, అలాగే సమరాంగణంలో కత్తిపట్టి ముందుకురికి 'అరాతి నాయకరపట్టనె పారిసల్' (నాయకుల పట్టుగని కడతేర్చ) శక్తుడు. రెండు తరాలుగా తనదాత ఋణపడియున్నాడు. అందుకోసం తన అద్భుతకవి వాణిని వైదిక వాహినితో పారించాడు. ఈరీతిగానే చాళుక్య చక్రవర్తి సూర్మడి తైలప చక్రవర్తిని ఆశ్రయించిన రన్నకవి కూడ తన కృతికన్యను 'చాళుక్య కందర్పుడు' 'ఇరివబెడంగ' సత్యాశ్రయునికి అప్పగించాడు. ఆయా రాజులవల్ల కవులకు ధనకనకవస్తు వాహనాలు, పురస్కారం, పొగడ్తలు, పదవి బిరుదులు అహమహమికతో ముసురుకొని వచ్చేవి. కాని, నాగచంద్రుడు వీరికి పూర్తిగా భిన్నుడు. ఇతడు—

"శ్రీ నిలయ నిష్ట విషయ సు
ఖానుభవం బడెదు దేవనిర్మితమెనిసి
ర్దానగరియొళ్ ప్రాకృత
మానధనం సుఖది నిర్ద నభినవ పంపం."

(శ్రీనిలయము డిష్ట విషయ సు
ఖానుభవము వడసి దేవ నిర్మితమనిన
ట్టానగరిలో నప్రాకృత
మాన ధనుడు సుఖము నుండె నభినవపంప.)

పైన పేర్కొన్న కవులకు వైదిక కథలను ఉన్న రీతిగా రచించడానికి, అభినవపంపనికి రామాయణాన్ని జైన రీతిలో రచించడానికి, ఒదిగిన సన్నివేశాలూ వేరే వేరే. ముందు చెప్పినట్టు పంప రన్న కవులు రాజాశ్రయం పొందినవారు. రాజులు వైదికమతానుయాయులు. వారి స్నేహాశ్రయాదార్యాలకు కట్టుబడినందున, ఈ కవులు కథలను వ్యాసుని మూలకథనుంచి సంపూర్ణంగా దారి తప్పించడానికి పూనుకోక చాలవరకు యథాతథంగానే రచించి ముగించారు. అభినవ పంప కవి కావ్యం రచించినది ఏ రాజు పెద్దతనపు పొగడిక కోసం కాదు. తనమతశ్రద్ధను నిశ్చలంగా చూపడానికి జైన సంప్రదాయంలో సంస్కృతంలో ఉన్న రామాయణ కథను అనుసరించాడు.

ఇలా మూలకథ ప్రసిద్ధమైనదైనా ప్రఖ్యాత కవులవల్ల (ఉదాహరణకు:—భవభూతి, దిఙ్నాగాచార్యుడు రామాయణాన్ని, భాసుడు భారతాన్ని మార్పులు చేయడం) నానారీతులుగా వ్యత్యస్తం కావడం కొత్తదేమీ కాదు. ఇది అపగాధ మనడమూ సాధ్యం కాదు. అద్భుత రామాయణము, ఆనంద రామాయణము, శేష రామాయణము మొదలైన రామాయణాలు మనకు విపులంగా ఉండనే ఉన్నాయి. ఈ విధంగా వాల్మీకిరామాయణంతో అక్కడక్కడ పొందిక ఉన్నా వ్యత్యాసాలే విశేషంగా ఉన్న జైన బౌద్ధ రామాయణాలూ సంస్కృత ప్రాకృతాలలో లభిస్తున్నాయి. ఇలాటి సందర్భంలో మన అభినవ పంపకవి విమలసూరి రచించిన జైన రామాయణానికి సంపూర్ణంగ ఋణపడిఉన్నాడు. ఇంతటి అర్థవ్యక్తి, మృదూక్తి—కావ్యగుణాలున్న నాగచంద్రుడు మత శ్రద్ధ అనే సంకెళ్ళను తుంటలుగా తెంచి, పంప రన్న కవులను అనుసరించిఉంటే, కన్నడ కుల రసికులు ఇతన్ని కొండాడి వారి (పంప రన్నల) కోవకు చేర్చి పూజించేవారు. కనుకనే ఇతనికి తగినంత జనప్రియత లభించలేదు. నీలాకాశంలో అక్కడక్కడ మబ్బు తునకలు వ్యాపించిఉన్నా, ఒక్కొకచోటనుంచి మినుకుమినుకుమని కాంతి వెదజల్లే తారకలవలె భవావళి (జన్మ పరంపర) వర్ణనలో, మితిమీరిన వైరాగ్య బోధనలలో పైకుబికివచ్చే రసగుళికలవల్ల ఇతని కావ్యం తగినంత గౌరవం పొందకపోలేదు. ఆదిపంపకవిని మెచ్చుకొని, అతని ప్రభావానికి లోనయిన కుమార వ్యాసుడనే బ్రాహ్మణకవి తను భారతాన్ని రచించేటప్పుడు చెప్పిన "తిణికిదను ఫణిరాయ రామాయణద భారదలి, కాలిడలు తెరహిల్ల" (తల్లడిలె ఫణిరాజు రామాయణ భారమున, కాలూన తెరవులేదు') అనే

అవహేళన అభినవపంపని రామాయణంగురించే ఏమో—అన్నట్టుంది!

అభినవపంపడు తనకు ఆకరమైన విమలసూరి రామాయణాన్ని అనుసరించినా, అతనివలె నీరస పురాణశ్రవణం చేయించక పాఠకుల భారం తగ్గించాడు. సంగ్రాహక కౌశల్యంలో ఇతడు ఆది పంపకవినే పోలుతాడు.

ఇక జైనరామాయణం వాల్మీకి రామాయణం కన్నా ఏరీతిలో భిన్నమో చూద్దాం. పై చూపులకు ముఖ్యకథ ఒకే మాదిరిగా కనిపిస్తుంది. అయితే ఆంతర భేదాలు విపులం. దీనిలో కథానాయకుడు రాముడు కాదు-లక్ష్మణుడు. ఇది రామచంద్ర చరితపురాణం - రామాయణం కాదు. పలువురు జినమునులు ఇహలోక జనులకు భవావళిని తెలుపుతారు. విపులాచలంలో వీరజినపార్శ్వంలో గణాగ్రణి అయిన గౌతముడు మగధాధిపతికి చెప్పిన రామకథను తను చెబుతున్నానని కవి అంటాడు.

దీనిలో దశరథుని పుత్రకామేష్టి యాగం లేదు. దశరథునికి నలుగురు భార్యలు—అపరాజిత, కైక, సుమిత్ర, సుప్రభ. వీరికి క్రమంగా రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు పుత్రులు. వీరిలో రామలక్ష్మణులు బలాచ్యుతులని వర్ణించబడినారు. (వ్యాసభారతంలో బలరామకృష్ణులలో కృష్ణుడే ముఖ్యుడైనట్టు దీనిలోను, ఇతరజైన కథలలోను బలాచ్యుతులనే పేరు వ్యవహృతమైంది. అన్నకంటే తమ్ముడు ముఖ్యుడవుతాడు) లక్ష్మణుడు శ్యామలవర్ణుడు; రాముడు గౌరవర్ణుడు. వాల్మీకిరామాయణంలో రామునికి అన్వయించే అన్వర్థ నామధేయాలన్నీ ఇక్కడ లక్ష్మణునికి అన్వయిస్తాయి. లక్ష్మణుడు వాసుదేవుడు, కృష్ణుడు, నారాయణుడు, లక్ష్మీధరుడు, పురుషోత్తముడు, జనార్దనుడు అని వర్ణితుడయ్యాడు.

రావణుని వంశావళి వివరణ కూడ దీనిలో ఉంది. జానకి కారణంగా దాశరథిచేత రావణునికి మరణమని నైమిత్తికులవల్ల విన్న విభీషణుడు జనకుని, దశరథుని చంపించడానికి ఏర్పాట్లుచేసినా, నారదుని ముందు సూచనవల్ల జనక దశరథులు గండం తప్పించుకొని బయటపడతారు. సీతాదేవికి ప్రభామండలుడనే అన్న ఉంటాడు. అతడు పసికందుగా ఉన్నప్పుడు ఖేచరు డొకడు దురాగ్రహంతో అతనిని ఎత్తుకునిపోయి, చంపివేసే అవకాశమున్నప్పటికీ చంపక కరుణించి ఖచరపతి అయిన ఇందుగతి ఇంటపడేటట్టు విసిరివేస్తాడు. ఈ విధంగా ప్రభామండలుడు ఇందుగతి సాకుడు కొడుకవుతాడు. నారదుడు సీత రూపాతిశయం చూచి మోహించి నిరాకృతుడవుతాడు. ఈ కసి తీర్చుకోవడంకోసం ఆమె సుందరచిత్రం గీచి ఇందుగతి ఉద్యానంలో తగిలించి వెడతాడు. దానిని చూచి ప్రభామండలుడు చెల్లెలని తెలియక సీతను మోహిస్తాడు. ఇందుగతి అంతకుముందే జనకునికి వజ్రావర్త, సాగరావర్తాలనే రెండు ధనుస్సులను పంపాడు. మొదటి ధనుస్సును వంచి రాముడు సీతను, రెండవదానిని వంచి లక్ష్మణుడు చంద్రధ్వజుని ఇద్దరు కుమార్తెలను పెండ్లాడుతారు. ఇలా ఉండగా, ఇందుగతి తన పెంపుడు కుమారునికి సీతను ఇవ్వవలసిందని జనకుని కోరుతూ దూతను పంపుతాడు. జనకుడది విని సీతను అదివరకే రామునికిచ్చి వివాహం చేసినట్టు వార్త పంపుతాడు. ఆ వార్త విని ప్రభామండలుడు కోపాటోపంతో సైన్యంతో కదిలి రామలక్ష్మణులను ఓడించి, సీతను పట్టితెస్తానని ప్రతిన పట్టుతాడు. అంతలో అతనికి పూర్వస్మరణ వచ్చి, సీత తన చెల్లెలని తెలిసి, వ్యసనపడుతాడు. దీనిలో పరశురామప్రసక్తి లేదు.

రామ లక్ష్మణుల విభవ విజయాలకు భరతుడు విషాదపడుతాడు. కైకేయి ఉపదేశంపై విరాగిఅయిన భరతుని వైరాగ్యవిముఖుని చేయడంకోసం—దశరథుడు జనకుని తమ్ముడైన కనకుని కుమార్తెను ఇప్పించి పెండ్లి చేస్తాడు. వరం నెపంగా రాముడు పోవలసిరావడం రామాయణంలో ఉన్నట్టు ఇక్కడా ఉండడం మాత్రమే కాక రాముడు సత్యస్వరూపుడుగాను ప్రకాశిస్తాడు. లక్ష్మణుడు మాత్రం కోపావేశంతో భీకరుడైనప్పటికీ,—మేర తప్పని క్షుబ్ధసాగరంలా రాముని కనుసన్నలలోబడి—ఊరకుండడం మాత్రమే కాక, వనవాసానికి బయలుదేరిన సీతారాములను వెంబడిస్తాడు కూడా. ఈ వనవాసాన్ని లక్ష్మణుని విజయయాత్ర అని చెప్పడం కవి ఆశయం. దీనిలో లక్ష్మణునికి పెక్కు పెండ్లిండ్లవుతాయి. మొదటి పెండ్లి కాక వజ్రకర్ణుని ఎనమండుగురు కన్యలను, తక్కినరాజుల మున్నూరుగురు కుమార్తెలను, వాలఖిల్యుడనే వానికూతురుని, విజయపురపు వనమాలను, నంద్యావర్త పురాధిపుడైన అతివీర్యుని చెల్లెలిని, శక్త్యాయుధాన్ని నిగ్రహించి జయించినందున క్షేమాంజలి పురాధిపుడైన శత్రుదమనుని పుత్రికను, వేలాంధపురపు విద్యాధరుడనే వాని నలుగురు సుతలను, రావణుని శక్త్యాయుధప్రయోగతాపాన్ని ఉపశమింపజేయగల ద్రోణమేఘుని పుత్రిక విశల్యాసుందరిని, మరి నూరుగురు యువతులను పెండ్లాడుతాడు. రాముడు వాల్మీకిరామాయణంలో ఏకపత్నీవ్రతుడని ప్రసిద్ధి. కాని ఇక్కడ—రామునికి సీతకాక కపిధ్వజ సు

పన్నెండుగురు దుహితలు, దధిముఖపర్వతపు ఖచరపతి సుతలూ భార్యలు.

వాల్మీకి శూర్పణఖపేరు ఇక్కడ చంద్రనఖ అయింది. రావణుని చెల్లెలయిన ఆమె ఖరుని భార్య. వనంలో తపస్సు చేస్తున్న ఆమె కుమారుని లక్ష్మణుడు తెలియక చంపివేయడంవల్ల వీరిని చంప డానికి ఆమె వచ్చి, వీరి రూపం చూచి మోహపరవశురాలవుతుంది. కాని, అవమానితురాలై వైరం తీర్చుకొనడానికి ఖరునివద్దకు వెళ్ళి మొరపెడు తుంది. ఖరుడు ఆమె మాటలు విని లక్ష్మణునితో యుద్ధానికి తలపడుతాడు. ఘోరయుద్ధం జరుగుతుంది. లక్ష్మణుడు ఖరుణ్ని సైన్యసమేతంగా నాశంచేస్తాడు. రాముడు సీతకు కావలిగా ఉంటాడు. ఖరుని సహా యానికి వచ్చిన రావణుడు సీతను చూచి మోహపర వశుడై రాముని మోసంచేయడానికి అవలోకినీ విద్యను బెదరించి యథార్థ విషయం తెలుసుకొని, లక్ష్మణుడు పెట్టిన సంకేతం ప్రకారం అవలోకినీ విద్యతో లక్ష్మ ణునిలాగ సింహనాదం చేయించగా, సహోదరునికి ఏమైందో అని రాముడు జటాయువును సీతకు కావ లిగా పెట్టి బయలుదేరుతాడు. మారీచవృత్తాంతం, కాంచన మృగవృత్తాంతం దీనిలో లేనేలేవు. ఇలా ఒంటరిఅయిన సీతను రావణుడు విమానంలో ఎక్కించుకుని అడ్డుపడిన జటాయువును చావగొట్టి అపహరించుకొని వెళ్లుతాడు.

వాలిసుగ్రీవవృత్తాంతంలో వాలి జైనయతి. సుగ్రీవునికి భంగపాటు జరిగినది మాయావాలినుంచి. రాముని సప్తతాళభేదనానికి మారు రావణ సంహారా నికి లక్ష్మణుడు సమర్థుడని తెలుపడానికి లక్ష్మణుడు సిద్ధశైలం ఉద్ధరించిన ఉందతం ఉంది. సుగ్రీవాదులు వానరులు కారు; వానరధ్వజులు. హనుమంతుడు బ్రహ్మచారి కాడు. ఇతనికి పలువురు పెండ్లాలున్నారు. రావణుని చెల్లెలు చంద్రనఖికుమార్తె అనంగపుష్పను పెండ్లాడిన ఈ హనుమంతుడు రావణుడిచ్చిన కర్ణ కుండల పురానికి అధిపతి అవుతాడు; రావణుడు వరుణునితో యుద్ధం చేసినప్పుడు అతనికి సహాయంగా వస్తాడు; రావణుడు పరస్త్రీని మోహించాడనే కార ణంగా అతనికి దూరమైపోతాడు.

వాలి కైలాసపర్వతంమీద తపస్సు చేస్తు న్నప్పుడు రావణుడా పర్వతం ఎత్తుతాడు. అప్పుడు వాలి తన బొటనవేలితో నొక్కగా, రావణుడు చాల నొప్పిపడి అరవడంవల్ల 'రావణు'డనే పేరు రూఢ మైందని కవి అంటాడు. వాడు దశవదనుడు కాడు. వాడు పుట్టిన పదవరోజున భీముడనే రాక్షసుడు బహూకరించిన భూషణాలలోని మాణిక్యాలలో రావణుని ముఖం ప్రతిబింబించడంవల్ల అతనికి దశవదను డనే పేరు పెట్టారు. కుంభకర్ణుని పేరు భానుకర్ణుడు. వీరందరూ యుద్ధంలో పట్టుబడి రావణ వధానంతరం తపస్వులవుతారు.

ఈ కావ్యంలో సేతుబంధన ప్రసక్తిలేదు. రామా దుల సేనలు నభోగమన విద్యతో లంకకు చేరుతాయి. రావణ వధానంతరం సీతకు అగ్నిపరీక్ష లేదు. అందరూ అయోధ్యకు వెళ్ళిన చాలకాలానికి సీతపై అపవాదు పుడుతుంది. రాముడు కృతాంతవక్త్రుడనే దూతతో సీతను అడవికి పంపుతాడు. ఆ అరణ్యంలో ఏనుగుల వేటకు వచ్చిన పుండరీకిణీ పురాధినాథుడు వజ్రజంఘ మహారాజు, సీతాదేవినుంచి ఆమె వృత్తాంతం విని తన నగరుకు పిలుచుకువెళ్లి శుశ్రూష చేస్తాడు. అక్కడ ఆమెకు లవ అంకుశులనే కుమారులు కలుగుతారు. లవుడు పెద్దవాడై వజ్రజంఘుని కుమార్తె శశిచూలను, మరి ముప్పైఇద్దరు కన్యలను, అంకుశుడు పృథువు పుత్రిక లను పెళ్ళాడుతారు. లవాంకుశులు నారదునివల్ల రామ లక్ష్మణుల వృత్తాంతం తెలిసి వారిపై దండెత్తివెళ్ళి వారిని ఓడిస్తారు. తర్వాత రాముడు వారు తన కుమా రులని తెలిసి ఆనందిస్తాడు. పిదప సీత పవిత్రత చాట డానికి అగ్నిపరీక్ష జరుగుతుంది. ఆమె సంసార విరక్త రాలై తపస్విని అవుతుంది.

కొంతకాలానికి రత్నచూల, అమృత చూలు లనేవారు లక్ష్మణునితో పరిహాసమాడుతూ రాముడు మరణించాడని తెలుపుతారు. ఆ వార్త నిజమని భ్రమ పడి లక్ష్మణుడు వెంటనే ప్రాణాలు వదలుతాడు. రాముడు ఈ అనాహూతం తెలుసుకుని, లక్ష్మణుని భౌతిక కాయాన్ని చందనాగరులతో అలది, ఆరునెలల పాటు తన ఒడిలోనే పెట్టుకొని ఉంటాడు. లక్ష్మ ణుని అంత్య సంస్కారంకోసం సుగ్రీవ విభీషణాదులు రాగా, వారిని రాముడు వారించి లక్ష్మణుని దేహాన్ని విడువక కౌగిలించుకుంటాడు.

ఈసమయం చూచి రావణపుత్రుడైన ఇందగి కుమారుడు (రావణపౌత్రుడు) మొదలయినవారు అయోధ్యను ముట్టడించారు. అప్పుడు రాముడు వజ్రా వర్తచాపం పట్టక వివేకవికలుడై ఉండగా, సద్గతిపొందిన కృతాంత వక్త్రుడు, జటాయువు వచ్చి, ఆ రావణ పౌత్రుని సైన్యం చెల్లాచెదరుచేసి, రామునికి ధర్మం ఉపదేశించి, అతని వికలతను పోగొడుతారు. అనంతరం రాముడు కేవలి (కేవలజ్ఞాని) అవుతాడు. రావణుని చంపిన జీవహింసఫలితంగా లక్ష్మణుడు నరకానికి వెళ్ళుతాడు.

ఈ విధంగా, కుతూహల జనకమైన మార్పులతో ఈ రామచంద్ర చరితపురాణం కావ్యదృష్టితో జైనే తరులకూ పఠనయోగ్యమైనది. అంతేకాక కావ్యమం తటా భాసించే కవిసహజ రసస్ఫూర్తితో అభినవ పంపనికృతి సహృదయహృదయంగమంగాను ప్రకా శిస్తున్నది.

# విడిపోతున్న రెండు సంస్కృతులు

శ్రీ సి. పి. స్నో

కొంతకాలంగా నా మనస్సులో ఒక సమస్య కదులుతూ ఉన్నదంటే అది కేవలం నా జీవితానికి సంబంధించిన పరిస్థితులవల్లనే. అసలీ వస్తువునుగురించి తర్కించగల హక్కు కూడా నాకు ఈ కారణాలవల్లనే ఏర్పడినది: ఇది కేవలం ఆకస్మికం. ఇదే అనుభూతిని పొందిన వారందరూ నేను చూసిన విషయాలనే చూసి ఉండేవారు; నేను ప్రస్తావించిన విషయాలనే ప్రస్తావించేవారు. అదృష్ట వశాత్తు ఈ అనుభూతి కొంచెం అసాధారణమైనది. నా విద్యాశిక్షణ భౌతికశాస్త్రాలకు సంబంధించిన శిక్షణ: కాని రచనవైపు మొగ్గి రచయిత నయ్యాను, అంతే. ఇటువంటి అదృష్టం నాకు, ఒక పేద కుటుంబంలో జన్మించడం చేత కల్గినదేమో.

కాని ఇక్కడ నా జీవిత చరిత్ర ముఖ్యంకాదు. నేను చెప్పదలసినదల్లా, కేంబ్రిడ్జికి వెళ్ళానని, అక్కడ ఒక మహత్తర శాస్త్రయుగంలో కొంచెం పరిశోధన చేసే అవకాశం నాకు లభించినదనీ. భౌతిక శాస్త్రచరిత్రలో ఒక అత్యద్భుతమైన ఘట్టాన్ని కళ్ళారా చూసే అదృష్టం నాకు కలిగింది. యుద్ధంవల్ల—డబ్ల్యు. ఎల్. బ్రాగ్‌ను కెట్టరింగ్ స్టేషన్ అల్పాహారశాలదగ్గిర, చలికాలంలో ఒకరోజు ప్రొద్దున్నే కలవడంచేత నా జీవితంలో కలిగినపరిణామాలవల్ల—ఈ అదృష్టం నన్ను వెంటాడుతూనే వచ్చింది. కేవలం నా అభిరుచి మాత్రమే కాక, పరిస్థితుల ప్రభావంకూడా నాకు శాస్త్రజ్ఞులతో మెలగే సదవకాశాన్ని లభింపచేసింది. నా రచనలకు ఆకారాలను ఇచ్చే ప్రయత్నంలో రచయితలలో కలిశాను.

ఈ రెండు తరగతులవారితో కలిసి మెలిసి తిరగడంచేత, ముందుకూ వెనుకకూ వీరిమధ్య తిరగడం చేత ఈ సమస్యలో చిక్కుకున్నాను; దీనినే "రెండు సంస్కృతుల" సమస్య అని పేరు పెట్టి పిలుస్తున్నాను, ఎందుకంటే నాకెప్పుడూ రెండు వేరు, వేరు తరగతుల వారితో కలిసి తిరుగుతున్నా ననిపించేది. తెలివిలో పోల్చదగి, జాతిలోను సామ్యం కలిగి, సాంఘికంగాను అంతగా వేరుగాక, ఇంచుమించు సమానమయిన ఆర్జన కలిగిఉన్నా, సమోధ్యలేనందున మానసిక, నైతిక బౌద్ధిక వాతావరణంలో మాత్రం విడిపోయిన వీరిని చూస్తే, బర్లింగ్‌టన్ హౌస్ నుంచి కాని, కెన్సింగ్‌టన్ నుంచి కాని చెల్సీవరకు కాకుండా మహాసముద్రాన్ని దాటవలసివస్తుందని నాకు అనిపిస్తుంది.

నిజానికి, ఒక మహాసముద్రం కన్నా పెద్దమార్గం ప్రయాణం చేయవలసివచ్చేది. అట్లాంటిక్ అవతల ఉన్న గ్రామంలో చెల్సీలో మాట్లాడే భాషనే మాట్లాడుతూ ఉంటారు: ఈ రెండు చోట్లనుంచి M. I. T. కి ఎవరైనా వెళితే ఎదో టిబెట్ భాష విన్నట్లనిపిస్తుంది. ఇది ప్రత్యేకం, మన సమస్య మాత్రమే కాదు; విద్యాశిక్షణకూ, సాంఘిక వ్యవస్థలకూ సంబంధించిన కొన్ని చాదస్తాలవల్ల ఇక్కడ కొంచెం తీవ్రంగాఉన్నది: కాని మొత్తానికి ఇది పాశ్చాత్యదేశాలన్నిటికీ సంబంధించిన సమస్య.

పాశ్చాత్యసంఘంలోని మానసిక జీవితం క్రమంగా చీలిపోయి రెండు ధ్రువాలుగా ఏర్పడుతున్నదని నా నమ్మకం. మానసిక జీవితమంటే, వ్యావహారిక జీవితమనికూడా నా ఉద్దేశ్యం: ఇవి రెండూ వేరువేరు కావని నా నమ్మకం. ఈ రెండు ధ్రువాలలో, ఒకవైపు సాహిత్యవేత్తలు (తక్కినవారు గమనించనప్పుడు వీరు తమనుతాము 'మేధావుల'ని పిలుచుకొనడం మొదలుపెట్టారు—వారు తప్ప మరెవరూ లేనట్లు). కేంబ్రిడ్జ్ గణితశాస్త్రజ్ఞుడు జి. హెచ్. హార్డీ నాతో ఒకసారి అన్నాడు, "ఈ మధ్య 'మేధావి' అనే మాట ఎలా వాడుతున్నారో గమనించావా? ఈ వాడుకవల్ల రూథర్‌ఫోర్డ్, ఎడ్డింగ్‌టన్, డిరాక్, ఎడ్రియన్‌లు ఎవరూ 'మేధావులు'గా పరిగణించబడటంలేదు. ఇది చిత్రంగానే ఉన్నది......"అని.

ఒక ధ్రువంవద్ద సాహిత్యవేత్తలు, మరొక ధ్రువంవద్ద శాస్త్రజ్ఞులు, ఈ శాస్త్రజ్ఞులకు ప్రతినిధు

లుగా భౌతికశాస్త్రజ్ఞులు. వీరిద్దరిమధ్యా పరస్పరం ఎరుక లేకపోవడంచేత ఏర్పడిన అగాధం—ఒకొకప్పుడు (చిన్నవారిలో ప్రత్యేకంగా) విరోధభావం, అసహ్యం. కాని వీటన్నిటికంటే సానుభూతి లేకపోవడం. వీటన్నిటివల్ల పరస్పరం అపోహాలతో మనసులో వికృతరూపాలు ఏర్పడ్డాయి.

వీరు ఒకరికొకరు ఎంతదూరమైపోయారంటే, భావనలోకూడా వీరిద్దరిమధ్యా సామాన్యమైనది ఏదీ లేదు. శాస్త్రజ్ఞులు దాంభికులనీ, ఉపేక్షకులనీ... తక్కినవారనుకుంటారు. ఈ విధంగా అనుకునేవారిలో టి. యస్. ఎలియట్‌ను ఉదాహరణగా తీసికోవచ్చు: పద్యనాటకలను మళ్ళీ పునరుద్ధరించడంకోసం తను చేసిన ప్రయత్నాలు అంతగా ఫలించకపోయినప్పటికీ మళ్ళీ ఇంకొక 'కిడ్'కు గాని, 'గ్రీన్'కు గాని భూమికలను తయారుచేయగలిగితే చాలునని ఆయన చెపూ ఉంటె పైన చెప్పినట్లు అనుకునేవారు వింటారు. ఈ విధంగా చెప్పే కంఠం వారికి సుపరిచితం. ఇదే వారి సంస్కృతికిచెందిన సంయమమైన కంఠం. దీనిని విస్మరించి వారు మరొక కంఠాన్ని వింటారు. ఈ కంఠమే ఎలుగెత్తి చాటుతున్న రూథర్‌ఫోర్డ్ కంఠం. "ఇదే శాస్త్రమహాయుగం! ఎలిజబెతియన్ యుగం!" అని ఈ కంఠం చాటుతుంది. ఇదికాక, ఇంతకంటె... అసంబద్ధమయిన సందేశాలను మనలో చాలామంది విన్నారు: షేక్‌స్పియర్ పాత్రకు ఎవరిని రూథర్‌ఫోర్డ్ నిర్ణయిస్తున్నాడో గ్రహించడం సులభం. ఇంతకీ సాహిత్యవేత్తలకు అర్థంకాని విషయమేమిటంటే, అతను భావనలో, బుద్ధిసూక్ష్మతలో పూర్తిగా సత్యాన్నే పలుకుతున్నాడని.

"This is the way the world ends, not with a bang but with a whimper." ఈ వాక్యంతో రూథర్‌ఫోర్డ్ విసిరిన ఛలోక్తిని పోల్చి చూడండి. "Lucky fellow, Rutherford, always on the crest of the wane" అని ఎవరో ఛలోక్తిగా అంటే, "Well I made the wane didn't I?" అని సమాధానమిచ్చాడు.

శాస్త్రజ్ఞులు లోతు లేని ఆశావాదులనీ, మానవ పరిస్థితులను గ్రహించలేని వారనీ ఇతరులు అనుకుంటారు. రచయితలూ, పండితులూ, ముందు చూపులేని వారనీ, తమతోటి మానవుల విషయంలో ఆసక్తి చూపని వారనీ, ప్రగాఢంగా పరిశీలిస్తే మేధావివర్గ విరోధులుగా తేలిపోతారనీ, భావనను, కళనూ కూడా క్షణికంగా నిర్బంధించాలని చూస్తారనీ శాస్త్రజ్ఞులు నమ్ముతారు. ఈ రెండింటిలోనూ కొంచెం నిజం లేకపోలేదు. కాని ఇటువంటి వ్యాఖ్య అపాయకరమైనది, విధ్వంసాత్మకమయినది. వీటిలో రెండింటిని గురించి చర్చిస్తాను.

మొదట, చర్చనీయాంశం శాస్త్రజ్ఞుల "ఆశావాదం." ఈ నేరారోపణ కేవలం ఒక లోకసామాన్య విషయమయిపోయింది. ఈ ఆరోపణ చేసినవారిలో అతి నిశితమైన బుద్ధిశక్తి కలవారు లేకపోలేదు; కాని ఇది వ్యక్తిగతానుభూతిని, సాంఘికానుభూతిని విడివిడిగా అర్థంచేసికొనలేక పోవడంవల్ల ఏర్పడిన ఊహ. నాకు తెలిసిన శాస్త్రజ్ఞులలో చాలామంది (తక్కినవారివలెనే) మనలో ఒక్కొక్కరి వ్యక్తిగతమైన పరిస్థితీ విషాదపూరితమైనదని ప్రగాఢంగా నమ్ముతారు. ప్రతి ఒక్కరూ ఏకాంతవాసంలో ఉండిపోయి, అప్పుడప్పుడూ కరుణ, కళాసృష్టి సహాయంతో ఈ ఏకాంత వాసంలోనుంచి బయటకు రాగలుగుతున్నాం. కాని జీవితంలో ఈ విజయాలు కేవలం శాంతిపల్వలములవంటివి: వాటి అవతల మళ్ళీ చీకటిగానే ఉంటుంది. మన మందరమూ ఈ ఏకాంతంలోనే చనిపోతాము. మతవిశ్వాసమున్న కొందరు శాస్త్రజ్ఞులను నే నెరుగుదును. బహుశ వారిలో ఈ విషాద భావంయొక్క చైతన్యం అంత ఎక్కువగా లేదేమో నాకు తెలియదు. గాఢానుభూతిని పొందగలిగిన వారిలో పలువురికి—వారెంత సంతోషంగా, ఉత్సాహంగా ఉన్నా సరే, నిరంతర సంతోషోత్సాహితులైనా సరే—ఒకొక్కప్పుడు జీవితపు బరువు వారి నరనరాలలోను ఒత్తిడి కలిగిస్తుందనిపిస్తుంది. ఈ అనుభూతి తక్కిన వారి విషయంలో ఎంత నిజమో శాస్త్రజ్ఞుల విషయంలోకూడా అంత నిజమే.

కాని ఇంచుమించు అందరూ—సరిగ్గా ఇక్కడ ఆశంసారేఖ నిజంగా భాసిస్తుంది. వ్యక్తిగతమైన పరిస్థితి విషాదపూరితమైనంత మాత్రాన సాంఘికమైన పరిస్థితికూడా ఆ విధంగానే ఎందుకు ఉండాలంటారు. మనలో ప్రతి ఒక్కరు ఏకాంతవాసులమే; ఏకాంతంగానే మరణిస్తాము. సరే అది మనం అతిక్రమించలేని విధి. కాని మనపరిస్థితిలో విధికి సంబంధించనిది చాలా ఉన్నది: దానిని ఎదుర్కొనలేక

పోతే మనం మానవ మాత్రులం కాదు. అంతకన్నా తక్కువవార మవుతాము.

ఉదాహరణకు—మనతోటి మానవులలో చాలా మంది తిండిలేక మరణిస్తున్నారు. స్థూలంగా చెప్పాలంటే, ఇదే సాంఘికమైన పరిస్థితి అంటే. మానవుని ఏకాంత స్వభావాన్ని తెలిసికోనడంలో ఒక అపాయం ఉన్నది. ఈ విషాదభావంలో నిమగ్నులయిపోయి తక్కినవారికి తిండిలేకపోయినా లెక్క చేయము.

శాస్త్రజ్ఞులు ఒక తరగతివారుగా ఈ అపాయానికి అంత గురికారు. వారు పరిష్కారానికి ఏదైనా వీలవుతుందేమోనని చూడటానికి తొందరపడ్తారు. లేదని రుజువయ్యేవరకూ వీలుందనే అనుకుంటారు. 'ఆశావాదమంటే' ఇదే. దానిని మనమందరం అలవరచుకోనవలసిన అవసరం చాలా ఉన్నది.

ఈ ఊహ తలక్రిందులుగా తయారయి, తమ సోదరులతో పోట్లాడాలనుకునే శాస్త్రజ్ఞులను రెండవ సంస్కృతియొక్క దృక్పథాలను అవజ్ఞతో చూసేట్లు చేసింది. ఇది చాలా సులభమయిన ఊహ. ఈ ఊహను ఉదాహరణగా తీసికోన నక్కరలేదు. ఒక శాస్త్రజ్ఞుడు నన్నిలా ప్రశ్నించడం నాకు బాగా జ్ఞాపకం.

"రచయితలలో చాలామంది ప్లాంటాగ్నెట్ కాలంలోకూడా అనాగరిక మనబడదగిన సిద్ధాంతాలనెందుకు ప్రతిపాదిస్తారు? 20 వ శతాబ్దంలోని రచయితలలో చాలామంది విషయంలో ఇది నిజం కాదా? యీట్స్, పౌండ్, విండాంలెవిస్ మన కాలంలో సాహిత్యాభిరుచులను ప్రతిపాదించిన పది మందిలో తొమ్మిదిమంది—రాజకీయంగా మూర్ఖులు కావడమే కాక, దుర్మార్గులుకూడా కారా? వారు నిరూపించే వాటి ప్రభావమే ఔష్విట్జ్‌ను దగ్గరగా తీసికోని రాలేదా?"

అసమర్థనీయులైనవానిని సమర్థించ కూడదని అప్పుడూ, ఇప్పుడూ కూడా నా అభిప్రాయం. యీట్స్ (నాకు నమ్మకమయిన స్నేహితుల ద్వారా తెలిసిన విషయం) వ్యక్తిగా మంచివాడవటమేకాక మహాకవికూడా, అన్నంతమాత్రాన చాలదు. ఈ విషయాలను కాదన్నమాత్రాన లాభంలేదు. అసలు సంగతేమిటంటే, 20 వ శతాబ్దంలో 'కళ'లోని కొన్ని పోకడలు అసాంఘికమైనవనే విషయాన్ని గుర్తించడంలో చాలామంది సాహిత్యవేత్తలు ఆలస్యంచేయడం శిక్షార్హమైన విషయం. మాలో చాలామంది సాహిత్యాన్ని వదలివేసి జీవితంలో మరొక 'దారి'ని చూసుకోనడానికి కారణాలలో ఇదొకటి.

అటువంటి రచయితలు సాహిత్యాభిరుచిని నిరంకుశంగా పరిపాలించినా ప్రస్తుతం అటువంటి పరిపాలన లేదు. శాస్త్రంకంటే సాహిత్యంలో మార్పు నెమ్మదిగా జరుగుతుంది. తనుతానే సరిదిద్దుకునే గుణం దానికిలేదు. అందుచేత, దారి తప్పడం చాలా సార్లు జరుగుతుంది. కాని 1914–50 సంవత్సరాలలో దొరికిన సాక్ష్యాన్నిబట్టి రచయితలను పరిశీలించడం కూడా శాస్త్రజ్ఞుల తప్పే.

నేను చెప్పిన అపోహలు ఇవే. ఈవిషయం తొమ్మిదితో ఎన్నోసార్లు చర్చించాను. వారు నాతో ఏకీభవించలేదు. ఇది అతి సుగమమైన పద్ధతి అని వారి అభిప్రాయం: ఈ పరిభాషలో మాట్లాడినట్లయితే మూడు సంస్కృతులను గుర్తించాలంటారు. వారు శాస్త్రజ్ఞులు కాకపోయినా, శాస్త్రీయమైన పద్ధతులలో ఆలోచించ గలిగినవారు కాబట్టి, ఇటీవల ఏర్పడి కేవలం సాహిత్యానికి సంబంధించిన సంస్కృతిపైన తమకు అభిమానం చాలా తక్కువ అనీ (ఈ విషయంలో పాండిత్యంకూడా ఎక్కువ కనుక తక్కువ ప్రయోజనం అని భావిస్తున్నారు కాబోలు) వాదిస్తారు. సాంఘికాభివృద్ధి వీలులేదనే వాతావరణంతో వారికి సంబంధంలేదని నొక్కి చెప్తారు.

ఈ వాదాలపైన నాకు గౌరవం లేకపోలేదు. 'రెండు' చాల అపాయకరమైన సంఖ్య. అందుచేతనే ద్వంద్వవాద పద్ధతి కూడా అపాయకరమైనది. రెండుగా దేనినైనా విభజించాలని చూసేవారిని జాగ్రత్తగా పరిశీలించాలి. కాని ఇంతకంటే సూక్ష్మీకరణ అనవసరం: ఇంకా దూరం వెడితే నిరుపయోగమైన ఫలితాలే లభిస్తాయి.

ఒక ధ్రువంవద్ద ఉన్నది శాస్త్రానికి సంబంధించిన సంస్కృతి—నిజమైన సంస్కృతి; మానసికంగానే కాక మానవజాతి శాస్త్రదృష్టిలో కూడా. ఈ సంస్కృతికి చెందినవారు ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసికోనక్కరలేదు. చేసికోనరు కూడా. జీవశాస్త్రజ్ఞులకు సమకాలిక మయిన భౌతిక శాస్త్రవిషయాలు బాగా తెలియక పోవచ్చు; కాని సామాన్యమయిన భావాలూ, ప్రమేయాలు ఉంటాయి. రాజకీయ మత వర్ణవిభేదాలను చీల్చుకొని వ్యాపించే దాని స్వభావం ఆశ్చర్యం కలిగిస్తుంది.

# విడిపోతున్న రెండు సంస్కృతులు

లెక్క వేసిచూస్తే మిగిలినవారిలోకంటే శాస్త్రజ్ఞులలో కొంచెం ఎక్కువమంది నాస్తికులు ఉంటారని తేలుతుందనుకుంటాను—తక్కిన 'మేధావుల'తో పోల్చిచూస్తే నన్నమాట. కాని ఆస్తికత కలవారూ ఉన్నారు (ఇప్పటి యువజనంలో ప్రత్యేకంగా). రాజకీయాలలో శాస్త్రజ్ఞులే ఎక్కువమంది 'వామ' పక్షాలకు చెందినవారని లెక్కలు చెప్తున్నాయి. 'కన్సర్వేటివ్'లుకూడా (మళ్ళా ఇక్కడకూడా యువజనంలో) లేకపోలేదు. లెక్క వేసిచూస్తే, ఈ దేశంలో, అమెరికాలో ఎక్కువ మంది శాస్త్రజ్ఞులు పేదకుటుంబాలనుంచే వచ్చారని తెలుస్తుంది. కాని మొత్తంమీద చూస్తే ఇది ముఖ్యంకాదు. వారు చెందిన కుల, మత, రాజకీయ వర్గాలకే చెందిన ఇతరులకంటే వారిలో వృత్తి, వైఖరులలో ఒక ఏకీభావం ఉంటుంది.

జె. జె. థామస్, లిండ్‌మాన్‌వంటి కన్సర్వేటివ్‌లలో ఇది ఎంత నిజమో, ఐన్‌స్టీన్. బ్లాకెట్‌ల వంటి 'రాడికల్'ల విషయంలోకూడా అంత నిజం; 'క్రైస్తవుడు' అనతగిన కాంప్టన్ విషయంలో ఎంత నిజమో 'భౌతికవాది'అయిన బెర్నాల్ విషయంలో కూడా; అదేవిధంగా బ్రోగ్లీ, రస్సెల్ వంటి ఐశ్వర్యవంతుల విషయంలోవలే ఫారడేవంటి బీద కుటుంబంలో జన్మించినవారివిషయంలో; ధనవంతుల కుటుంబాలలో జన్మించిన థామస్ మెర్టన్, విక్టర్ రోద్‌షీల్డ్‌వంటివారి విషయంలోవలెనే పనిమనిషి కొడుకైన రూథర్‌ఫోర్డ్ విషయంలో కూడా. వారందరూ ఆలోచన అనేదేమీ లేకుండా ఒకేవిధంగా ప్రవర్తించారు: సంస్కృతి అంటే ఇదే.

రెండవ ధ్రువంలోని వైఖరి ఇంకా విస్తారమైనది. భౌతికశాస్త్రజ్ఞులవద్దనుంచి సాహిత్యకారుల వరకూ, మధ్యలో ఎన్నోరకాల స్వరవిభేదాలు ఉండటం తెలుస్తూనేఉన్నది. కాని సంపూర్ణాజ్ఞానాన్ని సూచించే ధ్రువంయొక్క ప్రభావం రెండవదానిపైన ప్రసరిస్తుంది. ఈ సంపూర్ణాజ్ఞానం వల్ల, "సాంప్రదాయిక"మైన సంస్కృతికి ఒకవిధమైన అశాస్త్రీయమైన రుచిని ఆపాదిస్తుంది. మనం ఒప్పుకోనకపోయినా, ఈ రుచి శాస్త్రీయమైన పద్ధతికి విరోధిగా తయారవుతున్నది. ఒక ధ్రువంవైపున ఉన్న భావాలు మరొక ధ్రువంలోని విరుద్ధభావాలుగా ఉంటాయి. భవిష్యత్తు శాస్త్రజ్ఞుల రక్తనాళాలలో ఉన్నదనిపిస్తే, సాంప్రదాయికమైన సంస్కృతి ఈ భవిష్యత్తే ఉండకూడదని భావిస్తుంది. శాస్త్రీయమైన సంస్కృతి ఉద్భవించినా, ఇంకా పాశ్చాత్య నాగరికతపైన సాంప్రదాయికమైన సంస్కృతి ప్రభావమే ఉన్నదనవచ్చు.

ఈ ధ్రువీకరణ మనకందరకూ నష్టం చేకూరుస్తుంది. మానవులుగా, సంఘంగా మనకు, అంతేకాక మానసికంగానూ, వ్యావహారికంగానూ కాల్పనికంగానుకూడా నష్టం చేకూరుస్తోంది. ఈ మూడిటనీ విభజించాలనుకోవడం తప్పు.

ఈ పరస్పరాజ్ఞానం విరసంగా మారిన సరసం. దేశంలో ఏభై వేలమంది శాస్త్రజ్ఞులు పని చేస్తున్నారు. సుమారు ఎనభై వేలమంది ఇంజనీర్లు ఉద్యోగాలలో ఉన్నారు. యుద్ధకాలంనుంచి యుద్ధానంతరంవరకూ నేనూ, నా సహోధ్యాయులూ ముప్ఫై నలభై వేలమందిని పరీక్షించాము. అంటే సుమారు నూటికి ఇరవై అయిదు వంతులన్నమాట. ఉదాహరణకు ఈ సంఖ్య చాలు. మాతో మాట్లాడినవారందరూ నలభై సంవత్సరాల లోపువారే. వారంతా ఏ వేవి చదివేవారో, ఆలోచించేవారో మేము తెలుసుకోనగలిగాము. వారంటే ఇష్టం, గౌరవంఉన్న నాకే విస్మయం కలిగింది. సాంప్రదాయికమయిన సంస్కృతితో వారికున్న సాన్నిహిత్యం ఇంత పల్చనిదని మేము అనుకోనలేదు:

సాధారణంగా సాహిత్యకారులు మాట్లాడే విషయాలన్నిటినిగురించి చదివేశక్తి కొందరు శాస్త్రజ్ఞులకు ఉండేది. ఇప్పటికీ ఉన్నది. కాని ఇది అరుదు. గట్టిగా అడిగితే, "కొంచెం డికెన్స్ చదివిచూశాము అనుకోండి," అనేవారు—డికెన్స్ ఏదో అతికష్టమయిన రచయిత అయినట్లు, అతని పుస్తకాలను చదవటం నిష్ఫలమవుతుందన్నట్లు—రయినర్ మరియా రిల్కే లాగ. (వీరందరూ నిజంగా ఈ విధంగా ఆలోచిస్తారు. కష్టంమీదకాని అర్థంకాని సాహిత్యానికి డికెన్స్ చిహ్నమయిపోయినాడనే విషయం మాకు ఆశ్చర్యం కలిగించింది.)

వారి ఉద్దేశ్యంలో డికెన్స్ పుస్తకాలు చదవటం కేవలం, సాంప్రదాయికమయిన సంస్కృతికి 'సలాము' చేయుటమే! వారికి వారి స్వంతమయిన గాఢమూ, నియమబద్ధమూ, చైతన్య విలసితమూ అయిన సంస్కృతి ఉన్నది. ఈ సంస్కృతి సిద్ధాంతాలు సాహిత్యంలోని వాటికంటే ప్రత్యయంగా, నియమ

బద్ధంగా, ఉన్నతస్థాయిలో ఉంటాయి. శాస్త్రజ్ఞులు కొన్ని మాటలను చిత్రంగా వాడుతూ ఉంటారు: ఈ వాడుకలను సాహిత్యంలో ప్రవేశం కలవారు ఒప్పుకొనకపోయినప్పటికీ శాస్త్రజ్ఞులకు మాత్రం వారు ఏమి మాట్లాడుతున్నారో స్పష్టంగా తెలుసు.

వీరు బాగా తెలివయిన వారని మరచి పోకూడదు. వీరి సంస్కృతిలో, సంగీతం మినహాయిస్తే, కళకు పెద్ద స్థానం లేదు. వాదన, గ్రామఫోన్ రికార్డులు, కలర్ ఫోటోగ్రఫీ—అంటే ఎక్కువగా శ్రోత్ర సంబంధమయిన విషయాలు; చక్షుస్సంబంధమైనవి తక్కువ. పుస్తకాల సంగతి వేరే చెప్పనక్కర లేదు, అయినా "పుస్తకాలా? నా పుస్తకాలను నేను యంత్ర పరికరాలలాగ వాడుతుంటాను." అన్న మహానుభావుడంత అన్యాయం కాదనుకోండి. పుస్తకం ఎటువంటి పరికరం? సుత్తి క్రింద ఉపయోగపడుతుందా? అనాదికాలంలో ప్రజలు త్రవ్వటానికి ఉపయోగించే సాధనం వంటిదా?

జీవితంలోని నైతిక, మానసిక విషయాలపైన వారికి ఆసక్తిలేదని కాదు. సాంఘికజీవితంలో మనలో చాలామందికంటే వారికి ఆసక్తి ఉన్నది. నైతికంగా చూస్తే మేధావులందరిలోనూ వారే ఎక్కువ సంయమనం కలవారు. (అసలు శాస్త్రీయమైన పద్ధతిలోనే నీతి ఉన్నది.) సాంప్రదాయికమైన సాహిత్యంలో వారి శ్రద్ధాసక్తులకు సంగతమైన వస్తువు చాలా తక్కువని వారి భావం. వారు పూర్తిగా పొరబడుతున్నారు. అందుచేతనే వారి భావనాశక్తి ఉండవలసినట్లుగా లేదు. వారిచేతులతో వారే దారిద్ర్యాన్ని తెచ్చిపెట్టుకుంటున్నారు.

ఇక మిగిలినవారి సంగతి? వారూ దరిద్రులుగానే ఉన్నారు—ఈ విషయంలో వారికి అహంకారం ఎక్కువ గనుక. వారు ఇంకా అపాయకరమైన స్థితిలో ఉన్నారు. వారి సంస్కృతికి పైన సంస్కృతి లేదన్నట్లు, భౌతిక క్రమం లేదన్నట్లూ నడుస్తారు. ఈ భౌతికక్రమానికి విలువ లేదని భావిస్తారు. నిష్ఫలమైనదనుకుంటారు. ఈ భౌతిక ప్రపంచంయొక్క నిర్మాణంకన్నా, సుందరమైనదీ, వివేకదృష్టిలో లోతుకలదీ, వ్యక్తమైనదీ మానవుని ఊహలో వేరే లేదని వారు గ్రహించలేక పోతున్నారు. అసలు శాస్త్రజ్ఞులు కానివారికి ఇటువంటి భావన లేనేలేదు. వారికి కావాలన్నా రాదు. బుద్ధికి సంబంధించిన ఒక మాహోవధిలో ఒక వర్గమంతటికీ చెవుడు వచ్చినదేమోననిపిస్తుంది. కాని ఈ చెవుడు స్వాభావికమైనది కాదు. కేవలం, సరియైన శిక్షణ లేకపోవడంవల్ల కలిగే చెవుడు.

చెవిటివారిలాగే, వారికి అందని విషయాలెన్ని ఉన్నాయో వారికి తెలియదు. ఎవరో ఒక శాస్త్రజ్ఞుడు సాహిత్యంలో ముఖ్యమైన గ్రంథాలు చదవలేదని విని నవ్వుకుంటారు. జ్ఞానంలేని విశేషజ్ఞులనుకుంటారు. కాని వారి అజ్ఞానం, వారి ప్రత్యేక జ్ఞానం అలా వెరగుపాటు కలిగించేది. మంచి విద్యాశిక్షణ పొందినవారనబడే కొందరు శాస్త్రజ్ఞుల అజ్ఞానాన్ని గురించి నవ్వుకుంటున్న కొందరిని, "Second law of Thermodynamics" గురించి ప్రశ్నించాను. సరియైన సమాధానం లేకపోవడమేకాక శూన్యమయిన ప్రతివచనంకూడా లభించినది. కాని నా ప్రశ్న, ఒక శాస్త్రజ్ఞుని, "షేక్‌స్పియర్ చదివావా?" అన్నదాని వంటి ప్రశ్న.

ఇంకా సులభమయిన ప్రశ్నలు, 'ఘన' మంటే ఏమిటి? 'తీవ్రత' ('ఏక్సిలరేషన్') అంటే ఏమిటి?" అనేవి వేస్తే (శాస్త్రదృష్టిలో "మీకు చదవడం వచ్చునా?" అనే ప్రశ్నతో ఇది సమానం) పదిమందిలో ఒకరుకూడా సరియైన సమాధానం చెప్పలేకపోయారు. మేము అసలు వేరు, వేరు భాషలు మాట్లాడుతున్నామా అని నాకు ఇప్పుడు అనిపిస్తూ ఉన్నది. నవీనభౌతికశాస్త్రసౌధం పైకి ఎగసిపోతూనే ఉన్నది—తెలివిగలవారిలో అధికసంఖ్యాకులుమాత్రం వారి రాతియుగపు పూర్వులెంత జ్ఞానం చూపేవారో అంత అజ్ఞానంతో దీనిని చూసి ఊరుకుంటున్నారు.

సుమారు రెండు సంవత్సరాలకు పూర్వం కొలంబియాలో యాంగ్, లీ అనే వారిద్దరు ఆశ్చర్యావహమయిన పరిశోధనను చేశారు. శాస్త్రచరిత్రలోనే ఇది ఒక అద్భుతమయిన ఘట్టం. పరిశోధనగా కూడా ఇది అపూర్వమయినదే. కాని ఫలితంవల్ల మనకు కలిగే ఆశ్చర్యం, ఈ విషయాన్ని మనల్ని మరిపింపజేస్తుంది. భౌతికప్రపంచంయొక్క పునాదులనుగురించి ఆలోచించేట్లు చేస్తుంది ఈ పరిశోధన. "అంతరవబోధం", "లోకజ్ఞానం" తలక్రిందులయ్యాయి. ఈ పరిశోధన ఫలితాన్ని "Contradiction of Parity" (సాదృశ్య వైరుధ్యం) అంటారు. నేను చెబుతున్న రెండు సంస్కృతులమధ్య సంబంధం కనుక ఉంటే ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జిలలో ప్రతివేదిక ("High table")

వద్ద జరిగే సంభాషణలకు ఈ పరిశోధన వస్తువుగా ఉండదగినది. కాని ఉన్నదా? నేను అక్కడలేను కాబట్టి ఈ ప్రశ్న అడగవలసివస్తున్నది అంతే.

ఈ రెండు సంస్కృతులూ కలిసే స్థానం లేదని పిస్తుంది. ఇది విచారకరమైన విషయం అని వృథాగా చెప్పి, చెప్పి ప్రయోజనం లేదు: త్వరలో కొన్ని ప్రయోజనాత్మకమయిన పరిణామాలను ప్రస్తావిస్తాను. 20 వ శతాబ్దపుశాస్త్రం, 20 వ శతాబ్దపుకళపైన ఎంత తక్కువ ప్రభావం కలిగిఉన్నదో ఆలోచించి చూస్తే ఆశ్చర్యం కలిగిస్తుంది. అప్పుడప్పుడు కవులు శాస్త్రపరి భాషను నియమబద్ధంగా వాడుతూ ఉంటా రు— తప్పుతప్పులుగా కూడా. "Refraction" (వక్రీకరణం) అనే పదం పద్యాలలో అప్పుడప్పుడు తగులుతూ ఉండేది. "Polarised light" అనే మాటల వాడుక, ఇదేదో మంచి రకమయిన "light" అనే భావం ఉందనిపించేది. ఈ విధంగా భౌతికశాస్త్రం కళకు ఉపయోగపడుతుం దనుకోనక్కరలేదు: మన (సం)పూర్ణ మానసికానుభూతిలో ఇంకిపోయినప్పుడే, సహజమయిన వాడుకలు ఏర్పడుతాయి.

ఈ సంస్కృతి విభేదం పాశ్చాత్య ప్రపంచ మంతటా ఉన్నా, ప్రత్యేకం ఇంగ్లాండులో తీవ్రంగా ఉన్నది. దానికి రెండు కారణా లున్నవి. ఒకటి, మన దేశంలో విశేషజ్ఞానసంపాదనలో మూఢనమ్మకం. మరొకటి మన సాంఘికవ్యవస్థల ఘనీభావం. ఆర్థికమయిన విభేదాలు తగ్గినకొద్దీ ఈ ప్రవృత్తి ఇంకా స్థిరపడిపోతున్నదనిపిస్తుంది: విద్యలో ఇది ఇంకా నిజం. అంటే, సాంస్కృతికంగా (ఒక) చీలిక ఏర్పడినప్పుడు, సాంఘిక శక్తులు దీనిని స్థిరపరుస్తాయి కాని తగ్గించవని అర్థం.

ఈ రెండు సంస్కృతులు, అరవై ఏళ్ళక్రిందనే ఒకదానికొకటి దూరమయిపోయినవి. కాని, శాలిస్‌బరీ వంటివాడు "హాట్ ఫీల్డ్"లో తన స్వంత "లేబొరేటరీ" నడిపేవాడు. బాల్‌ఫోర్‌కు భౌతికశాస్త్రాలపైన ప్రత్యేకాభిమానం ఉండేది. సివిల్ సర్వీస్‌లో చేరక ముందు ఆండర్‌సన్ ఉర్‌ట్జ్‌బుర్గ్‌లో రసాయనశాస్త్రానికి సంబంధించిన పరిశోధన చేశారు. ఇప్పటి ఉన్నతాధికారుల్లో ఈ కలయిక అసంభవం.

నిజానికి, ఇప్పటి యువజనంలో ఉండే శాస్త్రజ్ఞులు తదితరులు అనే విభాగాన్ని పోగొట్టడం చాలా కష్టం. ముప్పైసంవత్సరాలక్రితం ఈ రెండు సంస్కృతులూ, ఒకదానితో ఒకటి మాట్లాడటం మానివేసినా, కనీసం ఎదురైనప్పుడు చిరునవ్వుతోనైనా అభినందించుకొనేవి. ఒక వైపు శాస్త్రజ్ఞులలో యువకులైనవారు తమ సంస్కృతి పురోగమిస్తున్నదని, ఇంకొక వైపు రెండవ సంస్కృతికి చెందినవారు తమలో తిరోగమన భావాన్ని గుర్తించ గలుగుతున్నారు. ఇంతేకాక, చిన్న, రెండవరకపు సైన్సు డిగ్రీ ఉన్నవారు కూడా ఉత్తమశ్రేణిలో వచ్చిన ఇంగ్లీషు, హిస్టరీ డిగ్రీలు కలవారికంటే మంచి ఉద్యోగాలను సులభంగా తెచ్చుకొనగలుగుతున్నారు. వారికంటే రెండురెట్లు విలువ సంపాదిస్తున్నారు. 'లక్కీ జిమ్' లోని నాయకునిలాగ తమ పరిశ్రమ వృథా అనిగాని, హాస్యాస్పదమయినదనిగాని ఏ శాస్త్రజ్ఞుడూ అనుకోనక్కరలేదు. నిజం చెప్పాలంటే, కింగ్‌స్లీఅమిస్ (Kingsley Amis) సహాధ్యాయుల నిరాశ ఆర్ట్స్ గ్రాడ్యుయేట్ల నిరుద్యోగ సమస్యకు సంబంధించినదే.

వీటన్నిటికీ ఒకటే మార్గం: మన విద్యాశిక్షణ పద్ధతిని మార్చాలి. పైన చెప్పిన కారణాలవల్ల, ఈ దేశంలో తక్కిన దేశాలలోకంటే మార్పు తీసికొని రావడం కష్టం. మన పాఠశాలలలో ప్రతివిషయంలోనూ కేవలం విస్పష్టతకే ప్రాధాన్యం ఇవ్వబడుతున్నదని అందరూ ఒప్పుకుంటారు. కాని ప్రతి ఒక్కరూ మన మేమీ చేయగలిగినది లేదని ఊరుకుంటారు. తక్కిన దేశాలలో ఇదే అసంతృప్తి ఉన్నా వారు చేతులు కట్టుకుని కూర్చోవడం లేదు.

మన దేశంలోని శిక్షణంత క్షుణ్ణమైనది కాకపోయినా అమెరికాలో ఇక్కడకంటే ఎక్కువమంది పిల్లలు మన విద్యార్థులకంటె విశాలమయిన శిక్షణ పొందుతున్నారు. పదిసంవత్సరాలలో ఈ సమస్యను పరిష్కరిద్దామని అక్కడివారి ఆశయం. రష్యాలో కూడా మన దేశంలో కంటే ఎక్కువమందికి విద్య లభిస్తున్నది. (వారి పాఠశాలలోని ప్రణాళికలు మరీ విశేషజ్ఞాన ప్రాముఖ్యం కలిగి ఉంటాయనుకోవడం తప్పు.) ఇది వారికే తెలుసు. స్కాండినేవియన్లు (ప్రత్యేకంగా స్వీడన్‌వారు) మనల్ని విద్యలో అతిక్రమించాలని చూస్తున్నారు. విదేశభాషాభ్యాసంవల్ల అక్కడి విద్యార్థులు కొంచం ఎక్కువగా కష్టపడవలసివస్తుంది. కాని సమస్య ఎటువంటిదో మాత్రం గుర్తించారు.

ఇక మనం? సహింపలేనంతగా శిథిలమైపోయామా?

పాఠశాలలోని ఉపాధ్యాయులతో మాట్లాడి చూడండి. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ స్కాలర్‌షిప్‌లు తెచ్చిపెట్టిన పరిస్థితే, ఇది, అంటారు. ఇది గనుక నిజమయితే ఈ పరిస్థితిని మార్చివేయడం చాలా సులభం

కదా అనిపిస్తుంది. కాని మన దేశంలో ఇటువంటి మార్పులను ఎదుర్కొనే శక్తి ఎంత ఉందో సాధారణంగా తెలిసికొనలేక పోతున్నాము.

ఎలాగో మనమొక కార్యాన్ని అవలంబించాము. మరే దేశంలోనూ ఇటువంటి పరిస్థితి లేదు. కేవలం ఒక శాస్త్రంలో విశేషజ్ఞానం సంపాదించడం లక్ష్యంగా పెట్టుకున్నాము. కేంబ్రిడ్జిలో నూటఏభై సంవత్సరాలుగా గణితశాస్త్రంలో, తరువాత పురాణగ్రంథాలలో కాని లేక గణితంలో కాని విశేషజ్ఞానంకోసం ప్రయత్నించారు. చిట్టచివరకు భౌతికశాస్త్రం వచ్చింది. కాని వీటిలో కూడా ఏదో ఒకదానినే ఏరుకోవలసి ఉండేది.

ఈ పద్ధతి పరిణామక్రమానికి ఇక తిరుగులేదేమో. ఒకవేళ లేకపోతే మన సంస్కృతి నిర్జీవమయిపోయే అవకాశం ఉన్నది. మన జీవితంలో కూడా దీనివల్ల కొన్ని అపాయకరమైన ఫలితాలు ఉండవచ్చు.

అసలు "రెండు సంస్కృతులు" మనడానికి చాలా కారణాలున్నవి...అందులో కొన్ని గాఢమైనవి. మరికొన్ని సంకీర్ణమైనవి. ఇంకా కొన్ని వ్యక్తిగత చరిత్రలకూ, వివిధములైన మానసిక వ్యాపారాలకూ సంబంధించినవి. కాని నేను కారణాలను సూచించాలనుకోవడం లేదు. పరస్పర సంబంధాలను తెలుపాలని నా ఉద్దేశ్యం. శాస్త్రీయమైన సంస్కృతితో సంబంధం ఉన్నవారు తప్ప, తక్కినవారెవరూ పారిశ్రామిక విప్లవాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నం చేయడం లేదు. అర్థంచేసికొనే సామర్థ్యం వారికి లేదు. మేధావులు అందులో సాహిత్యకారులు సహజమయిన మొదటికే మోసంతెచ్చే విధ్వంసకులు (Luddits).

తక్కిన దేశాలలోకంటే ముందు ఇక్కడ పారిశ్రామిక విప్లవం జరిగిందికనుక ఇటువంటి పరిస్థితి ఏర్పడిందికాని, ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే అమెరికాలో కూడా పరిస్థితి ఇక్కడిలాగే ఉండడం.

రెండు దేశాలలోనూ, పారిశ్రామిక విప్లవం క్రమంగా ముందంజ వేయడం ఎవరూ గమనించలేదు. వ్యవసాయం తర్వాత మానవ సంఘాన్ని ఇంతగా ఏదీ మార్చలేదు. ఈ రెండు విప్లవాలూ (వ్యవసాయ, పారిశ్రామిక విప్లవాలు) సామాజికజీవితంలో మానవుడు కని విని యెరుగనంత గొప్పమార్పులను తీసికొనివచ్చినవి. ఈవిషయాన్ని సాంప్రదాయికమైన సంస్కృతి గమనించలేదు. గమనించినా ఇష్టపడలేదు. ఈ విప్లవాలవల్ల కలిగిన ఫలాలను ఈ సంస్కృతి అనుభవించలేదని కాదు—19 వ శతాబ్దపు ఇంగ్లాండ్ సంపత్తిలో ఒక భాగం విద్యాసంస్థలు పంచుకొన్నాయి. ఇంతకూ విశేషమేమిటంటే, ఈ సంస్థలు మనకిప్పుడు తెలిసిన ఆకారంలోనికి ఘనీభవించడానికి కారణం ఈ సంపత్తిలో భాగం తీసికొనడంచేతనే.

విప్లవానికి, అప్పటి ప్రతిభలో కల్పనాశక్తిలో కొంచెంకూడా తోడుపడలేదు. సంపన్నమైనకొద్దీ సాంప్రదాయికమయిన సంస్కృతి విప్లవానికి దూరమయిపోయింది. భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్యాన్ని నిలబెట్టేందుకు కావలసిన శిక్షణలో అప్పటి యువకులు నిమగ్నులైపోయారు ఈ విప్లవాన్ని అర్థంచేసికొనడానికి కావలసినశిక్షణ వారు పొందలేదు. దూరపు చూపు కలవారు కొందరు మాత్రం ప్రతిభావంతులు కొందరికి శాస్త్రశిక్షణ ఇప్పిస్తేగాని దేశం అభివృద్ధిచెందదని గ్రహించారు. వారిమాట ఎవరూ వినలేదు. సాంప్రదాయికమయిన సంస్కృతి అసలుమాట, వినిపించుకొననే లేదు. 'కేవల శాస్త్రజ్ఞులు' (Pure scientists) పట్టించుకొనలేదు. (ఈ విషయాన్ని, దీనికి సంబంధించిన సిద్ధాంతాలనూ 'Technology and the Acadamics' అనే గ్రంథంలో ఎరిక్ యాష్‌బే చర్చించారు.)

విద్యాసంస్థలవారు పారిశ్రామిక విప్లవం జోలికి వెళ్ళేవారు కాదు. జీసస్ కాలేజీ ఉపాధ్యాయుడు కార్లీ, ఆదివారంనాడు కేంబ్రిడ్జికి రైలుబండ్లు రావడం నాకూ, భగవంతుడికీ కూడా నచ్చలేద"ని అన్నాడు. తర్కించదగ్గ విషయమేమైనా ఉంటే దానిని కార్మికులకూ, ఛాందసులకూ వదిలి వేసేవారు. అమెరికన్ సాంఘిక చరిత్రకారులు, వారిదేశంలో కూడా ఇదే జరిగినదని నాతో చెప్పారు. న్యూ ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవము మనదేశంలోకంటే ఏభై సంవత్సరాల తర్వాత బయలుదేరినా అక్కడ విద్యావంతులెవ్వరూ దానికి సహాయపడలేదు. కార్మికులకు వదిలివేశారు—అప్పుడప్పుడు హెన్రీఫోర్డ్ వంటి మహామేధావులు దొరికేవారు.

చిత్రమేమిటంటే జర్మనీలో (1880-40 లలో, పరిశ్రమలు ఇంత అభివృద్ధి చెందకమునుపు) విశ్వవిద్యాలయాలలో ఉత్కృష్టమయిన శాస్త్రబోధన లభించేది. ఇటువంటి శిక్షణ ఇంగ్లాండ్, అమెరికాలలో దొరికేదికాదు. ఇదేమిటో నాకు అర్థం కావటంలేదు. కాని నిజమయిన విషయం. ఈ పరిస్థితి ఫలితంగా లుడ్విగ్‌మాండ్ (ఒక చిన్న ఉద్యోగి కొడుకు) హైడల్‌బర్గ్ వెళ్ళి వినియుక్త రసాయనశాస్త్రంలో క్షుణ్ణమయిన శిక్షణ పొందాడు. సీమెన్స్ సైన్యం

లోనూ, విశ్వవిద్యాలయంలోనూ కూడా ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ చదువుకున్నాడు. వారు ఇంగ్లాండ్‌కు వచ్చి విద్యాగంధం లేని వలసరాజ్యంలోలాగా ఐశ్వర్యవంతులయ్యారు. ఇదేవిధంగా అమెరికాలో జర్మన్ టెక్నాలజిష్టులు పైకివచ్చారు.

ఇంచుమించు ప్రతిచోటా మేధావు లెవ్వరూ ఏమి జరుగుతున్నదో తెలుసుకోనలేకపోతున్నారు. రచయితలు అసలు తెలిసికోనలేకపోతున్నారు. కొందరు భయపడిపోయారు. మరికొందరు, రస్కిన్, ఎమర్సన్, మారిస్, థోరోవంటివారు తప్పించుకొని పోవడమే మంచిదనుకున్నారు. వీరివి కేవలం భయాక్రందనలు తప్ప మరేమీ కావు. ఒక వైపు అసహ్యమయిన సందులూ, పొగగొట్టాలు, వీటిని చూసినా; మరొక వైపు బీదవారికి కలిగే అవకాశాలు, అప్పటివరకూ నూటికి తొంభై తొమ్మిది మందికి కూడా దొరకని అవకాశాలు దొరకడం — వీటిని గ్రహించగలిగిన రచయిత ఎవ్వరూ లేకపోయాడు. రష్యన్ రచయితలు కొందరికి ఈ గ్రహణశక్తి ఉన్నదేమో కాని వారి వాతావరణానికి ముందరివారు. దీనిని గ్రహించగలిగిన రచయిత ఇబ్సెన్ ఒక్కడేమో ననిపిస్తుంది. ఆ మాటకు వస్తే ఇతనికి తెలియని విషయాలు ఎన్నో లేవు.

ఒకటిమాత్రం నిజం: దారిద్ర్యాన్ని నిర్మూలించాలంటే పరిశ్రమలను ఆశ్రయించవలసినవారే. "ఆశ్రయం" అనేమాట ఇక్కడ స్థూలంగా వాడుతున్నాను. ఈ విధమైన వాదుకను గ్రహించలేని వారంటే నాకు గౌరవంలేదు. కాలుమీద కాలువేసి కూర్చుని, దైనందినావసరాలు నీచమనే వాదం మనకు అనవసరం. ఒక వ్యక్తి తన కక్కరలేవని వాటిని వదలివేయవచ్చు — కావాలంటే అభినవ 'వాల్డెన్' తయారు చేసుకుంటే. మీకు ఆహారం అవసరమయితే మీ పిల్లలు తిండలేక మాడటం చూడండి. విద్యాభ్యాసంవల్ల కలిగే లాభాలను దూషించండి. మీ జీవితంలో ఇరవై సంవత్సరాలను పోగొట్టుకోనండి. మీ సౌందర్య కాంక్షను నేను గౌరవిస్తాను. కాని అందరినీ ఈ విధమైన కష్టాలకు గురిచేస్తానంటే ఒప్పుకోను. అందులో ఈ విషయానికి సంబంధించినవరకూ ఎవరేది కోరుకుంటారో అనుమానంలేదు. ప్రతిదేశంలోనూ పేదవారందరూ వీలైనంతవరకూ తమ భూములను వదలి కర్మాగారాలను వెతుకుచి వెళ్ళిపోయారు.

మా తాతగారితో నేను చిన్నప్పుడు మాట్లాడినది నాకు బాగా జ్ఞాపకం. ఆయన తెలివైనవాడు, నిజాయతీ కలవాడు. ఏడవఏట స్కూలు వదలి స్వంతంగా విద్యాభ్యాసం చేశాడు. పైకివచ్చే అవకాశమాత్రం లేకపోయింది. (కావలిసినంత సామర్థ్యం, లౌక్యం ఆయనకు లేవేమోనని ఇప్పుడు నాకు అనిపిస్తున్నది.) ఒక ట్రామ్ కంపెనీలో ఫోర్‌మెన్ ఉద్యోగాన్ని మించలేదు. మాకు ఆయన జీవితం నిష్ఫలమూ, నిష్ప్రయోజకమూ అనిపిస్తుంది. కాని ఆయన ఆ విధంగా భావించలేదు. తెలివైనవాడు కనుక తను సరిగ్గా వినియోగింపబడలేదని తెలుసుకున్నాడు. కొంచెం విచారించినా ఏదోవిధంగా సమాధానపరచుకొని తృప్తిపడ్డాడు. ఆయన తాత ఒక కర్షకుడయి ఉండాలి. ఆయన పేరు కూడా నాకు తెలియదు. చరిత్రయొక్క కూపంలోపడి మునిగిపోయిన 'అనామకుల'లో ఒకడు. ఆయన మంచి సామర్థ్యం కలవాడని మా తాత అనుకుంటూఉండేవాడు. సంఘం ఆయనకు చేసిన అన్యాయాన్ని క్షమించలేకపోయేవాడు. అటువంటివాని స్థితిని గురించి కలలు కనలేకపోయేవాడు. 18వ శతాబ్దంలో కర్షకుడుగా ఉండడం తమాషా కాదు — ఈ కాలం జేన్ ఆస్టిన్, జ్ఞానోదయాలకాలంగా మనం చిత్రించుకుంటాం.

పారిశ్రామిక విప్లవం ఏవిధంగా చూస్తే ఆవిధంగా కనుపించేది — అంటే పైనుంచి చూస్తే ఒక విధంగానూ, క్రిందినుంచి చూస్తే మరొకవిధంగానూ ఉంటుంది. ఈ రోజు చెల్సీనుంచి చూస్తే ఒక విధంగా కనిపిసుంది. ఆసియాలో ఒక గ్రామం నుంచి చూస్తే మరొకవిధంగా కనిపిస్తుంది. మా తాత వంటివారికి విప్లవం ఒక విముక్తి అని తోచేది.

నాగరికమయిన దృష్టిలో ఇది ఇంకా సమస్యగానే ఉన్నది. ముందువచ్చిన దేశాలలో ఈ విప్లవం ఫలితాలు స్థూలంగా అర్థం చేసికొంటున్నాము. శాస్త్రంవల్ల కలిగిన అభివృద్ధులవల్ల జనాభాసంఖ్య పెరిగింది. తిండికి కావలసినంత దొరుకుతున్నది. ప్రతివారికీ చదవడం వ్రాయడం తెలుసు. ఆరోగ్యం, తిండి, విద్య, ఇవన్నీ విప్లవంవల్ల నేకదా పేదవారికి లభ్యమవుతున్నాయి. ఇవన్నీ ముఖ్యమయిన లాభాలు - నష్టాలు కూడా లేకపోలేదు. పరిశ్రమకు తోడ్పడేశక్తులు యుద్ధసన్నాహాలకు కూడా తోడ్పడగలవు. కాని లాభాలు మిగిలాయి. అవే మన ఆశాతులు.

కాని ఇదంతా ఎలా జరిగిందో మనకు అర్థం అవుతున్నదా? పాత పారిశ్రామిక విప్లవాన్ని అర్థం చేసుకుంటున్నామా? ప్రస్తుతం జరుగుతున్న శాస్త్ర సంబంధమయిన విప్లవాన్ని అర్థం చేసికొనగలుగుతున్నామా?

('ఎన్‌కౌంటర్'నుంచి)

# లక్షణసార సంగ్రహము

శ్రీ రావూరి దొరస్వామి శర్మ

భారతి 1959 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటితమైన మిత్రులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి లక్షణసారసంగ్రహమును వ్యాసమును జదివితి. అందు బరామర్శింపబడిన విషయములగూర్చి నాకు గొన్ని యభిప్రాయములు దోచినవి. వానిని విద్వల్లోకమున కెఱుక పఱుచు నుద్దేశముతో నీ వ్యాసము వ్రాయుచున్నాను.

చిత్రకవి పెద్దనకృత లక్షణసారసంగ్రహమునకు బ్రతియొక్కటే యాంధ్రసాహిత్యపరిషత్తువారికి లభించినది; ప్రత్యంతరము గానరాదు. కాని కీర్తిశేషులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి కుమారసంభవ క్రీడాభిరామ పీఠికలలోని వ్రాతలంబట్టి, లక్షణసార సంగ్రహములో గవికృత లక్ష్య లక్షణములే కాక యప్పకవీయాదులందువలె నితరగ్రంథోదాహృతులు చూపబడిన ట్లూహింపనగుచున్నది. ఇప్పుడు ముద్రితమైన గ్రంథములో నితరగ్రంథోదాహృతులు లేవు. ఇది మూడాశ్వాసముల గ్రంథము. మానవల్లి కవిగారి వ్రాతలంబట్టి పెద్దనకవిగ్రంథ మనమును ఆఱాశ్వాసముల గ్రంథమై యుండినట్లు తెలియుచున్నదని శ్రీ బులుసువారు వ్రాసిరి. కాని కవిగారి వ్రాతలంబట్టి యట్టి యర్థము దోపదు. "పెద్దన లక్షణసారసంగ్రహములో 6 వ ఆశ్వాసమునుండియు, రత్నాకరకర్త 8 వ యాశ్వాసమునుండియు బద్యము లుదాహరించియున్నారు. ఇందఱు చూచినకృతి నేటికెట్లు క్రొత్తదగును?" (కుమారసంభవ పీఠిక-పుట 4) ఇందలి సందర్భమును బరిశీలించినచో 'కుమారసంభవ షష్ఠాశ్వాసము నుండి పద్యము పెద్దన లక్షణమున నుదాహృతము' అని యర్థమగును గాన బెద్దన గ్రంథ మాఱాశ్వాసములు గలదనుట పొసగదు.

మానవల్లివారు చెప్పిన గ్రంథ మెచ్చటనున్నట్లు నేటిదాక దెలియరాలేదు. ఒక వేళ కవి దొల్త నేనున్న రూపముతో స్వకీయ లక్షణ లక్ష్యములతోనే గ్రంథమును రచించి తర్వాత గొంతకాలానకు నితర గ్రంథోదాహృతుల జేర్చి మరొక ప్రతి వ్రాసియుంచెనేమో? అప్పట్టున రెండు తెఱగుల ప్రతులుంట కవకాశము గలదు గదా? సందేహాస్పదమైన యూహాకల్పనలతోడి యీ ప్రసంగమింక జాలింతము.

ఆంధ్రలక్షణగ్రంథములు సంస్కృత లక్షణ గ్రంథములకంటె విలక్షణముగా నుంటకు గారణము లేకపోలేదు. ఛందోగ్రంథములందు వ్యాకరణము, వ్యాకరణగ్రంథములందు ఛందము చెప్పబడును. గణయతి ప్రాసనిబద్ధమై మార్చుటకు వీలుపడని శబ్దరూపములనే ప్రమాణముగా గొని తెనుగువ్యాకరణము నిర్మింపబడియున్నదని విద్వత్కవులకు విదితము. తెనుగు వ్యాకరణమందు లక్ష్యము లెల్ల ఛందోబద్ధ ప్రయోగములే. అన్యములు ప్రమాణములు గావు. ఇది యనాదిసిద్ధ మీభాషకు. ఏతత్కారణమున ఛందో వ్యాకరణము లవినాభావ సంబంధమున వెలయును లక్షణ గ్రంథములందు గాన వచ్చెడు. ఛందోవ్యాకరణములు కావ్యరచనోపకరణము లగుటచే గొందఱు కావ్యలక్షణములను నలంకారాదుల సయితము చేర్చి చెప్పిరి. (ఉదా. కావ్యాలంకారచూడామణి.) మన పెద్దనయు ప్రాచీనాంధ్ర లాక్షణికుల ననుసరించి తన ఛందమున వ్యాకరణము గొంతయు నంతకు బూర్వము తెనుగున జెప్పబడని నాటకలక్షణము గొంతయు వ్రాసి పెట్టెను.

"కాలమునుబట్టి యిది యప్పకవికంటె ప్రాచీనమైనను విషయ వివరణమునందు దానికి దర్వాతిదనియే చెప్పవలెను. లక్షణజిజ్ఞాసువుల కిది యెక్కువగా నుపయోగింపని కారణముచేతనో యేమో దీని యునికియే చాలమందికి దెలియకపోయినది. దీని రచయిత ప్రఖ్యాతుడు కాకపోయెను"—అని శ్రీ బులుసువారు వ్రాసిరి. (పుట. 11.)

ఇదియొక్కటే గాదు, ప్రాచీనములగు కవిజనాశ్రయ చ్ఛందోదర్పణాదు లేవియు విషయ వివరణమం దప్పకవీయమునకు దర్వాతివే. ఆ లోపము పెద్దన కృతికిమాత్ర మారోపింప నేల? 'ఇది చదివిన పిమ్మట మతి యెది యేనియు జదువు బుద్ధి

యేలా నోడముస్' అని యప్పకవి స్వగ్రంథమును ప్రశంసించినాడు కదా? ఇది కొంతవఱకు యథార్థమనక తప్పదు. చిత్రకవి పెద్దన ప్రఖ్యాతుఁడే; తల్లక్షణగ్రంథమును ప్రఖ్యాతమే యనుటకు క్రింది యంశములు చాలియున్నవి చూడుఁడు: "లక్షణసార సంగ్రహం బొనరించి యుద్వృత్తకీర్తి ప్రఖ్యాతుఁడగు చిత్రకవి పెద్దనార్యసుతుఁడు"—చిత్రకవి అనంతకవికృతి హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్య. "సర్వలక్షణసార సంగ్రహం బొనరించి తనరె నీ తాత పెద్దన కవీంద్రుఁడు"—చిత్రకవి రమణకవి సాంబవిలాసము.

లింగముగుంట తిమ్మకవి (క్రీ. శ. 1560) సులక్షణసారమున (నావిర్భ ప్రకటితము) నిందలి పద్యముల గైకొనెను. ఇప్పటి సులక్షణసారము ప్రతిలో లేదు గాని కందుకూరివారు తమవద్దనున్న యముద్రిత సులక్షణసారమునుండి చిత్రకవి పెద్దన మతమును ఖండించిన 'అనుమ నచేమొకో మును రచియించిన లక్షణసారసంగ్రహం బెనయు వచించె జిత్రకవి పెద్దన...' అను పద్య ముదాహరించిరి. కొలూరి యాంజనేయకవి సుకవికర్ణామృతమునను, పొత్తపి వేంకటరమణకవి (17 శతాబ్ది) లక్షణశిరోమణియందును, వారాకవి రఘునాథయ్య (1600) లక్షణదీపికయందును నీతని పద్యములు పెక్కు లుదాహరించియున్నారు.

గణపవరపు వేంకటకవి (క్రీ. 1675) ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమందు లక్షణసార సంగ్రహమును బేర్కొన్నాడు. (పు. 14) ఇంకను ముద్రితములుగాని లక్షణగ్రంథములు పెక్కు గలవు. అందెవ రెవరు దీని నుదాహరించిరో? అప్పకవి యీ గ్రంథమును బేర్కొని యిందలి లక్షణపద్యముల నుదాహరించెను. దీనిని జూచియే కొబ్బోలు దన గ్రంథమునకు సర్వలక్షణసారసంగ్రహమని కూచిమంచి తిమ్మన పేరు పెట్టెను.

పెద్దన యీ కృతికి జాలవఱకు ననంతుని ఛందోదర్పణ మాధారము. ఛందోదర్పణమునందు లేని గణితమైన దీ లక్షణసార సంగ్రహమునకు ముఖ్యగ్రంథములు పరిశీలించిన దెలియగలదు. అనంతుని వ్యాకరణ ప్రకరణమును మాని యితరులు చెప్పని కొన్ని కారకనిర్ణయము నాటకలక్షణము, చిత్రకావ్యలక్షణము నీతడు క్రొత్తగా జేర్చెను. అనంతుని సుపద్యానుకరణములు, లక్ష్యలక్షణానువాదములు పెద్దన గ్రంథమందంతటను గానవచ్చును.

(1) అక్షరక్రమము: "అక్షరములు 52 అని పెద్దన మతము. ఱకారము వర్ణాంతరముగా గ్రహింపబడినది. సంస్కృత వైయాకరణులు ళాకారము నంగీకరింపరు" అని బులుసువారు వ్రాసిరి. (పు. 11 12)

పెద్దన లక్షణమునకు మూలమనదగిన యీ క్రింది యనంతుని ఛందోదర్పణమునందలి పద్యము లిట్లు వర్ణసమామ్నాయమును నిర్దేశించెను:—

క. భూమి బదాఱచ్చులు నా
గా మెఱసి అకారమాదిగా స్వరములగున్
ఖా మొదలు ఱకారము తుద
యై ముప్పదినాల్గు హల్లులగు వ్యంజనముల్.

క. తగు హ్రస్వంబులు దీర్ఘము
లగు అ ఇ ఉ ఋ ఌ లును వెండి హ్రస్వాభావం
బగు ఏ ఐ ఓ ఔ లు నె
సగు అం అః అనగ షోడశ స్వరము లగున్.

క. కచటతపవర్గ వర్ణము
లెచటన్ స్పర్శలగు నిరువదేనై మఱియం
దుచితగతిన్ ఙ ఞ ణ న మ
ప్రచయం బనునాసికాఖ్య ప్రస్తుతినొందున్.

క. యరలవ లంతస్థలునా
బరగును శషసహలు తేటపడు నూష్మలనన్
సొరిది ఱకారము గూడగ
సరి నేబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్.

క. ళలలకు భేదము లేదను
పలుకున ళా దొలగి యొగు పగులకు వర్ణం
బులు సంస్కృత భాషకు మఱి
తెలుగున ఱళలనగ రెండధిక మగు హరీ.

(4. ఆశ్వాస. 123...127)

ఈయనంతుని పద్యములను జూచియే మన పెద్దన ఱకారమును వర్ణాంతరముగా గ్రహించె. సంస్కృత వర్ణములేబదితో ఱ ళ లు రెండు తెలుగున నధికము గాన నిర్ణీతము 52 అగును. ఌకార దీర్ఘ మనంతుడు చెప్పె, పెద్దన చెప్పె. తెలుగులో హ్రస్వక్రములు (ఎ—ఒ) ఱ ళ లతో బాటనంతుడు నిర్దేశింపడయ్యె; పెద్దన విడిచిపెట్టె గాబోలు. (చూ—అన్వయ ... ఇవ్వయి భగణీ ఉన్వయి బుధతుమ్మరగ్గియును హ్రస్వ ఏ ఒ ... ఐకార మీపదో ఔ లవలి... ళకుఱల్ రేవతి యనెడి బుధ ఱ ... 1-23) ఱకారమును వర్ణాంతరముగా చెప్పినందుల కనంతునిట్లు విమర్శించినా డప్పకవి—

"కాకుపా జడ్డయైన క్షకార మగుట
దలప కేబది లిపులలో దాని గూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డఘాను
విడిచిపెట్టె ననంతుండు నెట్టిగాడె." (2-52)

వర్ణములలో క్షకారమును గ్రహించు సంప్రదాయమును గలదు. 'అకారాదిక్షకారాంత వర్ణాః స్యుర్మాతృకాహ్వయాః' అని చమత్కార చంద్రికలో మాతృకా వివరణము చేయబడెను. 'అకారాది క్షకారాంతః అక్షః తత్కృతా తత్ప్రతినిధి భూతా వా మాలా అక్షమాలా' అని ఆప్టే నిఘంటు.

ఌకార దీర్ఘ విషయమున భిన్నమతములు గలవు. మంత్రశాస్త్రమున మాతృకాపూజలో ౡకారము గ్రహింపబడినది. శబ్దేందు శేఖరమున 'ఌ వర్ణస్య ద్వాదశ'అను సూత్రవివరణములో 'దీర్ఘ త్వేపి నక్షతిః' అని దీర్ఘంబు నుండవచ్చునని వ్యాఖ్యానింపబడినది. 'ఋ ఌ వర్ణయో ర్మిథస్సావర్ణ్యం వాచ్య'మ్మను వార్తికము కలిమింజేసి ఋవర్ణ దీర్ఘముచే ఌవర్ణ దీర్ఘము వ్యాకర్తలచే సాధితము. 'ద్విధాక విచోనుస్వారో విసర్గ షోడశ స్వరాః' అను వరరుచి వచనము ౡకారమును గ్రహించెను. ఏకాక్షర నిఘంటువులలో ౡకారమున కనేకార్థములు చెప్పబడెను. ఆంధ్ర లాక్షణికులు భీమనాదులు ౡకారమును జెప్పిరి. అహోబలపండితుడు ౡకార విషయ మతభేదముల జర్చించెను. "కేషాంచిన్మతే ఌవర్ణస్య దీర్ఘగ్రహణం సమ్మతమ్" (పు 182).

వర్ణసమామ్నాయములో ౡకారము గ్రాహ్యమని క్షకారము వర్ణాంతరము గాదన్నను దెనుగు లాక్షణికులు పెక్కురు గ్రహించినారు.

(2) కావ్యస్వరూపము :

అష్టాదశవర్ణనల జేర్కొను 'ఋతుగిరి వనజల...మంత్ర తనయ దూత్య పరిణయ నృపతి మఘు వర్ణనలు...(1-53)' అను పెద్దన పద్యమున 'దూత్య' అనుటకు మాఱుగా 'ద్యూత' అని యుండవలెనని వ్యాసకర్త లఘుసూచికలో (12 పుట) వ్రాసిరి.

'నగరార్ణవశైలర్తు......మంత్రద్యూత ప్రయాణాజి...' అను ప్రతాపరుద్రీయ లక్షణమున 'ద్యూత' అని యున్నది, గాని ప్రతాపరుద్రీయానువాద మన దగిన నరసభూపాలీయమున నీ సందర్భమున, 'పురసింధునగర్తువనశశి......నయవిరచన యాత్రాజిదౌత్య విభువర్ణనముల్ (2-166)అను పద్యమునను 'దౌత్యమే' చెప్పబడినది. కారణము మృగ్యము. పై పెద్దన పద్యమందును మూర్తి పద్యమందును 'ద్యూత' శబ్దమును బఠింతుమేని సంయుక్త పూర్వాక్షరము గురువై గణభంగ మగును. పెద్దన్నది తప్పన్న మూర్తిది తప్పే. అంతియేల చిన్నకోట పెద్దనయు గావ్యాలంకార చూడామణిలో 'దూత్యమే' పేర్కొన్నాడు. "పురవారాశి మహీధరర్తు...స్వయంవర పుత్త్రోత్సవ మంత్రదూత్య రణదోర్గర్వ ప్రక్రాంతి సంకీర్తనాకర మష్టాదశవర్ణ నాన్వితము ...... (3-92)." ఇందును ద్యూతశబ్దము పఠింపవీలులేదు. అదియును గాక 'దూత్యమే' చిన్నకోట పెద్దనాభిప్రేతమని యంచే తర్వాతి. 133-134 పద్యాలవలన దెలియుచున్నది. ఆ పద్యాలలో వరుసగా దూత్యలక్షణ లక్ష్యములు చెప్పబడ్డవి. దూత్యము మతాంతరమని విస్పష్టము కాన బెద్దన వ్రాత యసంగతము గాదు[1].

(3) ప్రాసవిషయము : అనంతుడు ద్వాదశవిధ ప్రాసములను జెప్పినతర్వాత శబ్దాలంకార విశేషములగు షడ్విధప్రాసముల వ్రాసె. మన పెద్దన రెంటి నేకము చేసి 18 ప్రాసభేదముల చెప్పె. ఇందలి లక్ష్య లక్షణము లన్నియు ఛందోదర్పణానుసరణములే. అందలి పదముల గూర్పు కొన్నిపట్ల యథాతథముగా గ్రహింపబడినది. పెద్దన రచనలోని గుణదోషము లనంతుని రచనకును జెందక తప్పదు.

"ఇందలి ప్రాసముల లక్షణోదాహరణము లన్నియు నొక్క సీసమాలికలో నీయబడినవి. కావున కొన్ని యెడల యతులను, మఱికొన్నిచోట్ల ప్రాస యతులను ప్రాసభేదముల కుదాహరణములనుగా గ్రహింపవలసివచ్చుచున్నది" అని విమర్శ. (13. పు).

ప్రాసలక్షణోదాహృతు లనంతాప్పకవ్యాదులును గీతపద్యాలలో చెప్పవలసి వచ్చినప్పుడు ప్రాసయతిలో నిబద్ధమొనర్చిరి. పెద్దన సీసమాలికలో జెప్పినాడు గాన ప్రాసయతులలో ప్రాసోదాహరణలు తప్పనిసరిగా నిబద్ధములైనవి. వ్యాసకర్త చెప్పినట్లు ప్రాసోదాహరణలకు యతులను గ్రహింపవలసిన పట్లు నాకింగు గానరాలేదు. ఎందేని ముద్రాప్రమాద ముండవచ్చు.

1. వనజలకేళీ శశిరవి తనయోదయ పాన యాన దౌత్యాబ్ధి వివాహ...వర్ణనలు దనుగృతులఙ్ - అని రుక్మాంగదచరిత్రలో (1-18) దౌత్యమే పేర్కొనబడెను.

(అ) సంధిగతప్రాస :

"పవనజు కవచమే స్ఫటియింతు ననిది
సంధిగత ప్రాస సంజ్ఞ దనగు."

ఇందు సంధిగతప్రాస కుదాహరణ లేదనితోచును. ఈ పాఠము సరిగాదు. 'పవనజు కవచమే—ను వఠింతు నననిది...' అని యుండవలయు. ఏను+పఠింతు ఏను వఠింతు. ఇందు సిద్ధవకారమునకు సంధిగత వకారమునకు ప్రాస ముంచబడినది. ఏను ప్రకృతప్రకృతికము గాన 'ఏను బఠింతు'ననికదా సంధి గలుగునను శంక రావచ్చు. ఏను+పిదప ఏనువిదప అని గసడదవాదేశము భారతమున ప్రాసస్థలనిబద్ధమై యున్నది.

"కవదొనలును గాండీవము
నవలనిడం బనుపు ముంద అరదము డిగు మే
ను విదప డిగియెద...(శల్య—2–333)

ఈ మహాభారతప్రయోగమును జూచియు, 'ఎవ్వండు వఠించు' అను కౌశిఖండప్రయోగమునందలి తెనుగు మీది తత్సమ పదములకు గసడదవాదేశ ప్రాప్తిని జూచియు మన పెద్దన 'ఏను వఠింతు'నని ప్రయోగించి యుండును.

(ఆ) ప్రాదిప్రాస :

"ప్రాదిపాస మను పేరేల వచ్చెనో తెలియకున్నది"—అని విమర్శ (13). ప్ర+అన—ప్రాణ. ఇందు ణకార మాదేశము. ఇట్లాదేశ ణకారమునకును కేవల నకారమునకును ప్రాస ఘటింపవగును. (పూనుక.. ప్రాణ). 'గుణ...మన' అనురీతి సిద్ధనకార ణకారములకు ప్రాసమైత్రి లక్షణ విరుద్ధము. ప్రాదులపైని ణత్వమున కీప్రాస చెల్లుగాన ప్రాదిప్రాస నామ ముంచబడియె. ఇది పెద్దన పెట్టిన పేరుగాదు. అంతకుముందే యనంతుడు దీనిని జెప్పె:

'ప్రాదియై యన శబ్దంబు ప్రాణమగుట .
బరగ ననలకు వేర్వేఱ ప్రాసమయ్యె
క్షోణి గరుడెత్తె నెనుగు ప్రాణమునగ
దానవారాతి వేతల ప్రాణమునగ' (ఛం-1-48)

(ఇ) ఋప్రాసము :

"ఆ ఋకారము రేఫతో రహి గూర్చుట
ప్రౌఢులౌ కవులు ఋప్రాసమండ్రు."

"లక్షణ మీయబడినదే కాని యుదాహరణము లేదని విమర్శ." (పు 13)

ప్రథమార్థమందు ప్రారంభమందే యుదాహరణ మున్నదే.

'ఆ ఋ......తోరహి'

ఋకార మచ్చైనను దెనుగున బదాద్యంబులు ఋ ఌ వర్ణంబులు రలతుల్యంబులు గాన ఋకారము నకు రేఫతో ప్రాసము చెల్లుబడియైనదని యెఱుంగునది. అనంతు ఋ ప్రాసమును జెప్పె. (మా-1-43)

(ఈ) ప్రాసమైత్రి ప్రాసము :

ఋ యుతాయుతములకు నీ ప్రాసమును (శమదమసంపన్న—ఉమ్మృతాళి) జెప్పుట యనావశ్యక మని విమర్శ. (పు. 13)

ఇట్యాది స్పష్టప్రతిపత్తికై చెప్పబడినది. పెద్దన తన పూర్వలాక్షణికుల ననుసరించియే దీనిని జెప్పె. చూడామణి ఛ్ఛందోదర్పణాదులం దీ ప్రాసభేదము లక్ష్యలక్షణములు చెప్పబడినవి. (చూ: కావ్యాలంకార చూడామణి, ఋకాంతప్రాస ఉ–7. 86, 87.) ఛందోదర్పణము (1–40, 42) – కూచిమంచి తిమ్మకవియు జెప్పెను. (సర్వలక్షణసారసంగ్రహము. పు. 100)

(4) యతి విషయము: చిత్రకవి పెద్దన ప్రాసభేదముల ననంతుడు చెప్పినవానినే యథాతథముగ గ్రహించెనుగాని యతిభేదములందు గొంత మార్పుచేర్పులగావించె. అనంతుడు 24 యతులు చెప్పగా నితడు 27 యతులు చెప్పెను. అనంతుడు చెప్పిన కొన్ని యతిభేదములను వదలి కొన్ని క్రొ గా జెప్పెను. అనంతుని యతులందు బెద్దన దానేవేవి చెప్పెనో వాని లక్ష్యలక్షణము లనంతానుకరణములే.

(అ) "ప్రాసయతిని పెద్దన తెలుపకుండుటకు గారణమేమో బోధపడకున్నది"— అని విమర్శ (పు. 14)

ప్రాసయతి యొక యతిభేదము గాదు. సీస గీతాదులందు యతికి మాఱు ప్రాసయతి యంగీకృతము. దీనికి ప్రాసలక్షణమే కాని యతిలక్షణము వేఱొదియు గొంతగా లేదు. ఇదియొక యతిభేదముగా ప్రాచీన లాక్షణికు లెవ్వరును చెప్పలేదు. అప్పకవి మాత్ర మీ యతిభేదమును జెప్పెను.

(ఆ) "ప్రాది, ఆదేశ, ఉభయ, అఖండ, శకంధ్వాదియతులు నిత్యసమాసయతి యందే లీనమగుటచే ప్రత్యేకముగా జెప్పుట యనావశ్యక"మని విమర్శ. (14 పుట)

ఇది కొంతవఱకు వాస్తవమే కాని ప్రాచీన కవి భీమననుండి నిన్న మొన్నటివఱకు ఛందఃకర్తలు నిత్యసమాసయతితో ప్రాద్యాదేశాదియతులను సయితము చెప్పుచు వచ్చిరి. ఉభయవళ్ళలో నిన్ని భేదములు లాక్షణికులు స్పష్టప్రతిపత్తికై చెప్పిరని తోచెడిని. అనా కములుగా జైని బరిగణితములైన ప్రాది

ప్రభృతియతులను జెప్పిన లక్షణగ్రంథముల నీక్రింద దెల్పెద.

ప్రాదియతి — కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, అప్పకవీయము, కవిజనసంజీవని, ఆనంద రంగ చ్ఛందము, కూచిమంచి సర్వలక్షణసార సంగ్రహము,[2] లక్షణదీపిక,[3] లక్షణ శిరోమణి,[4] కవిచింతామణి,[5] కవితాలక్షణసారము, సులక్షణసారము.

ఆదేశయతి — చూడామణి, రంగరాయచ్ఛందము, లక్షణదీపిక, కవితాలక్షణసారము, సులక్షణసారము.

ఉభయయతి (యుష్మదస్మద్యతి) – అప్పకవి, లక్షణదీపిక, లక్షణ శిరోమణి, సులక్షణసారము.

శకంధ్వాదియతి (పరరూపయతి) – అప్పకవి, సులక్షణసారము, లక్షణదీపిక, లక్షణశిరోమణి, కవిసంజీవని, రంగరాయ చ్ఛందము.

అఖండవడిగూడ నిత్యసమాసయతివలననే గతార్థము కాగలదనుట సరిగాదు. అఖండయతివలన నిత్యసమాసయతి గతార్థమగును గాని నిత్యసమాసయతివలన అఖండయతి గతార్థము గాదు. స్వరసంధిఘటితశబ్దములం దెల్ల స్వరమునకు గాని వ్యంజనమునకు గాని యతి పాటించుట యఖండయతి లక్షణము. వసుధామర, సకలార్థ, దివిజారి, తలంచుచుండు, కొడుకులట్లు, నాకిష్టము, ఏమన్నను — ఇత్యాది సంధిగతశబ్దములందు స్వరవ్యంజనములకు యతికూర్చుట యఖండయతి యనబడు. ఇది ప్రాదిప్రభృతి యతులకు భిన్నము. నిత్యసమాసయతి వేఱు; ఇది వేఱు వర్గాలు. జనార్దన, రామాయణ, నారాయణ, రసాయనాది శబ్దములు నిత్యసమాసయతియందు జేరును. పై వసుధామర...తలంచుచుండు...ఇత్యాదులు చేరవు.

ప్రాదనిత్యసమాసాదియతుల జెప్పియు అఖండయతిని జెప్పిన ప్రాచీనార్వాచీన లాక్షణికులు పెక్కురు గలరు. చిత్రకవి పెద్దన గ్రంథమందే కాక కవిజనాశ్రయ, కవిచింతామణి, కవిసంజీవని, కవితాలక్షణసార, సులక్షణసార, లక్షణదీపిక, లక్షణ శిరోమణి, సర్వలక్షణసారసంగ్రహ, రంగరాయచ్ఛందము లందు అఖండవడి చెప్పబడినది. హంసవింశతియందు

---

2. వార్తాకవి రఘునాథయ్య (క్రి. 1600). 3. పొత్తపి వేంకటరమణకవి (17 శతాబ్ది). 4. తాతంభటు (15 శతాబ్ది). 5. ఒరుగంటి రామకవి (18 శతాబ్ది)- పైలక్షణగ్రంథకర్తలు; ఇవి యముద్రితములు. 1,2,3 గ్రంథములు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోను, 4 సాహిత్య పరిషత్తులోను గలవు.

గవిత్వరచనగూర్చి తెల్పు సందర్భమున నీ వడిభేదము పేర్కొనబడెను. (3-127)

(ఇ) చక్కటియతి :

విభక్తి మువర్ణముతో పు ఫు బు భు లు యతి చెల్లుట పోలికయతి, కేవల ముకారముతో యతి చెల్లుట చక్కటి యతి—ఇది పెద్దన లక్షణము. రెంటిని గలిపి పు ఫు బు భు లు ము వర్ణముతో జెల్లునని యొక్క యతి భేదముగా జెప్పిన జాలును. 'యతిద్వయ నిరూపణ మనావశ్యక'మని విమర్శ.

పెక్కుగు లాక్షణికు లీరెండు భేదముల వ్రాసి యున్నారు. పోలికయతి ప్రాచీనమతము. చక్కటి యతి యర్వాచీనమతము. భారతమున చక్కటియతికి ప్రయోగములు గానరావంగురుత. ఉభయమత ప్రదర్శనార్థము రెండు యతులుగా జెప్పబడినవని తోచెడు. ఇట్టి పద్ధతి యప్పకవీయమం దితరయతుల విషయమునను జూపట్టుచున్నవి. (చూ: అభేద—అభేదవర్గ యతులు; తద్భవవ్యాజ – విశేషయతులు).

తాతంభట్టు కవిచింతామణిలో నీయతి యసంగతమని వక్కాణించె.

'చక్కటి యతియని కొందఱు.
మొక్కలమున పు ఫు బు భులకు మూవెట్టుగురో
క్కొక్కప్పుడు చెవులకు విన
గక్కసమగు గవి మతంబు గాదు ముకుందా'

(వర్ణప్రాసాధికారము)

దీనింబట్టి తాతంభట్టునకు బూర్వమే యీయతి భేదము ప్రచారములో నుండెననియు ప్రాచీనకవి సమ్మతము గాకుండెననియు దెల్లమగుచున్నది తర్వాతివా రంగీకరించుటచే రెండుభిన్నయతులుగా నిల్చినవి.

(5) నాటక ప్రశంస: తెనుగున బ్రప్రథముగా నాటకలక్షణము దెల్పినఖ్యాతి చిత్రకవి పెద్దనకే దక్కినది. ఛందోలక్షణమును సూక్ష్మముగా సూచనామాత్రముగ దెల్పినట్లే నాటకలక్షణమును వివరించి వ్రాయవలెయ్యె. విన్నకోట పెద్దన

"అపద్యగద్య కృతములు
రూపకములు నాటకములు రూఢము లగునా
రూపను చంపూ కావ్యత
బ్రాపించును నాటకములు బహుళము లరయన్"

(4-6)

అని నాటకములను ప్రస్తావించెను. చిత్రకవి పెద్దన మూర్తికవులు సమకాలికులు. అప్పటికే ప్రచారమునకు వచ్చిన మూర్తి కావ్యాలంకార సంగ్రహములో నాటక ప్రకరణము చెప్పలేదని పెద్దన దీనిని రచించెనేమో! మూర్తికృతు లప్పుడే ప్రసిద్ధములు.

ఆతని ద్వ్యర్థికిఁ బెద్దన కుమారుఁడు అనంతకవి వ్యాఖ్య రచించె గదా!

ఇందు ముద్రణస్ఖాలిత్యము లేర్పడుటచే గవికి మూలవిషయార్థావగతి కాలేదను కళంకము వ్యాసకర్తచే నంటగట్టబడెను. "సూచ్యము దృశ్యశ్రవ్య భేదములచే ద్వివిధమని, అసూచ్యము విష్కంభాదులచేఁ బంచవిధమని చెప్పబడినది. (3 59) ఇది ముద్రాప్రమాదమేమో! ఇందిట్టి ముద్రాప్రమాదములు పెక్కులు గలవు. సూచ్యమునందే విష్కంభాది భేదములు చెప్పవలె. (98-99 పుటలలో) "లీల విష్కంభ చూళికలు నంకాస్య మంకావతార ప్రవేశాఖ్యలైదు సూచనార్థాన్వితములు" అని పెద్దనచే సరిగానే చెప్పబడినది.

పాఠకులకు దెలియుటకై యీ ప్రకరణములోని కొన్ని ముద్రణప్రమాదముల జూపెద.

ఉపరూపకములు : (94-ప.)

నాటికా సట్టక త్రోటకో ప్రేక్షణం
బును గోష్ఠి భాణికల్ హల్లీశము
సల్లాపకంబు ప్రస్థానంబు కావ్యంబు
రహిమించు భల్లిశ రాసకములు—గీతలుంచి

నవి యుపరూపములు. వరుసగా 'ప్రేంఖణంబును, భాణికల్, హల్లీసరాసకములు' అనునవి సరియైన పాఠములు.

ఉత్సృష్టాంకలక్షణము : (90 ప.)

'రసము కరుణముగఁ బ్రఖ్యాత మితివృత్త
మును శ్రీ విలాసంబు మొనసియుండు
వాగ్యుద్ధమును భాణవత్సంధి వృత్త్యాదు
లును నాయకులు ప్రాకృత నరులుగను.

ప్రతాపరుద్రీయమున నిట్లున్నది :

"యత్రేతివృత్తం ప్రఖ్యాతం, ప్రధానం కరుణోరసః,
స్త్రీణాంవిలాపో వాగ్యుద్ధం నేతారః ప్రాకృతానరాః."

పెద్దన పద్యములోని 'శ్రీవిలాసము' – పొరపాటు 'స్త్రీవిలాస'మని యుండవలె, కాని సాహిత్య దర్పణాదుల ప్రకారము 'స్త్రీవిలాప' మనవలయు.

ఇంక నిట్టి వెన్నో కలవు. వ్యాసవిస్తర శంకచే విరమింతును. ఛందోవ్యాకరణ విషయములందు పెద్దన తన పూర్వ లాక్షణికుల ననుసరించెనని, పరిషత్తువారి ప్రతిలో ముద్రణ ప్రమాదము లిటి శంకలకు దాగిచ్చినవని యిందాక నా చేసిన పరామర్శవలన దెలియగలదు.

---

6. కూచిమంచి వెంకటరాయకవి తన సుకవి మనోరంజనిలో నీ విషయము సూచించె. ఇతని గ్రంథ మముద్రితము.

# మగువ మనసు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

పాత్రలు : జానికమ్మ - చంచల.

[ఆ గదిలో, మధ్యతరగతి వాడి ఆశల జీవితంలాగా మధ్య మధ్యలో ఆరిపోతానని బెదిరిస్తూ వో కిరసనాయిలు దీపం వెలుగుతోంది మంద మందంగా.

తెర తొలగేసరికి, యాభయ్యోపడి దాటి జీవితంలోని వొడిదుడుకులతో, అనుభవాలతో వార్ధక్యానికి మరింత చేరువగా వున్నట్లు కన్పిస్తున్న జానికమ్మ, చీరచెంగు తలమీదకు లాక్కుని, నిండా పచ్చని వో దుప్పటి కప్పుకుని, అవయవాలను దగ్గరకు కూడదీసుకుంటూ వొక వాలుకుర్చీలో నలతగా పడుకుని వుంటుంది. మనిషిలో ఆనందం లేదు. ఏవో ఆలోచనలు, వారం పదిరోజులనుండీ మంచానికి అంటిపెట్టుకుని వుండవలసిరావడంతో మొహంలో విసుగు, నిరాశ, ఎవరిమీదనో కోపమూ కన్పిస్తున్నాయి. అయినా తన ప్రవర్తనను తాను నిభాయించుకోగల హుందాతనం ఆమెలో లేకపోలేదు.

ఆమె కుర్చీ ప్రక్కనే వో టేబిలు వుంది. దాని మీద చిన్నవీ, పెద్దవీ అనేక రకాల మందుసీసాలు. ఒక సీసామీద 'విషం' అని వ్రాయబడివుంది. గోడలకు దేవుళ్ళు వికృతంగా వ్రేలాడుతున్నారు.

సమయం ఆరు గంటలు దాటింది. కిటికీలోంచి సిగరెట్టు పొగలాంటి వెల్తురు గదిలోకి ప్రసరిస్తోంది. కానీ నాటిక జరుగుతున్నంత కొద్దీ, అది తగ్గిపోతుంటుంది.

ప్రక్కగదిలోనుండి అంత బిగ్గరగానూ కాకుండా, మరీ అంత మెల్లగానూ కాకుండా రేడియోసంగీతం...ఏదో విషాదగీతం.

ఓరవాకిలిగా వేసివున్న గది తలుపులు కొద్దిగా విడివడ్డాయి. తలుపుమీద మృదువేలితో చప్పుడు.]

జానికమ్మ : (మెల్లగా) ఎవరదీ?...లోపలకు రావచ్చు.

(అందంగా, ఎఱ్ఱగా, సన్నగా, సోగకన్నులతో, నల్లని జుట్టు ముడిమీద తెల్లని మల్లెలను వరుసగా తురుముకొన్న చంచల లోపలకు ప్రవేశించింది. మనిషిలో ఏదో సాధించాలన్న ఉబలాటం వుంది. చదువుకున్న యువతిలోని నాజూకుతనమూ, నెఱజాణతనమూ రెండు ఆమెలో కన్పిస్తున్నాయి. ఆమె చేతిలో రెండు బత్తాయి పళ్లూ, కాసిని సపోటాలూ వున్నాయి.)

జాని : ఓ! నువ్వా చంచలా?! రా. రా. కూచో (చంచల వో కుర్చీమీద కూచో బోతుంటుంది) ఆఁ! ఆఁ! పెద్దదాన్ని చెప్పాననుకోబోకు. కొంచెం, ఆ తలుపులు వోరవాకిలిగా దగ్గరకు వేసివచ్చి కూచో. ఈమధ్య వొంట్లో అంత బావుండటం లేదు కదూ! చలిగాలి పనికిరాదన్నారు డాక్టరుగారు.

చంచల : (తలుపులు వేసివచ్చి కూచుంటూ) ఎలా వుందిప్పుడు? గుండెల్లోనొప్పి కొంచెం తగ్గిందా? —ఇన్నాళ్టికి నామాట జ్ఞాపకానికి వచ్చింది మీకు. పోన్లెండి. ఇప్పటికైనా జ్ఞాపకానికి వచ్చాను. అదే పదివేలు. వాళ్ళ సుందరం లేడూ, వాడొచ్చాడు పొద్దున. వచ్చి అర్జంటుగా మీరు పిల్చుకు రమ్మన్నారని చెప్పాడు. ఎందుకోననుకున్నాను. అప్పుడే వచ్చేసి మిమ్మల్నోసారి చూసి పోదామని అనుకున్నాను. కానీ ఏం చేయను. అప్పటికే ఆఫీసు టైమయిపోయింది. ఆఫీసులో వాడో కర్కోటకుడు. ఏంచేసేది చెప్పండి?—ఇప్పటికి గాని తీరుబడి కాలేదు. రావడానికి ఏమిటో, టైపిస్టు జీవితమే యింత.

జాని : పోనీలే. ఇప్పటికైనా ఈ ముసలిదాన్ని గుర్తుపెట్టుకుని, తీరుబడి చేసుకువచ్చావు. అదే పదివేలు.

చంచ : అయ్యయ్యో! అదేమిటండీ అలా అంటారు? మాబోటి చిన్నవాళ్ళను మీరు కాస్త కనిపెట్టి చూడాలి కానీ...ఆఁ! వస్తూ, వస్తూ వుండగా దార్లో ఈపళ్ళు కనిపించాయ్. పట్టుకొచ్చాను.

జాని : ఎందుకూ?...మా యింట్లోనూ బుట్టలో వున్నాయి. వాడిపోతున్నాయి. 'వద్దురా!

ఎందుకనవసరంగా తీసుకొస్తావ్? — వాడిపోతాయి. 'పిల్లా జెల్లా అన్నా లేరు తినడానికి' అని చెప్తున్నా వినకుండా రోజో అరడజను పళ్ళన్నా పట్టుకొస్తుంటాడు. చంచలుడు. (ఈమాట విని చంచల కొంచెంగా కళవళపడుతుంది) ఆఁ! చంచలా, ఆ రేడియో ఆపేసిరా. పాడు సంగీతం, ఎవరో ఏడుస్తున్నట్టుగా.

చంచల: నిజమేనండి. (రేడియో ఆపివస్తూ) ఎంత సంగీతమంటే చెవి కోసుకున్నా, విషాదగీతాలంటే మాత్రం వెగటేస్తుంటుంది. ఆ పాటలు విన్నప్పుడల్లా, జీవితానికి కన్నీళ్ళుతప్ప మరేమీ మిగలవేమోనని భయం కూడా వేస్తుంటుంది. (కొంచెం మౌనం. ఏం మాట్లాడాలో తోచనట్లు) రేడియో చాలా బావుంది. కొత్తగా కొన్నారా?

జాని : ఆ. ఆ. మొన్నీమధ్యనే. (చంచలను పరిశీలనగా చూస్తూ) రఘు వెళ్ళి కొనుక్కొచ్చాడు. (ప్రేమగా) నా బాబు, నాతండ్రి, ఎంత తెలివిగలవాడు. (తనలోతను గొణుక్కుంటూ) ఎట్లా పాడయిపోయాడు!!

చంచల : నిజమే. నేనూ అలాగే అనుకుంటుంటాను.

జాని : (ఉత్సాహం తెచ్చుకుంటూ) ఏమని?

చంచ: తన పనేమో, తానేమో తప్ప రఘుపతికి మరో పాటి తెలియదు – అని ఇతర్లు మెచ్చికోలుగా అన్నప్పుడల్లా ఆ మాట నిజమేమోనని.

జాని: (చిరుకోపంతో) నువ్వేమీ మావాణ్ణి ఎగతాళి చేయనక్కరలేదు.

చంచ: (నవ్వుతూ) అవునవును. ఏదో సినిమాలో చెప్పలేదూ, చెట్టును కొయ్యబరువా అని; అలావుంది. (విషయం మార్చేస్తూ) ఆఁ! జానికమ్మగారూ! వీటిసంగతే మర్చిపోయాం. ఎక్కడ పెట్టమంటారు?

జాని : ఆ టేబిలుమీద పెట్టు.

చంచ: (అల్లాగే చేసి, అక్కడ వున్న వస్తువులను సర్దుతూ) ఈ మందు సీసాలన్నీ, ఇన్ని రకాల మందులూ వాడుతూనే వున్నారు?

జాని : ఆఁ! ఏమిటో! ఈ మందులూ, ఈ డాక్టర్లనూ చూస్తుంటే విసుగ్గా ఉంటోంది. ఒక్కమందూ సరిగా పనిచెయ్యదు. ఇదికాదు అది, అదికాదు ఇది అంటూ ఆ డాక్టరు వూరికే చీట్లురాయడం; గాభరాపడుతూ చచ్చిచెడీ ఆమందులన్నీ మనం కొనుక్కురావడం; ఇంతే తప్ప ఇందులో నాకు మరేమీ కనబడడం లేదు. డబ్బు దండుగ వ్యవహారాలు!

చంచ : బాగానే వుంది. మరి ఈ విషాన్ని కొనుక్కున్నారెందుకు?

జాని : అది నా గుండెజబ్బుకు మందు. ఈ మధ్య బొత్తిగా కూచుంటే లేవలేకుండా వున్నాను. ఇవతలపుల్ల తీసి అవతల పెట్టలేను. ఒకటే ఆయాసం. ఏమిటో! విషాలూ, బండలూ; ఆ సీసాకు ఆచీటీ ఎందుకు అతికించారో తెలుసా? మనదగ్గర డబ్బు గుంజటానికి, మన రక్తం పిండడానికి; అంతకన్నా మరెందుకూ కాదు.

చంచ: డబ్బు ఖర్చయితే అయింది కానీ...ఏది శాశ్వతం? మీలో ఇదివరకటికన్నా కొంచెం ఆరోగ్యం వచ్చినట్లే కన్పిస్తోంది.

జాని : అట్లాగా?

చంచ: (వ్యంగ్యంగా) నేనేగనక మీ స్థితిలో వుండి, ఇంట్లో కాలు బైటపెట్టే వోపిక లేక, కళ్ళుమసక లేసిపోయి, గుండెజబ్బుతో బాధపడుతూ, రామా కృష్ణా అని అనుకోడానికి కూడా వీలు లేక పోయినట్లయితే—చచ్చి గీపెట్టినా నన్ను చూట్టానికెవర్నీ రానిచ్చేదాన్ని కాదు.

జాని : బావుంది. చివరకు వాళ్ళతో వీళ్ళతో మాట్లాడలేని పరిస్థితికూడా రావాలంటావ్? ఇది చాలదూ? – మంచం మీదనుంచి కాలు కిందపెట్టడానికి వీల్లేదు నాలుగడుగులు సరదాగా నడవడానికి వీల్లేదు. కాళ్ళూ చేతులూ కట్టి పడేసినట్లుగ ఎందుకూ పనికిరాని దానిలాగా, ఛీ! ఛీ! ఛీ! అసహ్యం వేస్తోంది నామీద నాకే.

చంచ: నిజమే! ఈ పరిస్థితుల్లో ఇల్లా మిమల్ని చూట్టానికి, చెప్పొద్దూ నాకూ చాల బాధగానే వుంది. ఇదివరకు ఎంత హుషారుగా, నిండుగా వుండేవారు! పార్వతీదేవి లాగా—

జాని : ప్చ! ప్చ! ఆ రోజులు పోయినయ్. ఒకరిమీద ఆధారపడవలసిన స్థితి వచ్చింది. ముసలితనం నన్ను జలగలా బాధిస్తోంది.

చంచ: విచారపడకండి. మీఆరోగ్యం బాగుపడుతుంది. మళ్ళీ ఇదివరకటిలాగానే, నవ్వులు, ఆనందం, సుఖం.

జాని: నాకో విచారం లేదు. జీవితంలో అనుభవించవలసినవన్నీ ఇదివరకే అనుభవించాను. బీదతనంలోంచి భాగ్యవంతంలోకి, ఏకాకితనంలోంచి స్త్రీత్వంలోకి! ఏం కావాలి నాకు ఇంతకన్నా కానీ... కానీ...

చంచ: (ఆలోచనగా) ఊఁ!... కానీ...

జాని: ఏమీ లేదు. వాణ్ణి వో యింటివాణ్ణి చేసి, సరియైన మార్గం వాడికి చూపించి, వాడిపటం వాడికిచ్చిం తర్వాత, ఎటుబోయి ఎటువచ్చినా నాకేమీ చింత లేదు.

చంచ: మీరు అంతగా బాధపడవలసిన పరిస్థితేమీ నాకు కనిపించడం లేదు. రఘుపతి మీ మాట మీరి నడవడు. మీరుగీచిన గీటు దాటడు. సేవలు చెయ్యడానికి మేమంతా వున్నాం.

జాని: (ఒక్కసారిగా లేచి కూచుంటూ) ఉన్నారా? ఎందుకూ, ఏం చేయడానికట? చంచలా, నువ్వు నాకేం చేశావ్? ఏం చేశావ్? అబద్ధం ఆడకుండా చెప్పు?

చంచ: (భయాన్ని దాచుకోడానికి యత్నిస్తూ) ఓ! నేనా? నేనేం చేయగలను చెప్పండి? (నవ్వుతూ) ట్రైనింగయినా అయ్యాను కాదు, నర్సుగా మీకూ పనికొచ్చేదాన్ని. (తీవ్రంగా) అయినా కలవా పెటని పేరంటానికి గావడం నాకు అలవాటు లేదు.

జాని: అంటే?—బొట్టూ కాటికా పెట్టి "ఇదిగో అమ్మాయ్, ముసలిదాన్ని, అండ లేని దాన్ని, రోగిష్టిని, కొంచెం కనిపెట్టి వుండు తల్లీ" అని నేన్నిన్ను పిలవాలంటావ్?

చంచల: అహా...హా...అని కాదు. అయినా చాలా ఆశ్చర్యకరమైన విషయం—

జాని: (మధ్యలోనే అందుకుంటు) అవును. ఆశ్చర్యకరమైన విషయమే. చాలా ఆశ్చర్యం! ఇప్పుడు నేను ఎందుకు పిలిపించి వుంటానా అన్నది...

చంచల: (బాగా దెబ్బతిని, గాయాన్ని దాచుకోడానికి యత్నిస్తూ) ఇందులో ఆశ్చర్యపడవలసిందేముంది?—కాసేపు కులాసాగా అవీ యివీ మాట్లాడుకోడానికి రమ్మని వుంటారు.

జాని: అవీ యివీ మాట్లాడడానికి అస్తమానం నాయింటికి ఎవరో ఒకరు వస్తూనే వుంటారు.

చంచల: అవును. వాళ్ళకూ తెలుసు. ఇక్కడకు వస్తే వాళ్ళకూ మీకూ కూడా కాసేపు కాలక్షేపం అవుతుందని.

జాని: (విషాదంగా) వాళ్ళే చెప్పారా నాకీ సంగతి.

చంచల: (జాగ్రత్తగా) పనీ పాటా లేని నలుగురు ఆడవాళ్ళు చేరిన చోట జరిగేదే యిది. బట్టతలకూ, మోకాటికీ ముడివేస్తుంటారు.

జాని: పొరపాటు పడ్డావు. ఇక్కడ మాత్రం అవునింతర్వాతనే, దూరను కోష్టంలో కట్టేస్తామన్నారు. అర్థంగాలా?

చంచల: ఊ...హూ...

జాని: విడమర్చి చెప్పాలా?

చంచల: (పేలవంగా) ఊఁ?

జాని: ఈ ఊళ్ళో ఒకావిడకు పెళ్ళయింది. భర్తతో కొంతకాలంపాటు కాపురం చేసింది. తిరిగి అర్థాంతరంగా, వో అర్ధరాత్రికి అర్ధరాత్రి తన పుట్టింటికి వచ్చేసింది. ఉన్న వూళ్ళోనే టైపిస్టు వుద్యోగం సంపాయించుకొంది.

చంచల: అర్థమైంది. అందుకనే గోడలకు చెవులే కాని కళ్ళు లేవనడం (మననం చేసుకొంటున్నట్లుగా) వాగెక్కడో, దూరంగా, అస్సాంలో, ఆ నాగజాతివాళ్ళ మధ్య, ఆ అనారోగ్య ప్రదేశంలో ఉద్యోగం చేసుకుంటున్నారు. వద్దని నయానా భయానా చెప్పాను. వినలేదు "పిచ్చిదానా! అదృష్టం ఎదురువచ్చి స్వాగతం చెప్పినపుడు తిరస్కరించ కూడదే" అన్నారు. "కాదండీ! అక్కడికి వెళ్ళి ఆ బాధలను కొని తెచ్చుకునే బదులు, మనవాళ్ళ మధ్య వున్నదే, కలో గంజో తాగుదాం" అని ప్రాధేయపడ్డాను. ఊహూఁ! వారి నిర్ణయమే వారిది. నేనేం చేయను? ఆ నాగజాతి వాళ్ళంటేనే నాకు భయం. ఊళ్ళకువూళ్ళే తగలబెట్టుంటారట వాళ్లు. అందుకని—

జాని: ఉన్న వూరికి వచ్చేశావు. బావుంది. (హేళనగా) ఇప్పుడు మీ ఆయన ఎల్లా వున్నారట? కులాసాయేనా?

చంచ: ఊఁ బాగానే వుండివుంటారు. మగవాళ్లు వాళ్లకేం?

జాని: కానీ నాకొకటి అనిపిస్తుంటుంది. అటువంటి మగవాళ్లు పెళ్లిళ్లు చేసుకోకూడదు.

చంచ: ఎందుకని?

జాని : గృహస్థు యొక్క విధ్యుక్తధర్మ మేమిటో తెలుసా? పెళ్లాం బిడ్డలను చూచుకొంటూ అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ ఇంటిపట్టున వుండటం.

చంచ: అదంతా పూర్వకాలంలో. ఇప్పుడు ఆ గృహస్థులూ లేరు; మగవాళ్లు రక్షించకపోతే ఆడవాళ్లు బ్రతకలేకా పోరు.

జాని : కానీ అందరూ కాదు.

చంచ: అలా బ్రతకలేనివారు తమ కాళ్ళమీద తాము నిలబడగల ధైర్యంలేని దురదృష్టవంతు లన్నమాట! నామట్టుకు నాకేం పర్వాలేదు. అంతా బాగానే వుంది.

జాని : 'బాగా' అన్నమాటకు అర్థం చెప్పుకోడంలో వుంటుంది ఆ విషయం.

చంచ: అంటే?—మీరంటున్న దేమిటో నాకు అర్థం కావటం లేదు.

జాని : అల్లాగా! నేనెందు కిట్లా మాట్లాడుతున్నదీ నీకు బాగా తెలుసని నాకు తెలుసు.

చంచ: నాకు తెలీదు. (పెద్దగా) మీ రే ఉద్దేశ్యాన్ని మనసులో వుంచుకుని, ఇలా మాట్లాడుతున్నారో నాకు తెలీదు. (ఆవేశంగా) తెలీదు. ఏమీ తెలీదు. నిజంగా నాకేమీ తెలీదు.

జాని : తెలీదూ నీకు?—నిజంగా నీకు తెలీదూ? (వికృతంగా నవ్వుతూ) పిల్లి పాలు తాగుతూ లోకం తన్ను చూడటం లేదనుకుంటుం దట.

చంచల: (వొళ్ళు మరిచిపోయి) ఏవిటి? ఏవిటి మీరంటున్నది? నాకు తెలిసినంతవరకు, నాకు సంబంధించినంతవరకు ఏమీ లేదు. ఏమీ జరగలేదు. అంతా మామూలుగానే వుంది. ఇదివరకు ఎల్లాగో; అల్లాగే. ఎవరో నన్ను గూర్చి పనిగట్టుకుని అబద్ధాలు ప్రచారం చేసివుంటారు. అంతే. అంతే జరిగివుండాలి. అవును అన్నీ అబద్ధాలే.

జాని : (ప్రశాంతంగా) ఇందులో అణుమాత్రం కూడా అబద్ధం లేదు చంచలా! నిన్ను గూర్చి చెడుగా ప్రచారం చేయవలసిన అవసరం ఎవరికీ ఏమీ లేదు. అంతా నాకు తెలుసు. స్వయంగా నేను చూచాను. నా చెవుల్తో విన్నాను. ఇంకా పూర్తిగా తెలివితప్పి పిచ్చిదాన్ని కాలేదు. చంచలా! దురదృష్టవశాత్తూ అలా కళ్లు కనబడక, చెవులు వినపడక, వార్ధక్యం మీదపడిన నాడు, ఆ రోజున నువు ఆడుతున్న నాటకాన్ని యథేచ్ఛగా కొనసాగిద్దువుగాని. ఇప్పుడు మాత్రం వీల్లేదు. ఇహ లాభంలేదు. ఈ అన్యాయం ఇంతటితో ఆగిపోవలసిందే. ఈ కథ, ఈ ప్రణయ కథ ఇంతటితో ముగింపుకు రావలసిందే.

చంచల: ఏమిటి? ప్రణయకథేమిటి? ఎక్కడో పొరపాటుపడ్డారు మీరు. ఏమిటో అంటున్నారు?

జాని : ఏమీ పొరపాటు పడలేదు. తెలివి వుండే మాట్లాడుతున్నాను. రఘుతో, నా బుచ్చిబాబు, నా గతనాలతండ్రి, నా వెర్రినాయన, రఘుతో నువు సాగిస్తున్న వ్యవహారం...

చంచ: (వెకిలిగా నవ్వుతూ) ఏ...వి...టి రఘుపతితో వ్యవహారం సాగిస్తున్నానా? ర.ఘు.ప.తి.తో!—(వెకిలిగా) లోకంలో ఇంకెవరూ లేరన్నట్లు, ఇంకెవరూ దొరకరన్నట్లు...రఘుపతితో!!

జాని: తప్పించుకోడానికి ప్రయత్నం చెయ్యబోకు. నిజం నిప్పులాంటిది.

చంచల: కాదు. ఎన్నటికీ కాదు. ఇది నిజం కానే కాదు. శుద్ధ అబద్ధం. ఎవరో కావాలని దుర్బుద్ధితో నామీద చేస్తున్న దుష్ప్రచారం.

జాని : ఈ వయస్సులో దుష్ప్రచారం చేయవలసిన అవసరం నాకు లేదు. నేనంత దుర్మార్గురాల్నీ, వివేకహీనురాల్నీ కాదు. ఒకరి జీవితాన్ని గురించి త్వరపడి అలా నిర్ణయాలకు రావడానికి రహస్యం బట్టబయలయింతర్వాతనే, ఈ విషయం చేయిజారిపోతున్నదని తెలుసుకున్న తర్వాతనే నీతో ఇలా మాట్లాడుతున్నాను.

చంచల: కాదు. మీ రంటున్న దేమీ నిజం కాదు. మీరంతా మోసగాళ్లు. హీనులు, కుచ్చితులు. (బలహీనంగా కుర్చీలో కూలబడిపోయి) పరులను గురించి హీనంగా ఆలోచించడమూ, మాట్లాడడమూ తప్ప మీకేమీ చేతకాదు. (కొంచెం మౌనం) కాకపోతే యేవిటి జానకమ్మగారూ? రఘుపతికి ఎన్నేళ్ళు?—ఇంకా ఇరవై రెండు నిండలేదు. అవునా!—పురుషుడు కావాలన్న కోర్కె కలగాలే కాని, అది ఈ జన్మకు లేదు నాకు—రఘుపతి లాంటి పసివాడితో, లోకమంటే తెలియనివాడితో...

జాని : అవును. లోకమంటే తెలియని పసివెధవ కాబట్టే నిన్ను చూచి భ్రమసిపోయాడు.

చంచల: జానికమ్మ గారూ! ఇంత కఠినంగా మాట్లాడుతున్నారు. మీ అబ్బాయి గుణగణాలు మీకు తెలియనివా?

జాని : తెలుసు కాబట్టే మరణబాధ పడవలసివస్తున్నది.

చంచల : అయితే మీ అబ్బాయిని పిలిపించి అడగవలసినవన్నీ, ప్రత్యక్షంగానే ఎందుకు అడగలేకపోయారు? (ప్రశాంతంగా) రఘుపతి ఎవరినయినా ప్రేమించి వుండిన విషయం నిజమే అయివుండవచ్చు. కానీ...(కీచు గొంతుకతో) నన్ను మాత్రం కాదు.

జాని : (కోపంలో) చంచలా! ఇహ చాలించు నీ అబద్ధాలు. వాడిమీద మత్తుమందు చల్లింది నువ్వు. సాలెగూటిలోని పురుగులాగా వాణ్ని కబళిస్తున్నది నువ్వు. నువ్వు; నువ్వు ఈ ప్రళయానికి, ఈ నాశనానికి కారణం కాదా? ఒప్పుకో! ఒప్పుకో చంచలా!

చంచల : మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను ఇవన్నీ అబద్ధాలని. మీరు మాట్లాడుతున్న విషయంతో నాకేమీ సంబంధంలేదని వినడంలేదూ మీరు? కాదు, వినలేరు. నిజమే మరి! మూర్ఖుని మనసు రంజింపరాదు. సరే! వెళ్తున్నాను. (కొంత దూరం వెళ్ళి, మళ్ళీ వెనక్కు వచ్చి) ఒక్క మనవి. ఆరోగ్యం విషయంమాత్రం ఎవరి చేతనైనా కబురుచేస్తూండండి. వస్తాను.

జాని : (పెద్దగా) ఆగు.

(వెళ్తున్న చంచల కొస్తా ఈ మాట విని ఆగిపోతుంది. జానికమ్మ మొహంలోకి కొంచెంసేపు చూస్తుంది. సూటిగా చూడలేక తప్పును వొప్పుకున్న దానిలాగా తిరిగి వస్తుంది.)

జాని : ఇట్రా. వచ్చి ఆ కుర్చీలో కూర్చో. ఇహ చెప్పు. ఏం జరిగిందసలు? రఘుపతికీ, నీకూ—

చంచల : సమ్మంధం లేదూ, లేదూ, లేదూ అని చెప్తున్నాను. వినిపించుకోరేం?

జాని : సరే. ఈ సంగతి నిజమవునా? కాదా? క్రితం శనివారమంతా రఘు నీ వెంటే వున్నాడు.

చంచల : లేదు. రఘుకూ, నాకూ ఎటువంటి...... మంచిది. అతనూ, నేనూ కలిసి సినిమాకు వెళ్లాం. ఏం వెళ్లకూడదా? అదేమైనా తప్పా? ఇంటిదగ్గర ఎవ్వరూ లేరు. ఏమీ తోచకుండావుంది. మనసులో ఏదో ఆందోళన. నన్నర్థం చేసుకున్న రఘు, నేనెంత బాధపడుతున్నానో తెలుసుకున్న రఘు ఆప్యాయంగా, అభిమానంగా “ఎందుకూ అనవసరంగా నిన్ను నీవు హింసించుకుంటావు? సినిమాకు పోదాం రా. కాస్సేపైనా ఈ ఆందోళనను మర్చిపోతావేమో!” అన్నాడు. సరే నన్నాను. గొప్పోళ్లాంటి ఈ ప్రజలందరూ ఇట్లా, ఇంత నీచంగా వూహించుకుంటారని తెలుసుకుని వుండవలసింది. ఆ సినీమాకు వెళ్లకుండా వున్నా—

జాని : సినిమా అయిపోయింతర్వాత ఇద్దరూ కలిసి మీ యింటికే వెళ్ళారు.

చంచల : అవును. నన్ను ఇంటిదగ్గర దింపి....

జాని : అంతమాత్రమే కాదు. ఆ రాత్రల్లా నీ యింట్లో వెగడిపాడు.

చంచల : సినిమానుంచి వచ్చేసరికే బాగా పొద్దుపోయింది. “ఇప్పుడు వెళ్ళి ముసలావిడ, మీ అమ్మగార్నేం బాధపెట్టాకూ, భోంచేసి వెళ్లండన్నాను.” సరే అని భోంచేశారు. మరి పొద్దుపోయింది.

జాని : వాడు ఇంటికి వచ్చేసరికి తెల్లవారుఝాము నాలుగయింది.

చంచల : మీలాగా మీ అబ్బాయిమీద నాకేమీ అధికారంలేదే, ఫలానా టైముకు రమ్మనీ, ఫలానా టైముకు రావద్దనీ చెప్పడానికి.

జాని : (జాలిగా) వాడు నాతో అబద్ధాలు కూడా చెప్పడం నేర్చుకున్నాడు. (పేలవంగా) ఆ రాత్రి వాడి స్నేహితుడి కెవడికో ప్రాణం మీదకు వచ్చిందట. అందువల్ల వాడక్కడ వుండవలసివచ్చిందట. హు! (తీవ్రంగా) వాడి యీ పతనానికి నువ్వు కాదూ కారణం? నువ్వు!!

చంచల : మీ అబ్బాయి మీతో నిజమే చెబుతున్నాడో, అబద్ధమే చెబుతున్నాడో తెలుసుకోనవలసిన అవసరం నాకు లేదు.

జాని : అవసరం!! సిగ్గులేనిదానా! అవసరం వున్నంతవరకే వాణ్ని ఉపయోగించుకుంటున్నావు... ఎల్లా పెంచాను వాణ్ని! ఎంత బుద్ధిమంతుడు నా పిల్లవాడు! నీ చపలత్వాన్ని, నీ చంచలత్వాన్ని, నీ అలంకారాన్ని, నీ పౌడరు మొహాన్ని చూసి, మోసపోయి...రఘూ!

చంచల : (గాద్గదికంగా) జానికమ్మగారూ! నన్ను తిట్టగానే పండుగ అయిపోయిందనుకోకండి. మీరీనాడు నన్నన్న మాటలన్నీ, రఘుతో నే చెప్పకపోను.

జాని : ((ప్రశాంతంగా) చెప్పవు. నా రఘుతో, నువ్వీనాడు మన యిద్దరిమధ్యా జరిగిన సంభాషణను గూర్చి ఈషణ్మాత్రంగానైనా చెప్పలేవు. ఇహ ఈ జన్మలో నువు రఘును కలుసుకోలేవు.

చంచల: భగవంతుడా! రఘును—నా రఘును నేను కలుసుకోలేనా?

జాని: అంతే కాదు, రఘును కలుసుకోనని, రఘుతో మాట్లాడనని, నాతో నువు ప్రమాణం చేసి చెప్పేవరకూ, ఈ గదిలోనుంచి నువు బయటకు, అడుగు పెటలేవు.

చంచల: చూస్తాను. అదీ ఎంతవరకో చూస్తాను.

జాని: (కంఠస్వరం మార్చి, ఉద్బోధిస్తున్నట్లుగా) ఆలోచించుకో చంచలా! త్వరపడి నిర్ణయాలకు రాబోకు. బాగా ఆలోచించుకో. ఇదివరకు ఎంతగౌరవంగా, ఎంత నమ్రతగా, ఎంత సుకుమారంగా వుండేదానివి! ఏవీ ఆ లావణ్యమూ, ఆ వినయమూ, ఆ సంస్కారమూ అన్నీ ఏవీ నీలో ఇప్పుడు? ఇంతగా మారిపోయావేం చంచలా? రాముడూ, నువ్వూ ఒక వయసు వాళ్ళు కదూ? ఇద్దరూ ఎంత ముద్దుగా, చిలకా గోరింకల్లా వుండేవాళ్ళు!! మంచి వాళ్ళనే భగవంతుడు తనలో ఐక్యం చేసుకుంటాడుట! నువ్వూ నేనూ మిగిలాం, వడిలిపోయిన పూవుల్లాగా బ్రతికినా చనిపోయినవాళ్ళతో సమానంగా; బాధ లనుభవించటానికి. కదు చంచలా? రాముడు పోయినా, రఘురాముడు నిన్ను పెళ్ళిచేసుకోవడం చూచి ఎంత సంతసించాను!! నీ జీవితం హాయిగా, వసంతంలాగా సాగిపోతుందని ఆశించాను. కానీ నా ఆశలన్నీ నిరాశచేసి రఘురాముడి కన్నుగప్పి, అమాయకుడూ, స్త్రీతత్వం తెలియనివాడూ అయిన రఘుపతితో నువ్వింత నీచంగా ప్రవర్తించడం అన్యాయం చంచలా! చాలా అన్యాయం. దేముడు నిన్ను క్షమించడు. నువు మాకన్నా ధనవంతురాలివి. చదువుకున్నదానివి. తిరుగ నేర్చినదానివి. నువ్వూ ఇలాగేనా ప్రవర్తించేది? ఆలోచించు చంచలా! బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రా.

చంచల: నా ఇష్టమొచ్చినట్లు నేను చేయడానికి నాకు సంపూర్ణమైన అధికారం వుంది.

జాని: నిజమే నిన్ను నీవు నాశనం చేసుకోడానికి నీకు సంపూర్ణమైన అధికారం వుంది. కానీ, అభం, శుభం తెలియని రఘును, నా బంగారాన్ని, నువ్విట్లా నాశనం చేయడానికి నీ కేమాత్రం అధికారం లేదు.

చంచల: పాపం! అరటిపండు వొలిచి నోటికందించినా, అందుకోలేడు మీవాడు. (నవ్వుతూ) జానికమ్మగారూ, రఘు మీరనుకొన్నంతటి అమాయకుడూ, లోకజ్ఞానశూన్యుడూ కాదు. నేనేమీ అతన్ని అన్యాయం చెయ్యడం లేదు.

జాని: చెయ్యడం లేదూ?—ఎంత సంగనాచిలాగా మాట్లాడుతున్నావు?—వాడు సంపాయించిన డబ్బంతా ఏ సముద్రంలో కలసి పోతున్నదట? వాడి కష్టాన్ని ఎవరు అన్యాయంగా అనుభవిస్తున్నారట?

చంచల: (ఒక్కసారిగా విజృంభిస్తూ) ఓహో హో! అయితే ఇదన్నమాట మీ బాధకు కారణం? రఘుపతి నా కేవిటో త్రవ్వి తలకెత్తుతున్నాడని...హ...హ...అతడు నా కోసం ఖర్చు పెట్టింది ముష్టి పదిరూపాయలు లేదు.

జాని: ముష్టి పదిరూపాయలు!! ఎంత తేలిక అయిపోయిందీ డబ్బు నీకు? ఈనెల, తన జీతంలో నాలుగోవంతు వాడు ఇంటికి తెచ్చిన పాపాన బోలేదు. ఈ డబ్బంతా ఎవరికోసం ఖర్చు పెడుతున్నాడట? అప్పులు తీర్చవలసి వచ్చిందట?—అప్పులు!! మా యిద్దరికీ వున్న అప్పులేవిటో మరి?!

చంచల: (వెటకారంగా) చదువుకున్నవాడు, సంపాయిస్తున్నవాడు, యువకుడు, అటువంటి వాణ్ణి పట్టుకుని, జమా ఖర్చులు చెప్పమనడం, మీదే పొరపాటు జానికమ్మగారూ! మీ రలా అడగకూడదు.

జాని: ఎందుకనీ?—ఎందుకని అడగకూడదు? వాడు తప్ప నాకేవిటి మిగిలింది? వాడే నా ప్రాణం, నా ఆస్తి, నా జీవన సర్వస్వం, వాడే. వాడే అన్నీ. అన్నీ నాకు వాడే. ఈ వార్ధక్యంలో, ఆరిపోతున్న దీపానికి కొంచెం నూనె పోయడానికి, ఎవరున్నారు వాడు తప్ప

చంచల: అర్థమైంది మీ బాధ—మంచిది. రఘుపతి తన గృహబాధ్యతను తాను సవ్యంగా నిర్వర్తించుకొనేటట్టు నేను చూస్తాను.

జాని: నువ్వా? నువ్వు రఘుపతినిగూర్చి శ్రద్ధ వహించడమా! ఎంతటి దుర్గతి పట్టింది!! ఇంకా నేనంత అసమర్థురాల్ని కాలేదు. వాడు పిచ్చివాడిలాగా నీ వెంటబడి—

చంచల: రఘు తన సంపాదనలోంచి చిన్నమొత్తం నాకోసం ఖర్చుపెట్టనవసరం లేదు.

జాని: సిగ్గుమాలినదానా! ఎంత నీచంగా మాట్లాడుతున్నావు?

చంచల: మాటలు జారకండి. మీ మనసులోని దేవిటో స్పష్టంగా చెప్పివేశారు. మీకు కావలసింది డబ్బు. ఆ సంగతి నాకు బాగా అర్థమైంది.

జాని: ఈ జన్మకిక రఘును చూడలేవు ఆ సంగతి కూడా బాగా అర్థంచేసుకో.

చంచల: హు! అవన్నీ వ్యర్థప్రయత్నాలు. మమ్మల నెవ్వరూ వేరుచెయ్యలేరు.

జాని: నేను చేస్తాను.

చంచల: ఏం చేయగలరు మీరు? రఘుపతిని కాళ్ళావేళ్ళాబడి బ్రతిమలాడుకుంటారు. అంతేనా? కానీ అతను మీ మాట వినడు. ఇలా మీ మొదటి ప్రయత్నం విఫలం కాగానే లోకాన్ని మా మీదకు వుసిగొల్పుతారు. ఆహా. నిరాక్షేపణీయంగా చెయ్యవచ్చునాసని దారివెంట ఏనుగులు నడుస్తుంటే పిచ్చికుక్కలు మొరుగుతుంటాయి. జానికమ్మగారూ, నేను మళ్ళీ, మళ్ళీ చెబుతున్నాను. మీవన్నీ వ్యర్థప్రయత్నాలు. నన్నూ, రఘునూ బ్రతికివుండగా ఎవరూ వేరుచెయ్యలేరు.

జాని: అస్సాంలోవున్న మీ ఆయనకు ఉత్తరం రాస్తాను.

చంచల: (క్షణకాలం తొట్రుపడి) ఆయనకు ఎప్పుడో తెలుసు ఈ సంగతి.

జాని: ఏ...ఏ...టి?

చంచల: అవును. ఆయనకు తెలుసు. ఎప్పుడో తెలుసు. నేనే చెప్పాను. ఈ విధంగా ఒకళ్ళనొకళ్ళు విడిచి దూరదేశాల్లో వుండటమే గనుక తప్పని సరి పరిస్థితి అయితే, ఈ వివాహంవల్ల ప్రయోజనం లేదని. ఆయన ఆ ఉద్యోగం మానలేడు. నేను రఘుపతిని విడిచి వుండలేను. అందుకనే ఆయనా, నేనూ విడాకులు పుచ్చుకోడానికి నిర్ణయం చేసేసుకున్నాం. ఆ తర్వాత, ఇహ జరగవలసిందల్లా, రఘుపతీ నేనూ—రిజిస్ట్రారాఫీసులో—

జాని: (నిశ్చింతగా) అది మాత్రం జరగదు.

చంచల: తప్పక జరుగుతుంది.

జాని: జరగదు. జరగటానికి వీల్లేదు. ఈ పెళ్ళి, ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదు. నువు, రఘుపతిని చేసుకోడానికి వీల్లేదు.

చంచల: ఎందుకని?

జాని: రఘుపతి తప్ప మరెవ్వరూ లేరు నాకు.

చంచల: (హేళనగా) జీవితాంతం, రఘుపతిని మీ అడుపాజ్ఞల్లో వుంచుకుంటా నంటే ఎల్లా? అతని నూరేళ్ళజీవితాన్ని మీ గుప్పిట్లో వుంచుకోలేరు. అతనికీ ఆశలూ, కోర్కెలూ, అభిమానాలూ, సమ్మంధాలూ అనేకం వుంటాయి. అలాగే నాకూనూ!

జాని: అయితే, వాడి జీవితాన్ని నీ కొంగున ముడి వేసుకుంటానంటావ్.

చంచల: ఆహా...యిప్పటికి అంతే జరుగుతుంది.

జాని: (కన్నీళ్ళ పర్యంతమై) ఇప్పుడు గాదు, ఇప్పుడు గాదు నా బాధ నీకు అర్థమయేది, నీకూ వార్ధక్యం మీదపడి, వున్న ఒక్క గానొక్క కొడుకూ మరో యువతి నాశ్రయించి నిన్ను నిర్లక్ష్యం చేసినప్పుడు, అప్పుడూ!!

చంచల: శపిస్తున్నారా. అంతటి క్రూరులమేమీ కాము మేము. రఘుపతీ, నేనూ మిమ్మల్ని కంటికి రెప్పలా చూచుకుంటాం.

జాని: అంతటి హీనస్థితి, ఒకరి దయాధర్మాలమీద ఒక పతితురాలి పంచలో బ్రతుకు గడపవలసినస్థితి నాకింకా రాలేదులే. (ఆమె దృష్టి అనాలోచితంగా నే 'విషం' అని చీటీ వున్న సీసామీద పడుతుంది.)

చంచల: సరే. మంచిని అర్థంచేసుకోలేనివారికి నేను మాత్ర మేం చెప్పగలను? (కొద్దిమౌనం) రఘుపతి ఇంటికి వచ్చే వేళయిందనుకుంటాను.

జాని: ఆరు దాటింది.

చంచల: ఇంకా రాలేదు. సరే ఇహ అతనికోసం ఇక్కడ నేను కనిపెట్టుకుని కూచోలేను.

జాని: (తనధోరణిలో) పెళ్ళి—హు? ఎవరన్నా అనుకున్నారా తిరిగి నువు రెండోసారి వివాహం చేసుకోటానికి సిద్ధపడుతున్నావని. మా కాలంలో ఈ ప్రేమలూ, ఈ పెళ్ళిళ్ళూ, భర్తలను వరించుకోడాలూ, వదిలిపెట్టడాలూ మాకు తెలీదు. ఎంత అణకువ! ఎంత వినయం! ఒకసారి అగ్ని సాక్షిగా వివాహం చేసుకున్న తర్వాత, ఎన్ని బాధలు పెట్టినా, ఎంత నికృష్టుడయినా, అతనికే మా జీవితాన్ని అంకితం చేసేవాళ్ళం. కొడుకులూ, కూతుళ్ళూ, మనుమలూ, మనుమరాళ్లూ అంతా వోబాదరాయణ సంబంధం. తామరతంపర. ఇప్పుడు మీరంతా చదువుకున్న వాళ్లు కదూ? తెలివిగలవాళ్ళు. అవునా? చెట్టు చెడి

పోయేముందు వేసిన కుక్కమూతి పిందెలు మీరంతా. పిదప కాల మెచ్చి పడింది. కొడుకులతో, కూతుళ్ళతో ఎంత సంతోషంగా కాలం గడపవచ్చు! ఆ తల్లికి అంతకన్నా ఏం కావాలి? చంచలా—కనీసం ఒక్క కొడుకైనా కనీసం నీకు పుట్టివుండవలసింది. అప్పుడీ పాపపుపని చేసివుండేదానివి కాదు.

చంచల : ఛా! ఛా! వాళ్ళంటేనే నాకు అసహ్యం. కుటుంబ నియంత్రణం ఎంత మంచిది.

జాని : కానీ రఘుకు పిల్లలంటేనే పంచప్రాణాలు.

చంచల : అలా అని చెప్పి రఘు నా అందాన్నే మీ నాశనం చెయ్యాడు. (భయంతో) అంతకన్నా మరణమే మంచిది.

జాని : పిరికిపందలు! పిల్లల్లోవున్న ఆనందం, ఆ దైవత్వం మీకేం తెలుసు? యధార్థాన్ని ఎదుర్కొనే ధైర్యంలేనివాళ్లు. ఇటువంటి వాళ్లకు ప్రేమలు! ప్రేమ!

చంచల : అవును. ధైర్యంలేనివాళ్లమే మేము. కాదు మరి? ఇంత వికృతంగా ఆలోచిస్తున్న అనాగరికులు మన్య తలరాతకు తిరగడం ధైర్యం కాదు, పిరికితనం. కాదు మరి?

జాని : అది ధైర్యం కాదు తప్పిదం. భరించలేని పాపం!

చంచల : మీ కాలంలో. ఇప్పుడు పాపమూ లేదు, పుణ్యమూ లేదు. విలువల స్వరూపమే మారి పోయింది.

జాని : కానీ అన్ని కాలాలకూ పనికివచ్చే, సర్వజనులకూ వర్తించే విలువలు కొన్ని ఎప్పుడూ వుండనే వుంటాయి. ఉదాహరణకు నీలా కాలు జారినవాళ్ళనే తీసుకో. ఏ కాలంలోనూ అది దోషమే. ఇప్పుడూ అది దోషమే.

చంచల : కానీ ప్రేమించుకోవడం వ్యభిచారం కాదు.

జాని : ఇది ప్రేమకాదు. పశుచర్య. ప్రేమ అన్న ఒక భ్రమ, ఆత్మవంచన.

చంచల : ఆ సంగతి మీకన్నా నాకే బాగా తెలుసు.

జాని : (గద్గదికంగా) రఘు, నా రఘు నా వరాల తండ్రి, ఇల్లా చేస్తాడని కలలోగూడా వూహించలేకపోయాను. కనీసం నిన్నుగాక మరెవర్ని ప్రేమించినా సహించేదాన్ని. నీలాంటి పతితురాల్ని, భర్త వుండగానే మళ్ళీ పెళ్ళికోసం ప్రయత్నిస్తున్నదాన్ని, బిడ్డలు వద్దని తపస్సు చేసేదాన్ని—నే నంగీకరించలేను. ఊహూ...అంగీకరించలేను.

చంచల : ఆవేశపడకండి. జరిగిందంతా మర్చిపొండి. అందరం స్థిమితపడి, నో క్రొత్త జీవితాన్ని ప్రారంభిద్దాం.

జాని : ఆయనే బ్రతికివుంటే?—రఘుపతి నిట్లా గాలికి వదిలిపెట్టేవాడేనా? వ్యవహారం తుదకంటా తేల్చుకుని, వంశగౌరవం నిల్పేవాడు. నేనేం చేయను? ఆడదాన్ని. ముసలిదాన్ని (బాగా చీకటిపడడం చూచి) అంతే. ఇహ ఈ చీకటే నాకు మిగిలిపోయింది. ఏం చేయను? ఈ ముసలితనంలో, కాఫీనీళ్లన్నా ఇచ్చేవాళ్ళు లేకుండా, నా రఘును నానుండి దొంగిలిస్తున్నావు.

చంచల : రఘును దొంగిలించినా, కాఫీనీళ్ళకుమాత్రం ఇబ్బంది రాదు లెండి. నేను కలిపి తీసుకురానా?

జాని : ఎంత మంచిదానివి! అదిగో ఆ ప్రక్కగదిలో ఫ్లాస్కులో పాలున్నాయి. స్టౌవ్ మీదవున్న కెటిలులో డికాషనుంది. పంచదార సీసా, ఆప్రక్కనే అలమరలోవుంది. కలిపి తీసుకురా. కనీసం ఈ ఒక్కమంచిపని అయినా చెయ్. పైలోకంలోనన్నా సద్గతి కలుగుతుంది.

చంచల : పైలోకాలకోసం కాకపోయినా, కనీసం నా రఘుకోసమయినా ఈ పనిచేస్తాను. (లోపలికి వస్తుంది) జానికమ్మ టేబిలుమీది వస్తువులన్నింటినీ వోపికగా సర్దుకుంటుంది. పర్దటంలా ఆమె మరోసారి 'విషం'అని రాసివున్న ఆ సీసాని చూస్తుంది. చేతిలోకి తీసుకుని దాని వేపే తదేకంగా చూస్తూంటుంది. ఆమెలో గంభీరత. ఏవో ఆలోచన. పెదవుల కదలిక. చిరునవ్వు. ఆమె జాగ్రత్తగా ఆ సీసా మూతవేసి అందులో వున్న మందును సగానికి పైగా ప్రక్కనున్న మరోసీసాలోకి పోస్తుంది. మళ్ళీ మూతపెట్టి ఆ సీసాను యధాస్థానంలో వుంచుతుంది.)

జాని : (చంచల రావడం చూచి) అవసర సమయాల్లో కానీ, ఎవరి నిజస్వరూపాలూ బయటపడవు.

చంచల : నిజరూపాలు బయటపడినతర్వాతనయినా సామరస్యంతో సర్దుకుపోగలిగితే అంతకన్నా కావలసిందేమీ లేదు. (కాఫీగ్లాసు పెట్టడానికి ఆ మందుసీసాలను సర్దుతూ) ఇదేమిటీ సీసాలన్నింటినీ ఇలా పెట్టారు? కొన్ని సీసాలను అవతల పెట్టమంటారా?

జాని: అబ్బెబ్బే! ఆ సీసాలనేమీ ముట్టుకోబోకు. (ప్రశాంతంగా) ఒకరిచేత పని చేయించుకోవడమన్నది ఎంతటి బాధాకరమైన విషయమో నీకు తెలీదు. ఆఁ! ఆ కాఫీగ్లాసు ఇలా ఇయ్యి. రఘుపతికూడా త్వరగానే వచ్చేస్తాడ్లే. మొన్న జబ్బుపడినప్పటినుంచీ వాడికోసం కనిపెట్టుకు వుండడం మానేశాను.

చంచల: నే నున్నానుగా.

జాని: ఎందుకూ అనవసరంగా! నువ్వూ కాఫీ తీసుకో. అబ్బ! చలిగా వున్నట్టుంది. ఆ కిటికీ తలుపులు కూడా దగ్గరకు వేసిరా! జాగ్రత్త. వేళ్లు నలిగిపోయేను. (చంచల వెళ్లి తలుపులు దగ్గరకు లాగివస్తుంది) ఆఁ! అదీ, అల్లా చెయ్యాలి చెప్పిన పని. మంచివాళ్ళ లక్షణం కూడా అదే. పెద్దవాళ్ళను గౌరవించడం.

చంచల: (కాఫీ తీసుకుంటూ) డికాక్షన్ ఎక్కువైనట్టుంది.

జాని: పర్వాలేదు. అట్లా వుంటేనే కాఫీ కమ్మని వాసన వేస్తుంటుంది.

చంచల: ఇప్పుడెలా వుంది వొంట్లో? చలి తగ్గిందా?

జాని: కాఫీ తాగింతర్వాత కూడానా? (ఆమె చంచల కాఫీగ్లాసు పూర్తిచేయడం చాలా జాగ్రత్తగా పరిశీలిస్తుంటుంది. ఆ తర్వాత ఒక్కసారిగా పెద్దపులిలాగా ఆమెను లక్షిస్తూ) ఇప్పుడెలా వుంది నీ వొంట్లో? పైత్యం తగ్గిందా? రఘును పెళ్లి చేసుకుంటావా? పాపం! చేసుకో!! ప్రేమించావూ? ఎవర్ని? రఘు నేనా? ప్రేమించు. బాగా ప్రేమించు. కళ్ళు బైర్లు క్రమ్మేవరకూ ప్రేమించు!! దుర్మార్గురాలా! ఒక్క క్షణం, మరొక్క క్షణం నీ జీవితం!!! ఈ సీసా చూశావా? ఇందులో వున్నదేమిటో తెలుసా? విషం!!! నువ్వు తాగిందేమిటో తెలుసా? విషం!!! ఎట్లాగో తెలుసా? ఆ సీసాలో విషాన్ని నీ కాఫీలో కలిపాను. సీసాలో మందు సగానికే లేదూ, కనబడడం లేదూ?

చంచల: (అరుస్తుంది) ఏమిటీ?...(గొంతును గట్టిగా నొక్కుకుంటూ) విషం!...అయ్యొయ్యో... విషం!! విషం!!! నా గొంతు మండుతోంది. నా కడుపులో పేగులు కరుగుతున్నాయి. మంట! భరించలేని మంట! అయ్యొయ్యో విషం! విషం!!

జాని: అవును. విషం! నీ నరనరాల్లో విషం! నీ మనసు విషమయం! నీ రక్తం విషమయం! ఇంకా సందేహిస్తున్నావా? చూడు. ఈ సీసాలో ఇదివరకు నిండావున్న విషం, ఇప్పుడు సగానికే వుండడం కన్పడడంలేదూ?

చంచల: అయ్యొయ్యో! విషం! విషం! నన్ను రక్షించండి. రక్షించండి. నేను చచ్చిపోతున్నాను. చచ్చిపోతున్నాను.

జాని: అవును. చచ్చిపోతున్నావు. విషప్రయోగంచేత చంపబడుతున్నావు.

చంచల: భగవంతుడా! భగవంతుడా! నన్ను...నన్ను రక్షించు...భ...గ...వం...తు...డా!!

జాని: మరణానికి భయపడుతున్నావా? ఇప్పటికైనా వొప్పుకో. నువ్వొక పిరికిపందవు. నీలో గొప్ప లక్షణం, ధీరగుణం ఒక్కటి లేదు. అందరిలాంటి దానివే నీవూనూ. ఆ కారణంగానే అందరి వలెనే, అతిసామాన్యంగా నువ్వూ మరణించబోతున్నావు. పాపానికి ప్రాయశ్చిత్త మేమిటో తెలుసా? మరణం! మరణం! నికృష్టమైన మరణం!!

చంచల: ఇందుకు...ఇందుకు...తగిన ప్రతిఫలం అనుభవించకపోవులే. దే...వు...డు...న్నా...డు. సర్వసముడు!! (అలాగే క్రిందికి వాలిపోతుంది.)

జాని: (మెల్లగా ప్రశాంతంగా) చంచలా! చంచలా!...నువ్వేనా రఘును ప్రేమించింది!! ఇంతటి బేలహృదయంతోనే? మరణమన్న మాట విని మూర్ఛపోయినదానివి, ప్రేమించగల శక్తి, ఎక్కడ నీలో? పిచ్చిపిల్లా!!! (చంచల అలాగే నిర్జీవంగా పడివుంటుంది. జానికమ్మ పేలవంగా నవ్వుకొని, తిరిగీ తలనిండా దుప్పటి కప్పుకొని, అవయవాలను కూడదీసుకుంటూ, కళ్ళు మూసుకోబోతుండగా)

(తెర)

---

* "టు ఉమెన్" అన్న నాటికలోని శిల్పాన్ని మాత్రం ఇందులో గ్రహించాను. అందుకా నాటికా రచయితకు నా కృతజ్ఞతలు.

# కోకిలమ్మ పెళ్ళి

శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు చాల నాళ్ళక్రిందట ముద్దుగా వ్రాసిన మోహన గాథ యిది. ఎందుకో గాని కిన్నెరసాని పాటలను చెప్పుకొన్నట్లుగా దీని నెవ్వరు చెప్పుకొనగా నేను వినలేదు. ధైషణ్యము ప్రబలిన నేటివారల కచ్చపు కవిత్వ మనుభవించు శక్తి చాలకపోవుచున్న దేమో అనుకొందును. పసిపిల్లలవంటి మనసుగలవారికి, ఎదపదును తగ్గనివారికి, హృదయమును ప్రత్యగ్రముగ నుంచుకొన్నవారికి ఈకథ రసనిష్యంది; గుండెలో సూదులుగ్రుచ్చి గుబగుబల గరగించి గుసుగుళ్ళు చుట్టించి ఘూర్ణిల్ల జేయును.

ఈ కథలో కోకిలమ్మపెండ్లి ఈ జన్మలో జరుగలేదు. మరుజన్మలో జరిగినది. ఇందులోని రహస్యమేమి? కవి యెందుకిట్లు కల్పించినాడు? ఈ సందేహ మొకటిబాధించును.

తొలుజన్మలో కోకిలమ్మ మూగపిల్ల. దైవమే దానిని చిన్నచూపు చూచినాడు. తల్లిదండ్రుల ప్రేమగూడ తావన్మాత్రమె. తనంతట తాను బ్రదుకుటకు గూడ సాధ్యము లేకపోయినది. చిలకమ్మ చిలిపి నవ్వులు, వెక్కిరింతలు, వేళాకోళాలు; కన్నతండ్రి కసుబుస్సులు; అప్పుడప్పుడు అమ్మ విసుగులు—వీనితో కోకిలమ్మ మూగమనసు వాగావిష్కృతి లేక తల్లడిల్లి తపించిపోయినది. తల్లి మనసుగూడ తల్లటపడియుండు ననుకొనుడు. కోకిలమ్మ ఈ వేదనారూపమగు తపస్సునకు ఫలముగా మరుజన్మమున మధురకంఠముతో తాను పోక్కుళ్ళు పోయిన అడవిలోనే పిట్టగా బుట్టి వచ్చినది. ఆ జన్మమున ఆ వేదనయే లేనిచో కోకిలమ్మకీ జన్మమున నింత కంఠమాధుర్యమే వచ్చియుండదని కవి భావము.

ఈ కథాకల్పనమున కొంత ప్రతీక సంవిధానము (Symbolical rendering) ఉన్నది. ఇందలి తెలుగు రాజు ఏ శాతవాహనుల కాలము వాడో కావచ్చును, ఆ రాజు స్థానికమగు నుజ్జ్వలమూర్తిని కవి ఇట్లు వర్ణించుచున్నాడు :

'వెదురులో ముత్యాలపేరులు
కదురులో దారాల బట్టలు
ఎదురుగా నెలపొడిచినట్లే
ఏపు మీరెడోయ్!'

మరి చిలకమ్మ పచ్చనిది. కోకిలమ్మ నల్లనిది. ఆర్యజాతులవారు చిత్రవర్ణ విలసితులు. దేవజాతులవారిని చిత్రవర్ణవిలసితులుగ జూపుట నాట్యధర్మనిర్దేశము. సంస్కృతము నార్యభాషయని దేవభాషయని వ్యవహరింతుము. ఈ కథలోని చిలుక వైదిక బ్రాహ్మణుని వలచి తనవంశములో సాంస్కృతిక వాక్కులు నిలుపుకొన్నది. కోకిల నలువైపు సంస్కృత భాషా ప్రభావము చేరరాని తెనుగు తీపిని సంతరించుకొన్నది. 'చిలక పలుకులు' 'కోకిలపాట' లు వేదానువాకములు, జానపదగీతులకు ప్రతీకలు.

తెనుగుపాట పుట్టుకయే ఈ కథ. తెనుగు సంస్కృత జన్యమని కొందరు, కాదు ద్రావిడభాషయని కొందరు ననుచుండగా తెనుగు ప్రాకృతజన్యమను మరియొక యవాంతరవాదముగూడ నుండుట మన మెరిగినదే. ఏమైనను తెనుగునాట సంస్కృతవ్యాప్తిలేని నాళ్లలో ప్రాకృత ముండిన మాట నిజము. ఈ రెండింటి నడుమ తెనుగుభాష ఒకతీపు సంపాదించి జాను తెనుగై పుట్టి వచ్చినది. ఆ భాష పుట్టుక యెట్టిదైనను దాని ప్రత్యేకత సొగసు అంతయు నది తెనుగుగడ్డపై నుండుటచే వచ్చినది. అచటి నేల నీరు గాలి—సర్వ ప్రకృతియు దానికి దోడుపడినవి. ఈ ప్రాదుర్భావము నే కవి ఈకథలో నిక్షేపించి చెప్పినాడు.

ఏ మూగతనము పోవుటకై తల్లి బిడ్డలు బ్రదికినంతకు వేదన పాలైరో దేని నాకాంక్షించిరో ఆ మధురవాక్కు మరుజన్మమున నచ్చపు సంస్కారరూపముగా కోకిలమ్మకు ఫలించినది. అది ఆ యిద్దర తపఃఫలమే గాదు. తెనుగునాటి సర్వప్రకృతియొక్క తపఃఫలమును.

కథా దృష్టితో జూచినచో కవి యిందు తటస్థ చారిత్రుడు. ఆయనకు తెనుగుపై నెంత ప్రేమడియో సంస్కృతముపై నంత ప్రేముడి యున్నది. ఇతివృత్తవశమున కోకిలనుగూర్చి యెక్కువగా జెప్పినాడే కాని పాక్షిక దృష్టిచే గాదు. చిలుకమ్మనుగురించి యెక్కువ విరుగుడు మాటైన ఆడకపోవుటయు, కథనుపసంహరించునపుడు 'చిలుకతల్లి మహాన్వయంబున

వెలసినవి సాంస్కృతిక వాక్కులు' అని సగౌరవముగ చెప్పుటయు కవి ఈ నిర్మమత్వమునే చూపును.

ఇంక లోని మాట ఏమనగా నిజమునకు కవి తన మనసు పెట్టినది చిలకమ్మ మీదను గాదు కోకిలమ్మ మీదను గాదు. తెనుగుగడ్డమీద. అచటి సర్వప్రకృతి మీద. ఏ తద్గంధసంవాసిత మాయన యాత్మ. దానినే ఆయన రెండు దశాబ్దులకుపైన రాజనాలపంటగా పండించుచున్నాడు.

ఇందలి స్థాయ్యాది విషయము లెట్టివో, ఈ కథా రచనలో కవి యాత్మికముగ నేమి సాధించెనో ఇంచుక పరిశీలింతము.

## 2

కవిహృదయము తెలియుట కష్టము—కవి స్వరూపనిరూపణ మంతకంటె కష్టతరము. ఈ కథలో కోకిలమ్మ మూగపిల్ల. తండ్రికి చిలుకమ్మపై ప్రేమయే గాని దీనిపై లేదు. తల్లి దానికి తాత్కాలికాశ్రయము. అదియు నొకచో దప్పును. లోకమున నందరితో బాటుగా భగవంతు డామెకు అందచందము లీలేదు సరిగదా నోరైన నీలేదు. ఉండవలసిన తలిదండ్రుల వాత్సల్యమును చిలకమ్మ ఆచికొనగా కోకిలమ్మకు ఔదాసీన్యము మిగిలినది. పైగా చిలకమ్మ నవ్వులు వెక్కిరింతలు చిన్నపుచ్చుచు అహంకారమును కలచి వేధించినవి. ఏది లోకమున సర్వులకు ప్రాయికముగ జన్మసిద్ధమో అట్టి వాగభివ్యక్తి లేకపోవుటయే కష్టము. నసారక్తముల బంచుకొని పుట్టిన బిడ్డపై మనశ్శరీరగాఢముగ వెలసెడి తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యములు లేకపోవుట మరింత కష్టము. పోనిండు— ఊరక తినగాగన తాను బ్రదుకుటకు కూడ వీలులేదే! నవ్వులు, వెక్కిరింతలు! అన్యుల యపచారమును క్షమింపవచ్చును. ఆత్మీయుల యపచారము క్షమింప రానిది; సహింపరానిది. ఓహో! ఇదేమి కష్టము! ఇంత కంటె కష్టముండునా? నిత్యప్రత్యగ్రముగ ఆ పసిదాని మనస్సు నారక వేదన నందియుండవలెను; దాని శోకము నిర్గమన మార్గములేక యచటనే స్తంభించి గడ్డకట్టి మూగతనము భజించి యుండవలెను. ఈ కథ యందలి శోకస్థాయి యిట్టిది. అది శోకమనియు నది మనలోని కరుణను వ్యంజించుననుట కేవలమూపచారికము. గుండెపిండివైచు ననుట లెస్స.

ఈ కథలో కవి నిర్వ్యాజ కరుణారసమూర్తి. ఇందలి రసము కరుణము. కోకిలమ్మ శోకవిగ్రుతికి తనవలెనే మూగదైన ప్రకృతి కరుణజూపినది. అదియే దానికి తల్లిగా తండ్రిగా తలపుచుట్టముగ భాసించినది. మనుష్యహృదయముకంటె మిన్నగా పరగత సుఖదుఃఖాది భావనచే భావితాంతఃకరణత్వము జూపి కేవల సత్త్వమూర్తియైనది. గిలకవలె కోకిలమ్మ పోకిళ్ళు పోయిననే ఆ యడవి కంపము. అది తాగిననే తాను మాడిననే అచటి సెలయేటి నీటికి చెలువము. అది యచటి చిగుళ్లు చిదిమిననే వానికి రక్తి. అది గిల్లిననే అచటి పూల కందము. దాని యుల్లాసము ప్రకృతి కుల్లాసము. దానిశోకము ప్రకృతికి శోకము. ఇది వారి ఆత్యంతికమగు హృదయసంవాదము. ఇట్టి కల్పన నింగ్లీషున నలంకారమాత్రముగగాక కొంచెమెక్కువ దృష్టితో 'పాథెటిక్ ఫాలెసీ' (Pathetic Fallacy) అందురు. మనవారు ప్రకృతిని భావమున కుద్దీపకముగ గ్రహించిరేకాని దానికి సొంతముగ వ్యక్తిత్వము నీలేదు. అలంకార మార్గమున సన్నివేశోచితముగ శిల్పమును దృష్టియం దిడుకొని తత్తద్భావారోపణము చేయుట కలదు—సరి.

ఈ కావ్యమున కవి కోకిలమ్మ కరుణామయ జీవితగాథను, దాని యాత్మస్థమగు వేదనాగీతి నావిష్కరించినాడు. దానిలో ప్రకృతి వట్టి నేపథ్యమాత్రముగ నుండుటగాదు. ప్రధానపాత్రగా నున్నది.

ఒక దృష్టికీ కావ్య మంతయు నొక గొప్ప స్వభావోక్తిపిహితము. డింభకాదులయు వన్యమృగములయు తత్తద్వ్యాళా సహజములగు భాషా చేష్టాదికము, భావముల ప్రకోపము, మహాకవికే భావనాసాధ్యములు. అట్టిచో కథలోని చేతనాచేతనముల యాత్మల నావిష్కరించుట తదితరుల పరామర్శకందనే యందదు. ఇందు స్వభావోక్తి అలంకారమాత్రముగ నెన్నిచోటులనైన నుండవచ్చును. అదిగాదు నే జెప్పునది. జడబద్ధగతాది విశేషములతో యాంత్రిక ప్రవృత్తి గలదిగా చెప్పబడు చున్న సర్వప్రకృతిని మనసున నిలిపి దానితోడి సంవాదము నెరపి కథలో దానిని నేపథ్యపు తెరగా దీర్చుటయే గాక భావప్రచలితమగు వ్యక్తిగ రూపుగట్టించుట ఒక్క మహాకవికే సాధ్యము. ఏ క్షణమున ఏ చోట ప్రకృతి ఏ భావస్ఫూర్తిగలిగి చైతన్యము నెరపునో తద్భావసంక్రాంతి వైలక్షణ్యమెట్టిదో అట్టి దానిని, తరులతాగుల్మశిలానిర్ఝరముల నొదిగియుండు దానిని, కాలప్రచోదిత పరివర్తనశీలమైనదానిని—తన యాత్మలో నణువణువున ననుభవమునకు దెచ్చుకొని దానియాత్మను దర్శించుటకు కవి హృదయమున నహంకారము పూర్తిగా నశించి యాత్మ వెన్నముద్దవలె నుండవలెను. దీనిచే కవికొక శక్తి గలుగును. దానిని మనము తాదాత్మ్యమని వ్యవహరింతుము. తనదిగానటువంటి—ఎదుటివాని భావకోశములోనికి తన యాత్మను ప్రవేశపెట్టగల ఈ శక్తినే కీట్స్ మహాకవి 'నెగెటివ్

కేపబిలిటీ' అని వ్యవహరించినాడు. అనగా స్వీయాహంకార నిరాసమని తాత్పర్యము. మన కవులు కావ్యారంభమున స్వీయాహంకారనిరాసము చేయుట వినయమాత్రముగ వ్యాఖ్యానించు చాలమందికి రహస్యము దెలియదు. చైతన్యము మనసుదాక నెగదట్టి యహంకారరూపముగ భాసించు హిరణ్యగర్భునియొక్కయు నంతయు నేనే యని సర్వాహంకారమూర్తిగ భాసించు విరాడ్రూపునియొక్కయు సంధికాలమైనది మన కాలము— 'రసాత్మత నూరకనే ప్రసవియించిపోదు' నన్న రసస్రోతోమూర్తి ఈ కవి.

ఈకథ 'లిరిక్' (Lyric) అను పాశ్చాత్యుల మార్గమున వ్రాయబడినది. ఇటాలియన్, ఆంగ్లము మొదలగు భాషలలో నీలలితగీతు లాత్మైకపరములు. ఇవి అనురాగము, విరహము, ఆనందము, కరుణ, ప్రేమము మొదలగు రసభావముల నభివర్ణించును. వీనిలో కథయుండదు. ప్రాయికముగా భావమొక్కటే. కవి యాభావమును గీతికారూపమున విన్యసించుటలో నాభావ వివృతి ప్రసారములకు సంబంధించిన యనేక భావచ్ఛాయలలో విహరించును. ఆ చిరుచాయ లంచులుదీరి యుండవు. ఇదమిత్థమని వాని నేర్పరుప రాదు. ఇది యాతియు నా రచనమార్గము కేవలాత్మికమగుటచే వచ్చిన చిక్కు. ఎందుకనగా ప్రకృతిసంవలితమైన యాత్మ వాసనావశమున నెంతయో సంకీర్ణమగు భావప్రపంచము నిముడ్చుకొనియుండి స్పందితమైనపుడు దాని ననుభవించును. ఆ భావములును వ్యక్తి వైలక్షణ్యరూపమగు సంస్కారవిశేషమువలనను, స్పందనకారకశక్తి బలీయతాసాపేక్షభావమువలనను ఒక్కొక్కచో ననుభవించువానికే ఎఱుక కంది స్ఫుటప్రతీతికి రాజాలవు; తెలివి పొలముల పొలిమేరల నెచ్చటో తెలనూపును. ఎఱుక కందిన స్పష్టానుభవమే వాగ్రూపమున నభివ్యక్తికి వచ్చుట వక్తృసామర్థ్య సాపేక్షభావముచే దుస్తరమగుచుండగా నస్ఫుట ప్రతీతిగల యనుభవము మాట చెప్పనక్కరలేదు. అట్టిచో లలితగీతులందలి భావచ్ఛాయలను స్ఫుటప్రతీతిగల స్థాయి విభావానుభావసంచారుల చాలులో వింగడించుట సాధ్యము కాని పని. కాగా స్ఫుటప్రతీతిలేని ఈ భావచ్ఛాయల మంథనము, ఆవిర్భావము, సంవృతి, నివృతి, సంవాదము, వివాదము, వాని యొరిపిళ్ళు, బంధురత, విశ్లథన మాదిగాగల ఆత్మయొక్క దశాంతరముల నెన్నింటినో ఈ లలితగీతులు వెలార్చును. పూర్వమిది 'లైర్' అను తంత్రీవాద్యముపై—మనవారు వీణపై 'ప్రబంధము' లాదిగాగల వానినాలపించినట్లు—గానము చేయబడుచుండెడివి. తరువాతి కాలమున నీ యలవాటు తప్పినది. ఇప్పుడు ఊరక చదివి కవి హృదయావస్థను సంవాదరూపమున ననుభవించుట మాత్రము నిలచినది.

కోకిలమ్మ పెండ్లిలో కథయున్నదిగదా యనవచ్చును; ఇది లలితగీతి యెట్లగునని యాక్షేపింపనువచ్చును. కాని ఇందలి కథ కథయేగాదు. ఇది వట్టి రమణీయమగు భావ కల్పనము. అందుకే తొలుత నేనే నీకథయందలి ప్రతీకసంవిధానమును వివరించితిని. కోకిల గీతికావిర్భావము, అచ్చమైన తెనుగుపాట పుట్టుక—ఈ రెంటి కభేదము—ఈ కావ్యమున నిది ప్రధానవిషయము. ఈ విషయము తక్కిన కల్పనమునంతటి నాకర్షించుచున్నది. అందలి పాత్రల మనుష్యత్వముగూడ ప్రపంచితమై స్థాపింపబడక అవి యాగక తత్తదుచితైకైక భావావిషయములుగ, నా భావములకు ప్రతీకలుగ నున్నవి. ఆ భావములు గూడ మనః ప్రపంచమునకు చెందినవిగావు. మాతృ, పితృ, పుత్రికాది సంబంధమైన భావములు మాత్రమే. అంతేగాక కవికి మాత్రము కోకిలమ్మనుగూర్చి విదో యొకజన్మమునకు జెందిన వృత్తాంతము దెలియవచ్చునుగాని పూర్వోత్తరజన్మల వృత్తాంత మెట్లు దెలియును? ఈ లోకసాధారణమగు భావ మొకటే యున్నది. అనగా వట్టికల్పనలోగూడ కవికట్టి జ్ఞాన మొప్పుకొనలేము. మరి యెట్లు చదువుదుమన్నా ఈ కావ్యము నంటిరా రసలోలుపతాబుద్ధిచే తాత్కాలికముగ నాతిక్కబుద్ధి విడువబడును. దీనినే ఆంగ్లమున "Willing suspension of disbelief" అని Coleridge వ్యవహరించినాడు. కనుక నిన్ని కారణములచే నిది కథ యను భావము మనసున ప్రతిఘటితమైపోవును. కథ యొక యాథార్థ్యభావమును భజించి నమ్మిక గొలుపవలెను. ఇతివృత్తమునకు వలసినవేగాక అక్కరలేనివిగూడ, మితముగ, గొన్నిహంగు లమరి యా నమ్మిక పుట్టింపవలెను. ఇందటి లౌకికమైన హంగులు లేవు గనుక ఇది వట్టి కల్పన యనియే మనసెంచును.

ఈ కథాకల్పనలోనే కవి సంయమనశీలత భాసించి దానిని పరిమిత మొనర్చినది. పాత్ర వైరళ్యము, వానిలోగూడ భావవైరళ్యము మెరసి చేపట్టిన యొకటి రెండు భావములనే కుంటపోతగా గుమ్మరించినాడు కవి. కనుక కావ్యమున ఆద్యంతము రసస్రోతస్వినికి పుష్కరాలు వచ్చినట్లుగా స్యందించునే

గాని కొద్దిగా తడుపుటలేదు, ఆ పాత మధురమగు రచన యిది.

పై జెప్పిన లలితగీతులు పాడుట కుద్దేశింపబడినవి. వానిలో గేయగుణము ప్రధానము. నిజమునకు వీని కూర్పులోని శబ్దార్థములకు ప్రాధాన్యము తక్కువ. శబ్దగంధమునకు వాని పోహళింపున బుట్టి విచ్ఛిత్తిమాత్రముగనుండి జ్ఞాపకశక్తివోలె యాత్మకేదియో జ్ఞప్తి కెలయించు శక్తికి ప్రాధాన్య మెక్కువ. లాలిత్యము, మాధుర్యము ఉండనే ఉన్నవి. ఇదియంతయు సంగీతావరణముగాని సాహిత్యావరణము గాదు. సంగీత మేమి చేయును? అది నాదమాత్రమెయయ్యు శ్రుతిలయలచే సౌష్ఠవమును భజించి ఆలాపనచే భావావధుల వెదకికొనును; స్ఫుటప్రతీతిలేక వాసనారూపముననున్న జీవి యనుభవ ప్రపంచమును మనోవీధి కాకర్షించును: ఒక్కొక్క భావమున కొక్కొక్క రాగ మొప్పును. ఆ భావముల ద్రుతి మంథరత్వముల ననుసరించి తాళముల చమత్కృతి, మంద్రస్థాయిలోని యొక దీర్ఘదీర్ఘమగు నాదవివృతి శోకస్థాయినందుకొని కరుణావ్యంజకమగును. తారస్థాయిలోని యొక గమకప్రస్తారము జీవి పడుపాట్లన్నియు జూపించి వేదనాస్వరూపమును దెలుపగలదు. ఆత్మకును నాదపదార్థమునకును గల ఈ యవినాభావ మెట్టిదోగాని మనవారు నాదము నే యాత్మపదార్థమగు బ్రహ్మమనిరి.

కోకిలమ్మ పెండ్లిని కవి ముత్యాలసరాలలో వ్రాసినాడు. ఈ మాత్రాచ్ఛందస్సు తెనుగుభాషవలెనే శృంగారకరుణముల కొప్పినది. వానిని పాడి యానందించిననే యా యొప్పుదల తెలియును. ఇందలి పలుకుబడులన్నియు నచ్చమైన తెనుగు పలుకుబడులు, రసవ్యంజకములు. వ్యావహారికపద్ధతిని వ్రాయుటచే తెలుగున నుచ్చారణమునగల కొకుసిద్ధియంతయు కవి కొల్లగొట్టి రసోపస్కారకముగ నడిపించినాడు.

మన యాత్మ ప్రకృతిసంవలిత మంటిని. అట్టి యాత్మను నాదవివర్తము సంగీతరూపమున నొరయును. ఒరసిన నేమగును? ఆత్మకూడ మెరయును. మనసు మురియును, తనువు మెరయును. బహిరంతరముల నొక చొక్కు అవహిల్లి యానంద మతిశయించును. ఈ యాత్మ మెరయుట యెట్లనగా వాసనాప్రపంచముపై నాదసంఘాత మేర్పడినప్పుడిది జరుగును. తంత్రీసంఘాతముచే స్వరముల బుట్టించుచుండగా వాద్యముపై జీవనాదమొకటి పుట్టినట్లు ఆత్మ గూడ తాను స్వయముగా మెరయునారంభించును. రసికులు రాగబోధితమైన భావమును బట్టుకొన్నట్లే ఈ యాత్మికమగు జీవనాదమును బట్టుకొన యత్నింతురు.

ఈ రచనలోని మహాప్రయత్నమంతయు తెనుగు నాటి సర్వ ప్రకృతిలోని యాత్మగీతి నావిష్కరించి తత్సంఘాతముచే తన యాత్మనే నినదింపజేయుటకు. ఇతివృత్తసంఘాతముచే ప్రకృతిగీతి యుబుకవలెను. దాని సంఘాతముచే దన యాత్మగీతి యుబుకవలెను. కథయో కల్పనమో వ్రాయుట దాక సులభమేగాని మీది రెండు పనులును సామాన్యులకు దుస్సాధములు

కోకిలమ్మ పెండ్లి·కల్పన మంతయు తెలుగునాడు కొండలు కోనలుగా నున్ననాళ్ళ జరిగినట్లు కల్పింపబడినది. నేటివలె యాత్మను ప్రతారించెడి దొంగనాగరికతలో దేశ మానాటికి తూలిపోలేదు. అది యంతయు నొక ప్రాకృతవాతావరణము. చెట్లు చేమలు వాగులు తోగులు పుట్టలు గుట్టలు గాలులు నేలలు అడవులు జడధులు అన్నియు నొక యాత్మవిశేష సమృద్ధిని భజించెడి రోజులవి. ఇంక నితివృత్తవర్ణనలో నెట్లు కవి ప్రకృతి కొక భావసంఘాతము గల్పించె ననగా ప్రకృతిలోని యాయాపదార్థములకు వ్యక్తిత్వప్రదానము చేసియు మూర్తిమత్వము నిచ్చియు. చిలకమ్మ కోకిలమ్మలకే గాదు. కవి ఆనాటి సర్వప్రకృతికిని విగ్రహమూర్తిమత్వము కల్పించినాడు. మనవారు వసంతమన్మథులాదిగా నధిష్ఠానదైవతములకు మూర్తిమత్వము గల్పించినారు. కాని 'గాలిపిల్లలు సొగసు నడకల సోకులు పోవుట' 'పాము పడుచులు తెప్ప లేసుక తేలిపోవుట' క్రొత్త కల్పనలు. జాతి గుణ క్రియా వివక్షనతిక్రమించి, ప్రకృతి కన్నుదెరచినదనుట, పాట పాడినదనుట, మామిడిచిగురు మరింత సాగిందనుట గూడ నిట్టివే. వాస్తవప్రపంచమున జాతిగుణక్రియా విభాగము ననుసరించి భావమును దీర్పవలసి యుండగా కల్పనాప్రపంచమున నిది చాలనిదై నిరాదృతమైనది. సర్వభావములకు బరస్పరము సర్వవస్తువులు నథవా వాని గుణక్రియలు సంకేతములో అభివ్యంజకములో గావచ్చును. ఇదియంతయు లలితగీతి రచనామార్గమున నంగీకృతమె. వెన్నెలలు ప్రేమకు చావులేదనుట వాని యమృతత్వగుణ మాధారముగ జెప్పింపబడినది—చెట్లు పాడుటకు మర్మరధ్వను లాధారము. ఇట్టిచోట్ల కవి సంప్రదాయమును మరింత పొడిగించినా డనవలెను.

కోకిలమ్మ కరుణామయగాథకు ప్రకృతి సంవాదరూపమగు శ్రుతి గలిపినదంటిని. కవి యా రెంటి సంఘాతముచే ప్రకృతి యాత్మగీత నావిష్కరించుటయు నది

# కోకిలమ్మ పెళ్లి

మరల దనయాత్మకు సంఘాతమై తన యాత్మ నెట్లు స్పందింపజేసినదో చూచుటకు సులభమగు మార్గము లేదు.

ప్రకృతిస్థమగు చైతన్యగీతము నావిష్కరించుటకు మహా ప్రయత్నమే చేసినాడు. అది కథలో వర్ణనలో మనకు గానరాదు. జీవనాదము శ్రుతి సన్నిహితముగ విన్పించినట్లే మననశీలున కిదియు ననుభవ సన్నిహితముగ వచ్చును. కవియాత్మగీతి ప్రకాశ మీ సర్వ ప్రయత్న యాథార్థ్యముచే ననుమేయ మాత్రముగ దెలియవలెను. తెనుగురాజు చల్లని పరిపాలనలో దేశములోని ప్రకృతిగూడ స్తిమిత విలాసములు చూపును. కావ్యారంభమున కవి సాగరతీర దేశము నిట్లు వర్ణించినాడు.

‘ఊగులాడే కడలి తరగలు
నాగుబాముల కోడెలల్లే
ఒడ్డుదాకా ప్రాకి ప్రాకీ
ఒరిగి పోతాయోయ్.

అడవిలోనూ కడలిలోనూ
అర్ధరాతిరి వేళ అప్పుడు
తొగరు కన్నుల చుక్కకన్నెలు
తొంగిచూస్తారోయ్!

పొద్దుకూకే వేళ ఒడ్డున
ముద్దు ముద్దుగ తిరుగుతూంటూ
సొగసు నడకల గాలిపిల్లలు
సోకుపోతారోయ్!

సుళ్లుతిరిగే కడలి నడుమా
చూపుకందీ అందకుండా
తెప్పలేసుకు పాము పడుచులు
తేలిపోతారోయ్!

ఒడ్డునే బంగారు చేలూ
ఒడ్డునే పూవుల్లు చేత్తో
ఊరికే యిట్లంటె చాల్ పా
లుబికి పోతాయోయ్!

తల్లి కోకిలమ్మకుగా నడవిలో వెదుకుచున్నది:

అడవులెంటా కోనలెంటా
బుడబుడా చను సెలలవెంటా
ఆడుగులు తడబడా వెదుకుతు
నడచిపోయింది.

రెండుజాముల వేళ పులులూ
పండుకొని రొప్పేటి నీడల
గుండె గుబగుబలాడ పోయీ
కూతు వెదకిందీ.

పెద్దపులులు సివంగులూ ద
ప్పికలు తీరగ నీరు త్రాగే
గొంగ్రోవల సెలమొదళ్లా
తొంగి చూసిందీ.

తెళ్లనూ తిని కొండ సిలువలు
కళ్లుమూసుకు నిగురపోయే
బిల్లుపడవిలో ఉస్సురంటూ
వెళ్లి చూశిందీ.

శాంతమృగప్రచారమైన మధ్యాహ్న వేళా గహన హృదయ మింత భయదగంభీరమని అడవులు జూచిన వారికిగాని దెలియదు. కవి యిచట నావిష్కరించునది కోకిలమ్మపై తల్లి తొలుత జూపిన యుదాసీనతకు శిక్షగా గహన మాక్రోశించుట. అది క్రూరమృగముల భయదాగ్భటీ గర్జారవములు లేక నిశ్శబ్దముగనుండియు నామెను జూచి గాండ్రించుచున్నది. అచటి శూన్యతయే గహనవక్త్రవివృతివోలె భయంకరము.

వింత వింతల సోకులేలిక, పూలరేడు, వసంతుడు చెక్కుల నవ్వులు జిందుతూ వచ్చినాడు. ప్రకృతి ఉల్లాసపరవశయై ఊగిసలాడింది. ఏమని పాడిందో చూడండి.

వచ్చావటయ్యా పూలరేడా
తెచ్చావటయ్యా పూలరాజా
నీవు తెచ్చినపూవులే కా
నికల కిస్తామూ.

రావయ్యా ఓ పూలరాజా
రావయ్యా ఓ అందగాడా
కోకిలమ్మకు నీవు నీకూ
కోకిలా తగునూ.

వారిపెళ్ళికి అడవిఅంతా
తోరణాలై నాయి చివురులు
కాపలా కాసినై పులులూ
గండశిలలందూ.

సన్నాయి పాడింది తెల్లని
సన్ననీ సెలవూట, పూలా
వెన్నెలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరిచిందీ.

ఇట్లీ కావ్యము ఆపాతమధురము, ఉదాత్తభావప్రచోదితము; మహాకవి సర్వశక్తి సమన్వయరూప ప్రయత్నఫలమిది. కోకిలా కల్యాణగీతికి భద్రమగుగాక!

# రేపు మనదే-మరి

శ్రీ హ స జ

రేపు మనదే—మరి
రేపుతా వెందుకు నిన్నటిగాయాన్ని
రావణాసురుడి కాష్ఠాన్ని !
సాగిపోదాం కలసి—మరి

దారిపొడుగునా లేపకు దుమ్మును
తోక తొక్కకు చరిత్రను
కలుగులోకి జారిపోతున్న కాలసర్పాన్ని
కోటి పడగల కాళిని !

గీద్దాం మనోహర-చిత్రాన్ని-మరి
గీస్తా వెందుకు మళ్లీ
చెరగిపోతున్న చదరంగపు గళ్లను
లేపుతా వెందుకు శకునిని నిద్రలోంచి!

వెలిగించుదాం ప్రమిదెను — మరి
తెస్తా వెందుకు కాష్ఠాగ్నిని శ్మశానంలోంచి
ముట్టించకు తుద — ముట్టించకు
బతుకు వత్తిని మృత్యువుతో
ముట్టించకు ... తుద ముట్టించకు !

# గోవిందవాక్యాలలోని చరిత్రాంశాలు

## శ్రీ కొత్త భావయ్యచౌదరి

బ్రహ్మేంద్రస్వాములవారి గోవిందవాక్యము లలో చాల చరిత్రాంశములు వ్యక్త పరుపబడినవి. 1725-1820 సంవత్సరములమధ్య ఒక ప్రక్క యీస్టిండియా కంపెనీవారు, మరొక ప్రక్క ఫ్రెంచి వారు, మహారాష్ట్ర సేనాని బలవంతరావు, ఏకోజి, ఆర్కాటు గోల్కొండ మున్నగు నవాబులు, చందా సాహెబు, మైసూరు హైదరాలీ రాజ్యాధిపత్యము నకై పెనగులాడుచున్న కాలమది. ఈ క్రిందవ్రాసిన విశేషములు ఇతర చరిత్రాంశములతో సమన్వయించి యాంధ్రదేశచరిత్రలోనికి జొప్పించవలసినవి. ముఖ్య ముగా రాయలసీమలోని యుద్ధాదులిందు చర్చించ బడినవి.

"నాల్గువేలా యెనుమన్నూట ముప్పదియేండ్లు
కలియుగాబ్దములు జరిగేనమా
కలియుగము శ్వేతముఖులు దొరలయ్యేరు
మెలకువతో రాజ్యమేలేరుమా"

"శ్వేతాశ్వముఖులు ధూమశకటముల్ గల్పించి,
భూతలమున నినుప నిమ్మూర్లపై
నూత్రమెరిగి పశ్చిమోత్తరదిశలందు
గాత్రాముగా నడిపించేరుమా"

ఈ వాక్యములు 172x నాటికి కంపెనీ పరిపాలన వచ్చుట సూచించును. తర్వాత వేయబడిన రైలు మార్గ ములను గూడ దెలుపుచున్నది.

"జాతిజాతికి చాల వైరములు గల్గీని,
జనయోగములు తల్లడిల్లీని మా
పెన్నయొడ్డున నంజే చెన్నూరుగ్రామము
నదిపాలై వరదబొయ్యేనిమా"

అంతఃకలహాలు, ఆ కాలమున చెన్నూరు వరదపాలగుట నిది తెలుపుచున్నది.

కర్నాటభూములకు, తురకవారిసీమకు, మహా నందికి, మొరసరాజ్యానికి, కర్నూలుకు దండువచ్చి నట్లు, ఆనంద సం॥ (1784) లో లేక 1794 లో యుద్ధమై చాలమంది హతులై, కలరామున్నగు వ్యాధు లచే పీడింపబడినట్లు యీ క్రిందివాక్యాలు తెలుపును. కాళిమున్నగు భయంకరదేవతలు వచ్చుట ప్రళయ సూచన.

"మీసాము లేనోడి దేశానికొందని మహి
కొండాలకు జండా లేసేనిమా
కర్నాట భూములకు కాలిపంపున తురక
వారిసీమకు గుర్గివచ్చేని మా
పురగోగ్రుని పంపు మహానందికొచ్చేని,
కర్నూలుకు నంది పంపొచ్చేని మా
ఆనందాబ్దములు అంత్యమునందున
హంతకూని దూత లొచ్చేరుమా
పీనుగ పెంటలు పృథివిమీ దయ్యాని
భేదివాంతులయి చచ్చేరు మా."

1785 లోనో లేక 1795 లోనో కొంతకంపెనీవారికి నష్టము గల్గినను, పాలించిరని యీక్రింది వాక్యము దెలుపును.

"దనుజ (రాక్షస) నామసంవత్సరమందున
వింతలయ్యా జనులు రాలేరుమా
హూణముఖులవంశమున కొంత బొయ్యేని,
కాని జాగని భూమిగొలిచేరుమా"

ఈ కాలమునందే మధుర, తంజావూరు రాజ్య ములు ఆక్రమింపుబడినవట. మహానందిగోపురము విరగగొట్టబడెనట. ఈవిషయములు వాక్యములలో నిట్లు చెప్పబడినవి.

"మధుర తంజావూరు మరి కొరణమయ్యేవి
మహానంది శిఖరము విరిగేనిమా"

చందాసాహెబు మీనాక్షీపాలన తుదముట్టించిన కాలమిది. అప్పుడు హంపి, విరూపాక్షము మధ్య గొప్పయుద్ధమై, అగ్నిని గురిపించిరి. అనగా తుపాకులు వగైరాలతోను, అగ్నితోను పోరాడిరి. అప్పుడా గ్రామాలమధ్య నున్న 14 గ్రామములు నాశన మయ్యెను. తూర్పునుండి పశ్చిమమునకు ధూమశకటాలు తెగ తిరిగెడివట. కుంభకోణములో గోవన, కొల్లా పురము కొల్లగొట్టుట, కంభము కందుకూరులలో చెరలుబెట్టుట, యిత్యాదులు జరుగుచుండినట్లు కొన్ని వాక్యములలో నున్నది.

ఇట్లుండగా వీరవసంతుడు జనించి, యిచటికి వచ్చెనట. బలవంతరావు, హైదరాలీ, టిప్పు, చందాసాహెబు మున్నగు వారిలో నెవ్వరినో యీతడుద్దేశించియుండును. లేదా దండు నాయకు డెవడో ఆతడే వీరవసంతుడు. పెనుగొండ, గండికోటలవద్ద యుద్ధములు జరిగి, వినుకొండవద్ద, మంగళగిరి (కనకగిరి) లేక బెజవాడలవద్ద గూడ కలహములై చివరకు రాజ్యము వీరవసంతునికి (దండు నాయకునికి) స్వాధీనమయ్యెనట. ఇతడు హిందూమతస్థుడై దేవబ్రాహ్మణులను పోషించెనట. ఈశ్వర సం॥ (1757) లో నాయనకు రాజ్యము వచ్చెనట. ఈతనిని తర్వాత రామ ధర్మజస్వామి యను పేరుతో పై గ్రంథము చెప్పుచున్నది. ఈ మారుపేరు బహుశః యీతని సహాయుడగు వానిదని చెప్పవచ్చును. అపుడు 33 రోజులు కనుపించిన తోకచుక్క యొకటి యిరవైబారుల పొడుగుగలది ఆకాశమున ప్రకాశించెనట. అప్పటికి కలియుగము 5000 సం॥లు లోగా అయినవట. అనగా 1898 లోగా అగును. ఇది తప్పుగా నున్నది. (1816) యువ సం॥ లో వింతలు బుట్టిననియు ఫిరంగు లుపయోగింతురనియు నీక్రింది వాక్యములందున్నది.

"యువసంవత్సరమందు శ్రావణమాసమున యామ్యాది
దిశలందు వింతలు బుట్టేనిమా,
యినుపదారి యందు నిప్పుఘోటకములు బ్రోవ
ఫిరంగులు ఆరంభించేరుమా"

ఈ సంవత్సరములోనే ఆంధ్రదేశములో పిండారిదండు ప్రవేశించి దాదాపు ప్రతిగ్రామమును కొల్లగొట్టుట చరిత్రాంశము.

ఈ గ్రంథములో తర్వాత నానా దేశవార్తలు, మనదేశములో నానాచోట్ల, గలిగిన భూకంపాలు, వరదలు మొదలైన ఉపద్రవాలను తెలుపుచున్నది. తర్వాత నీ వాక్యములు గమనించదగినవి.

"ఢిల్లీవారు తర్లి దక్షిణమొచ్చేరు,
ఉల్లాస మెల్ల తల్లడిల్లేని మా
నెల్లూరిసీమంతా నిర్మూలమయ్యీని,
గుగ్గిళ్ళు దుగ్గాని కమ్మేరు మా
తిరుపతి వెంకటేశ్వర్లు గుడిలో మ్లేచ్ఛులు
అద్భుతముగ అడిపాడేరు మా
గరుడధ్వజము నానాదిక్కుల కేగి,
అరుచోద్యములుగ నాడేనుమా
దొడ్డయిన తిరుణాల దోపిళ్ళుబోయ్యీని
వుండే దేశముల వలసబోయ్యేనిమా."

ఇవి యేసంవత్సరములో జరిగినవో వ్రాయబడలేదు. చరిత్రలజూచి గుర్తింపవచ్చును అలంపురలోను, కంచిమున్నగు విడుచోట్ల ఉత్పాతాలు జరిగననిగూడ చెప్పబడినది. ఇది జరిగినతర్వాతనే ఢిల్లీ సైన్యము వచ్చుట జరిగెనట. ఇక్కడ నుండి యెక్కడెక్కడ దోపిళ్ళ కార్యక్రమము జరిగినదో వివరింపబడినది. ఓరుగల్లు, అగరాము, కటకము, కొల్లాపురము కొడుమూరు, ధనమూరు, బెల్లంకొండ, మున్నగు చోట్ల చాలద్రవ్యము దోచుకొనబడెనట. కేశవసేనాని యీ సమయమున కొన్నిచోట్లను గాపాడెనట. ఇతడెవరో తెలియుటలేదు. బోయలు కొందరు మహానంది ప్రాంతమున ముష్టియుద్ధ మొనరించి చనిపోయిరట. బేతంచెర్ల కప్పుడు వీరవసంతుడు వచ్చి సేనాని చేరి కేశవులుకు సాయపడెనట. అప్పుడు బండియాత్మకూరుగ్రామము భస్మమయ్యెనట. అచటి స్త్రీలను మండలపతి గారవముగా చూచెనట. ఈ దోపిళ్ళయుద్ధములలో చనిపోయినవారికి శ్రాద్ధకర్మలు, బ్రతికియున్న వారికి అన్నదానములు ముఖ్యముగా బ్రాహ్మణులకు విరివిగా జరిగెనట. ఇంకా కొన్ని దోపిడీలు బిజనూరుకోట, చాగలమర్రి, వినుకొండ మొదలగు చోట్ల జరిగెను. ఇవి ప్రాయశః మరాటీ దండుచేసినవై యుండును. ఈ సందర్భమున రాయదూరు, ఆనెగొంది, ఆదవేని, కందనూరు, మున్నగుచోట్ల పెద్దయుద్ధములు జరిగెనని కొన్ని వాక్యములందు గలదు. ఈ వాక్యములు పిండారీల విజయము సూచించును.

"కానికులాలందు పింజారికులమందు
గాలి గాబరలేక యుండేనిమా"

మున్నాగువారు గూడ నీదండులో విస్తారముగా నుండిరి. ఈ వాక్యములుగూడ కంపెనీవారి అపజయమును తెలుపుచున్నది.

"కందుకూరికి వీరవసంతుడువచ్చి
కంపెనీ వారెల్ల గూలేరుమా"
మున్నూరు వారెల్లా ముదముతో నుండేరు
మొగలాయిదొరతనము లణిగేని మా.
పెన్నయొడ్డున నుండె చెన్నూరుగ్రామము
పెనుగొండసీమకు జేరేనిమా."

ఈ వాక్యములనుబట్టి మరాటిదండు (పిండారి దండు) నాయకునే వీరవసంతుడను పేరుతో నీగ్రంథ

కర్త సమర్థించినట్లు కనబడుచున్నది. ఈ దండుజయములనే యిందులో వర్ణించినాడు. రాబొందిదిన్నె, మునిమడుగు, నాగాయపట్నం, సోగనూరు, సిద్ధపట్నం, ధేనువకొండ, యాగంటి, కుమ్రకొండ, కోవెలకుంట, రామేశ్వరము, ద్రావిడ దేశములందు కూడ దోపిళ్ళుసాగెనని తర్వాతి వాక్యములందున్నది.

ఈ దోపిడివారిలో ముగ్గురు నాయకులుండెడివారని, ముత్తలూరువద్ద వారుకూడ ఆలోచనలు సల్పిరని యొకవాక్యములో గలదు. వారు గుత్తిదుర్గము నకువచ్చి వారి గురువునకు అనగా ముఖ్యనాయకునకు దోపిడీ ధనములో కోటిద్రవ్యము సమర్పించిరట. రామేశ్వర రణములో రాష్ట్రాధిపతులు రాలేదట. అనగా చనిపోయిరి. ఘోటక ముఖులు (తెల్లవారు) నాశనమైరట.

1797 పింగళ సంవత్సరములో మరల ఈ దోపిడీనాయకుడు (వీరవసంతుడు) పట్టాభిషేక మగ్యొనని యొకవాక్యములో చెప్పబడినది. ఈతనికి సామంతులుగా రామధర్మజస్వామి యుండేవాడట. ఈతడు 108 తిరుపతులందు పూజలు చేయించేవాడట. కేశవనాయకు నీతడు సేనాధిపతిగా నుంచి రాజ్యమేలెనట. ఆకాలములో పాండురంగ దేవళము ప్రాకారగోపురములకు బంగారునీరు పూయించుట, తిరువేంగళస్వామి తిరుణాళ్ళు జేయించుట, యాగంటిలో యీశ్వరపూజ, బ్రాహ్మణులకు నిరతాన్నదానము, మంత్రానుష్ఠానములు ఆచరింపబడెనట. భేరుకోమట్ల వ్యాపారము బాగుగా సాగెనట. ఈ వీరవసంతరాయ దోపిడీదారునకు పంచాననకులమువారు (విశ్వబ్రాహ్మణులు) భక్తులైవెంబడిరాగా, కంచి, అహోబలములలో వారికి కాంచనమిచ్చి రక్షించెనట. ఆతుకూరివారు అడవులపాలుకాగా, మోతుకూరువారు చనిపోగా, మరెందరో హతులైరట. కన్నడిగులు, అరిఘాటువారు (ఆర్కాటు?) నష్టమై, అరవలు అడవిపాలుకాగా, గానుగకులస్థులుమాత్రము కరిగిపోకుండా నిల్చియుండిరట.

ఈరీతిగా సాగిన పిండారిదండు నాయకుని చరిత్రయే మిక్కిలి అతిశయోక్తులతోను, వీరవసంతరాయ నామముతోను గోవిందవాక్యములలో ప్రస్తావింపబడెను. ఈదండును యీస్టిండియాకంపెనీవారు 1816 తర్వాత సైన్యములను బంపి అణచివేయుటతో దేశమున శాంతి నెలకొనెను. ఈ దండునాయకులను ప్రోత్సహించి, వారి కుపదేశము లిచ్చుచు వారినే విష్ణ్వవతారములుగా భావించుచు వీరబ్రహ్మేంద్ర స్వామి పరదేశపాలనను నిరసించుచున్నట్లు యీగ్రంథమువల్ల తెలియును. జరిగిన సంగతులనే భావి విషయములుగా వ్రాసి ఈతడు జనులలో నద్భుతకాలజ్ఞానిగా పేరొందెను. కొన్ని వ్యంగవాక్యము లిపు డర్థము కావు. కప్పకోడియై కూయుట, "గుండ్లల్ల దేలేని, బెండ్లల్ల మునిగేని" యిత్యాదు లెవరినో యుద్దేశించి వ్రాయబడినవి. దోపిడి నాయకుడగు వీరవసంతుడు తన కుమారునికి అక్షయసంవత్సరములో నధికారమిచ్చెనని యొకవాక్యమున్నది. ఈ అక్షయ సంవత్సరము 1806 అగుచున్నది. ఈరీతిగా పిండారిదండు చరిత్ర 1725–1816 వరకు సాగినదనవచ్చును. దీనిని చరిత్రాంశములతో సరిజేసి, యుద్ధములందు పాల్గొనిన నానా రాజుల వివరములతో ప్రకటించిన బాగుండునని చరిత్రజ్ఞులకు మనవి.

మహారాష్ట్రనాయకుల ధాటికాగలేక 1729 లో గోల్కొండ నవాబగు ఆసఫ్ జా ఆంధ్రదేశములో చౌతు, సర్ దేశముఖి పన్నులను మహారాష్ట్రులకిచ్చెను. ఇది రెండవ పీష్వా బాజీరావుకాలములో జరిగెను. ఈ బాజీరావుకాలమునుండి ఆంధ్రదేశపాలన తారుమారయ్యెను. పన్నుల పేరతో దోపిడీలు సాగెను. ఈతడు కర్నాటకమునుకూడ జయించి మైసూరురాజుచే కప్పము లందెను. 1740 లో నీ మరాటిదండు కర్నాటనవాబగు దస్తఅల్లిని చంపెను. ఆతని అల్లుడగు చందాసాహెబు పుదుచేరిలోని ఫ్రెంచివారి శరణుజొచ్చెను. అన్వరుద్దీ నచట పాలకుడయ్యెను.

ఫ్రెంచివారికి పుదుచ్చేరిప్రాంతము 1674 లో తంజావూరు పాలకుడగు షర్ ఖాన్ లోడీ యొసంగగా వారచట బలపడిరి. చందాసాహెబును ఫ్రెంచివారును కలిసి 1748 లో అన్వరుద్దీనును చంపి కర్నాటకమును స్వాధీనపరచుకొనిరి. ఈ చందాసాహెబే మధుర, తంజావూరుల నాక్రమించెను. అచట ఆంధ్రనాయక రాజులను జయించి రాజ్యముగైకొనెను. 1740 లో పీష్వా బాజీరావు చనిపోగా, బాలాజీ బాజీరావు పీష్వా యయ్యెను. అన్వరుద్దీను కుమారుడగు మహమ్మదాలీ మద్రాసు యీస్టిండియా కంపెని శరణుజొచ్చెను. గోల్కొండ నవాబు ముజఫర్ జంగు ఫ్రెంచివారికి ఆంధ్ర, కర్నాటములను పాలింపనిచ్చెను. అందుచే 1758 లో

చందాసాహేబును చంపి ఆర్కాటు రాజ్యమును ఇంగ్లీషువారు మహమ్మదాలీకిచ్చిరి. కాని 1757-1762 మధ్యలో ఆంగ్లో-ఫ్రెంచి యుద్ధములు జరిగెను.

రాబర్టుక్లైవు మరల ఆర్కాటు జయించి తీసుకొనెను. ఇంగ్లీషువారి పలుకుబడి జూచి గోల్కొండ నవాబు సలాబతుజంగు తనకు సహాయకుడుగానుండిన ఫ్రెంచి సేనాని డూమసుకు (డూప్లేకు) 1759 లో ఉత్తర సర్కారుల నొసంగెను. అందులో గుంటూరు సర్కారు మాత్రము తన సోదరునికిచ్చెను. ఒకప్రక్క పీష్వాల ప్రభ పెరుగుచుండెను. 1758 లో పీష్వా బాలాజీబాజీరావు పంజాబు జయించి పలుకుబడిని విస్తరించుచుండెను. కాని 1761 లో పానిపట్టుయుద్ధమున సదాశివరావను సేనాపతి ముస్లిములతో బోరి యోడిపోయెను. ఈ మహారాష్ట్రులకు దక్కను సహాయము లేకుండెను.

1767-68 సంవత్సరముల మధ్య హైదరాలీ కర్నాటనవాబై కంపెనీతో రాజీపడి పాలన సాగించెను. ఈతడు 1780 జూలై నెలలో కడప, అనంతపురం జిల్లాలలో దాడిచేసి చాలానష్టపెట్టెను. కర్నాటములో ప్రతిచోటను గ్రామదహనాలు, యుద్ధములు విశేషముగా నపుడు జరగెను. దీనికి కారణాలు తెలియుట లేదు.

1782 లో మరాటివారు తమ పన్నులకై దండయాత్రలు రాగా, వారితో ఆంగ్లేయులు సంధి గావించుకొనిరి. తర్వాత 1779 లో కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాల పాలనము నైజాం ఆలీ కంపెనీవారి కొసంగెను. ఈ ప్రాంతముల అధిపత్యమునకై మహారాష్ట్రులు, టిప్పుసుల్తాను నిరంతరము యుద్ధములు జరుపుచు వచ్చినందున తన రాజ్యము భంగము గాకుండుటకై, కంపెనీవారి సైనికసహాయ మవసరమైనపుడు పొందుటకుగా నివి యొసగబడెను. ఐనను మహారాష్ట్రుల దాడులు ఆగిపోలేదు. 1788 లో గుంటూరు గూడ కంపెనీ పాలనలో జేరెను.

1799 లో టిప్పుసుల్తాను యుద్ధములో చివరవరకు పోరాడి, చనిపోగా, ఆర్కాటు నవాబును తొలగించి, లార్డు వెలిస్లీ గుత్తి వగైరా ప్రాంతములు గూడ స్వాధీనపరచుకొనెను. 1794 లో మరాటీ నాయకుడగు మహాద్జీ సింధియా చనిపోయెను. తర్వాత వచ్చిన నానా ఫడ్నవీసు 1800 లో చనిపోయెను.

తర్వాత పిండారి దండు ఒకటి నూతనముగా బయలుదేరి, మరాటీ దండుతో కలిసి ఆంధ్రదేశములో దోపిడులను బాహాటముగ సాగించెను. కంపెనీవారు దానిని ప్రతిఘటించుచున్నను లాభము లేకపోయెను. ఈ దండు 1817 వరకు ననేక దారుణకర్మలను సాగించెను–దోపిళ్లు, గ్రామ దహనాలు మొదలైనవి. పిండారి దాడులకు ఒక నాయకుడు అమీర్ ఖాను. రెండవవాడు కరీం. వీరుగాక ఒకహిందువు, చిత్తు అనువాడు (ఈతడు చిత్పవన వంశీకుడో పీష్వా వంశీకుడోయై యుండును) ఉండెరట. ఈ పిండారీలలో పింజారీలు గూడ కలరు. పింజారీలనగా దూదేకుల సాహేబుల తరగతికి చెందినవారు. వీరు ఉత్తర సర్కార్లలోను, దత్తమండలాలలోను విశృంఖలముగా దోపిళ్ళను సాగించిరి. వీని నరికట్టుటకు మదరాసు కంపెనీవారిశక్తి చాలనందున 1817 లో గవర్నరు జనరలు హేస్టింగ్సు స్వయముగా సైన్యమును నడిపించి లక్షా పదమూడువేల సైన్యముతో వచ్చి యుద్ధము సాగించి, యీ దండును అణచివేసి, దుండగముల కంతము గల్గించెను. అమీరుఖాన్, కరీంలు జాగీరులను బొందిరి. చిత్తు అడవులకు పారిపోయెను.

ఈ విషయములతో జోడించి, గోవింద వాక్యములు పరిశీలింప దగియున్నది. కాలజ్ఞానము (బ్రహ్మంగారిచే రచితము), వీరబ్రహ్మేంద్రస్వాముల చరిత్రలు తఱచినచో నింకను గొన్ని చరిత్రాంశములు వెల్లడికావచ్చును.

# సాహితీ సుగతుని స్వగతం

"పూర్వం శ్రీరామచంద్రులవారు నన్ను తెమ్మని మారాము చేశారట చిన్నతనంలో. దశరథ మహారాజులవారికి పెద్దచిక్కే వచ్చిపడింది. మంత్రులతో, సామంతులతో మంతనాలు చేశారు. ఎలా నన్ను పట్టుకొని ఇస్తారు మరి ముద్దుకుమారునికి? కానక కన్న సంతానం ముచ్చట తీర్చడం ఎలాగ? ప్రధానికి మంచి ఉపాయం తోచింది. ఒక పెద్ద నిలువుటద్దం తెప్పించి నా ఎదుట ఉంచాడు. నేను అందులో ప్రతిఫలించాను. శ్రీరామచంద్రులవారు తను చిన్నారి చేతులతో అద్దం పుణుకుతూ నన్ను పట్టుకున్నట్టూ, తను పట్టు నెగ్గినట్టూ పరమానందం పొందారు. కాని..."

నీరవంగా ఉన్న తూర్పు దెసనుంచి ఈమాటలు స్వగతంగా వినిపిస్తూ ఉంటే తలెత్తి చూచాను. ఎర్రగా, మాల్టా నారింజపండులా, చండ్రనిప్పుల ముద్దలా చంద్రుడు ఉదయిస్తున్నాడు. ఆ భయంకరాకృతి చూచి "సౌమిత్రే నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే" అన్న ప్రసన్నరాఘవంలోని పద్యం జ్ఞాపకం వచ్చింది. పెడముఖం పెట్టి కూచున్నాను. చంద్రమండలంనుంచి మళ్ళా గొణుగుడుగా వినిపించసాగాయి మాటలు.

"నిన్న గాక మొన్న అచ్చంగా ఇలాంటి సంగతే జరిగింది. ఒక పసిపాపడు తనతల్లిని చూచి "జాబిల్లిని చూపవే అమ్మా!" అని కోరాడు. ఆమె చూపబోయింది నన్ను. కాని, ఏడీ! ఆ అమృతభానుడేడీ? నేను కనిపిస్తేనా ఆకాశంలో. అందరూ నన్నాక్రమించుకుంటే ఎలా కనిపిస్తాను? తల్లి తెల్లబోయింది. రెన్నాళ్ళక్రితం ఉన్న వెన్నెలరేడు ఏడీ?"

* * *

"మా బాగా అయింది శాస్త్రి! కృతఘ్నమైనది ఈ మానవజాతి. దీనికి ఎంత చేసే ఏమ్! అబ్బ! ఈ మనుష్యజాతిని, దీనికి పుట్టినిల్లయిన భూమండలాన్ని తల్చుకుంటేనే ఒళ్ళు చల్లబారిపోతుంది చప్పున. నేనూ ఈభూమీ ఒక ఇంటినుంచే బయలుదేరాం కదా! ఎందుకు నన్నలా వెంటతిప్పడం? ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు తాపించడం? మన కర్మకాలి పడ్డాము. ఎప్పటికైనా తిరిగితిరిగి మరుగైపోక తప్పదు—అనుకుంటూ, ఉన్నన్నాళ్ళూ ఇతరులకూ సంతోషంగా, మనకూ ఉల్లాసంగా కాలం వెళ్ళమారుస్తామని అనుకుంటే, ఊరికే ఉండనిస్తుందా భూమి? నామీద ఏమి కసో! ఎప్పుడూ నా దారికి అడ్డమే. నామీద తన నీడ. నన్ను సూర్యునికి మరుగుచేసి, తనేం జుర్రుకుంది—చీకటి—కారుచీకటి. ఇంతటితో ఆగిందా! నన్ను పడవేయాలని ఊరికే లాగడం, తన శాయశక్తులా. లాగుతున్నది కదా అని తీరా పైన పడుతాననుకోండి. ఎవరికి నష్టం? బద్దలైపోదూ! నా సంగతి తెలీదు దానికి లక్షల మైళ్ళదూరంలో ఉన్న నేను ప్రాణం విసిగెత్తి పడ్డానా పైన అంటే, కలిగే ప్రమాదం అంతా ఇంతా కాదు. ఆ గుణమే వచ్చింది మానవులకూను. నన్ను ఏదోవిధంగా బాధపెడదామనీ నా నెత్తిమీద కాలు మోపుదామనీ ఒకే చింత.

"ఎంత చేశాను, ఎంత చేశాను ఈ మానవులకు! కాసంతైనా కనికరం ఉందా? ఉదయమంతా పొట్టకోసం నానాపాట్లూపడి, సూరన్నయ్య దెబ్బకు మాడిపోతున్న వీరిని, ఆయన అటు తప్పుకోగానే చల్లని చేతులతో సేదదీర్చి, సంతోషం కలిగించేవాణ్ణే. మొదట వీరికి ఎన్నికలంటే, లెక్కలు కట్టడమంటే తెలుసూ? నా నుంచీ నేర్చుకోలా వీరు? నాకూ సగదాయే. ఏదో బతికిపోనీ అని నా దినచర్యతో నే కూడికలూ, తీసివేతలూ నేర్పా. నా పేరుతోనే కదా నేడు వీరు నెలలని, సంవత్సరాలని లెక్కలు కట్టుకుంటున్నారు. సూరన్నయ్య ఏమి చెప్పాడట వీరికి? ఆయనను తేరిపార చూడగలరా? కళ్లు పోష చేస్తాడు. ఏదో పాపమని నేను చల్లని చూపుతో చూచాను; మనస్సులోని మాటను తెలుసుకొని...

—మనస్సంటే జ్ఞాపకం వచ్చింది. అబ్బ ఈ మానవజాతికి కృతజ్ఞత అనేది లేకపోయింది కాని. దీని మనస్సు పెరగడానికి ఎంత చేశాను. మొదట్లో ఋషులూ, నాకూ నన్ను—ఆకాశంలో హంసలాగ తేలిపోయే నన్ను—చూచి ఎంతగా వర్ణించారు! భగవంతుని మనస్సునుంచి నేను పుట్టానన్నారు. ఓషధీశుణ్ణి అన్నారు. మనస్సు ఎంత సున్నితమైన ద్రవ్యం! భగవంతుని మనస్సు నేనన్నా, నాలాగ మనస్సు ఉండాలన్నా ఎంత తీయనిమాట? వారికి ఎలాంటి ఎలాంటి ఊహాలు కలుగజేశాను? రోహిణీ నక్షత్రం మధ్యన నేనుంటే హారంలోని పతకంలాగ

ఉన్నానన్నాడు ఒక వేత్త. తనకు తోచింది చెప్పాడు బాగానే ఉంది.

"మరొకాయన అన్నాడు, నేను ఈశ్వరుని సిగ పూవుఅని. ఎంత మధురంగా ఆలోచించాడు. ఈ విశ్వమే విశ్వేశ్వరుడు. ఆకాశం ఆయన సిగ. నేను పూవును. నా పక్కనే ఆకాశగంగ. ఈ ఆకాశగంగలో ఎన్నిలక్షల నక్షత్రాలు మిలమిల లాడుతున్నాయో? మరి ఇప్పుడు మానవులు నాపై తిరగబడి, నేను చేసింది మరచి నన్ను తన్నాలని చూస్తున్నారుగదా? వారికి ఈ అందాలు ఇక ఎలా మిగులుతాయి?

"నేను లేకపోతే వారికి జ్యోతిశ్శాస్త్రం ఏదీ? వారి జీవితం దశలు, గ్రహచారం, వివాహకాల బలం అంతా నాపైనే ఆధారపడి ఉండలేదూ? చంద్రబలం లేకపోతే ఏమైనట్టు? నన్ను కొందరు సంపూర్ణగ్రహమన్నారు; మరికొందరు ఉపగ్రహ మన్నారు? ఎవరేమంటే ఏం? ప్రపంచానికంతా నా వెన్నెలను విందు చేస్తూనే ఉన్నాను. నేను అందరికీ మంచివాణ్నే. అయినా పూర్ణచంద్రుడు మంచివాడూ, క్షీణ చంద్రుడు చెడ్డవాడూ అనే భేదాలు కల్పించారు. మరి నేను గాలిపోతే, నన్నే ఆక్రమించుకుంటే ఇక వారికి దశలేమిటి! గ్రహచార మేమిటి? నేనట! ఉపగ్రహమట! సంపూర్ణ గ్రహాలుగా ఉన్న శుక్రుడు, శని, గురువు, బుధుడు వారికి ఇచ్చేదేమిటి? బుధుడేమో కంటికే కనిపించడు కదా? శుక్రుడు సూరన్నయ్యకు కొంతకాలంముందు; కొంతకాలం వెనకా; ఎప్పుడూ కలిసిరాడు. ఏదో మినుకు మినుకు మన్నంత మాత్రాన చేసే దేమిటి? గురువు? మహాగురువు! శని వట్టి వాతప్రధానం, దగ్గరికి పోతేగాని తెలుస్తుంది? ఏదో చల్లగా ఉన్నానని, నా మీదికి వచ్చినట్టుకాదు.

"ఇక నాతో ఎంత సాహిత్యం పెరిగింది. ప్రథమచంద్రరేఖ అన్నారు. విదియనాటి చంద్రుడన్నారు. చతుర్థీ చంద్రుణ్ని చూడరాదన్నారు. అష్టమీ చంద్రునిలాగ ఉన్నది అతివఫాలం అన్నారు. పూర్ణచంద్రబింబ మన్నారు తమ ప్రేయసుల ముఖం. అదుగదుగో అని చూపడానికి శాఖాచంద్ర న్యాయమన్నారు. ఆత్మజీవాత్మల వివేచనంలో అలలపై ప్రతిబింబించే నా నీడను చూసి చంద్రోర్మిన్యాయమన్నారు. ఇవన్నీ ఇక ఏమౌతాయట!

"ఆఁ! ముందుకూడా దుర్మార్గులు లేరూ! నాపైపడి ప్రతిదానికీ ఏడవటా! నాకు లేనిపోని నేరాలు అంటగట్టలా? గిలకింతలు పెట్టడం నాపని! దాన్ని అనుభవించడానికి అర్హత ఉండాలి? నాపై నిందలుమోపితే ఏం లాభం? నేనేమైనా చెప్పానా విరహవేదన అనుభవించమని! తమకు సంతోషంగా ఉన్నప్పుడు, తాము అందమనుకున్న దానితో అంతా పోలుస్తారూ? తమకు ఇష్టంలేకపోతే ఉపాలంభనం చేస్తారూ? ఒళ్ళు పొగరెక్కి ప్రతివాడూ తిట్టేవాడే నన్ను!

విరహిణీ వధ మహాదురితపంక కళంక
కలుషితాత్ముడైన ఖలుడు వీడె
గరళకూటక ఘోర కల్పాంతవహ్నికి
దోబుట్టువైన ఘాతకుడు వీడె
చండదీధితి కరజ్వాలమండలములో
బ్రోదిపొందిన మహోగ్రుండు వీడె
బాడబంబును దాను పాథోధికుక్షిలో
పరిబోత్తుమన్న దుర్జాతి వీడె
సైంహికేయ నిశాత దంష్ట్రావిటంక
విషరస ప్రతిపాక భావితుడు వీడె
గగనమను రుద్రభూమి నేకతము తిరుగు
నదరు లుమిసెడి కొరవిదయ్యంబు వీడె.

(శృ. నై. 2-122)

అని నానాదుర్భాషలు ఆడా డొక కవి. మరొక కవి:

ఇంతుల నేచు పాతక మ
దింతట నంతట బోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై
ఘనమై యజహత్కళంకమై
వంతలబెట్టి యారుపది
వక్రలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి చూచెదవుగా
తుది నీ బహుళార్తిభేదముల్. (వసు. 4-28)

అని బెదిరించాడు. నేను రాజు అని అనిపించుకొనే దానికంటే వెనుక 'యమ' పదం చేర్చుకొని యమ ధర్మరాజు అని అనిపించుకొనడం మంచిదని సలహా యిచ్చాడు మరొక కవి:

తొలుదొల్త కమలమిత్రుని వంకరూపాట
దక్షాధ్వరధ్వంసి తన్ను గనుట
పరివేష మిషమున పాశంబు దాల్చుట
కప్పు దేహమునందు గానబడుట
కాలవశంబున గాని తోపకయుంట
సతత నిష్ఠుర గదాన్వితత గనుట
బూని పాంథుక్షేత్రమున ప్రవర్తించుట
ప్రకటానురాగ తారకుడగుటను
నంతరం బెద్ది యాత్మలో నరసి చూచి
రాజ నీకును నల ధర్మరాజునకును
ప్రాణిలోకంబు బాధలు బరచునపుడు
ధర్మపథ మొక్కడెక్కడా ధన్యునందు.

(మను. 3-37)

# సాహితీ సుగతుని స్వాగతం

ఆ కవికి పాపం ప్రాణాలుతీసే ధర్మరాజే నర్మాత్ము డయ్యాడు. మరొక కవి నన్ను బద్దలవుతున్న అగ్ని పర్వతంతో పోల్చాడు.

తావు ల్గులుల్కగా మేనితీవకు బరీ
తాపంబు గావించు నీ
జీవంజీవమనోజ్ఞమూర్తి యకటా
శీతాంశువా కాదు శో
భావైరూప్యమునన్ జనగ్రహదమా
భస్మావృతాంగతే
జోవైశ్వానర విస్ఫులింగము సువీ
చూడన్ నిశానాయకా!

(చారు చంద్రోదయం.)

"నేను రాజునని ఎప్పుడైనా చెప్పుకొన్నానా? నన్ను రాజు అని పెద్దచేసింది వారే. శిక్షించడానికీ దండించడానికేనా రాజు కావటం నీవు అని చెప్పిందీ వారే.

రాజీవాక్షుల నేచు పాతకివి చం
ద్రా రాజవా నీవు నీ
రాజత్వంబున చక్రము ల్మనియెనో
రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనో డిండెనో యహిభయో
ద్రేకంబు దా జెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్ర ఫలమే
రాజౌట దోషార్థమే. (వసు. 4-27)

"మరొక కవి నన్ను దిష్టిపిడత అని ఈసడించాడు. పట్టి తిండిపోతు మన సత్త్వం!

నలుపయును కాపు గగనంబు నల్ల నేల
దారకావాంమను మేలి పైరునుంచి
నింగి దిగి పారుటయు జూచి నించు దృష్టి
కుంభయును బోలె బూర్ణేందు మండలంబు.

(సునక్షిణా పరిణయం 4-139)

"ఏమి పెడసరం జాతో ఇది. ఇతరుల కష్టాన్ని చూచి సంతోషిస్తుంది! నాపై భూమి నీడపడి తమకు వెన్నెల పోయిందె అని పరితపించడానికి మారుగా, ఏ రాహువో, కేతువో మింగాడని మహామనసారా వర్ణించాడు ఒక కవి :

ఫణిరాజు తల్పంబుపై పద్మనాభుండు
తిన్నగా శయనించు వన్నె దెగడి
తనరు శ్వేతద్వీపమున గాఢతమి నొక్క
దెసనుండి పర్వేడు పస హసించి
క్రమముగ బుష్పగుచ్ఛముమీద మగతేటి
మొత్తంబు వ్రాలెడిబిత్తు మీరి
హిమశైల తుంగ శృంగమున నీలాభ్రంబు
పర్యాయమున గప్పు భూతి మెరసి

సార కర్పూర డిండీర హారహీర
తారకోదార ధవళాంశు వారికలిత
నీరజారాతి బింబ మున్నిద్రరౌద్ర
గతి గ్రసించెను రాహువక్కాలమునను!

(హంసవింశతి. 5-313)

నన్ను ఎవడైనా పట్టుకొని ఇదిగా హింసిస్తూ ఉంటే- అది కేవలం ఛాయాగ్రహమే అనుకోండి—ఏమిటా కల్పనలు?

"నా నిజం గ్రహించి మనసారా పొగడిన వారు ఉన్నారనుకోండి, వారిసంఖ్య స్వల్పం. నేను ఉద యిస్తున్నప్పుడున్న ఎఱుపును చూచి, సగం మాత్రమే కనిపించినప్పుడు ప్రాగ్దిశాకాంత బింబాధర మన్నాడు నన్నొక కవి :

అర్ధమండల ముదయించు నమృతభాను
డుదయరాగంబుతో గూడ నొప్పు మిగిలె
ప్రకట తాంబూల రాగ సంరక్తమైన
ప్రాగ్దిశాకాంత బింబాధరంబు వోలె.

(భీమేశ్వరపురాణం 2-40)

సురరాజు దేవేరి ధరించిన కర్పూర తాటంక మన్నాడు మరొక కవి:

సురుచిరలీలమై సురరాజు దేవి
ధరియించు కర్పూర తాటంక మనగ
మెల్లన నవలొత్తు మించుల బొదలి
చల్లనై వల్గువ చంద్రుండు వొడిచె.

(గౌరన. హరి.)

"పాపం! మరొక కవి—కాముక కవికాబోలు— నన్ను కాలభిషగ్వరుడు తయారుచేసిన సిద్ధౌషధ మన్నాడు. నవ్వుకున్నాను.

ఆరూఢస్థితి జంద్రికా ధవళితా
జాండంబులో జంద్రుడో
ప్పారెన్ కాలభిషగ్వరుండు విరతం
బై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్వ బాదరసమున్
బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలిక బెట్టినట్టి గుటికా
సిద్ధౌషధంబో యనన్. (మను. 3-25)

ఎప్పుడూ తమ తమ మహారాజులను మన్మథవిలాసాల కోసం ప్రోత్సాహపరిచే కవులకు నన్ను చూస్తే ఇంత కంటే ఏం తోస్తుంది గనుక! కనీసం ఆ—ఆ—కవి అన్నట్టు నన్ను

గగన మొప్పారె నీలోదకంబు కరణి
తారకా ప్రకరంబులు కైరవముల

పగిది విలసిల్లె జంద్రుండు భాసమాన
    డగుచు హంసవిధంబుల నలరెనపుడు.

(గోపీనాథ రామాయణం.)

అని రాజహంసతో పోల్చి నా బాగుండేది. కాని నాట్యసంగీతశాస్త్రపారంగతుడుకదూ రామరాజభూషణుడు—మహాభాగా వర్ణించాడు నా ఉదయాన్ని :

హరిదంభోరుహలోచనల్ గగన
    రంగాభోగ రంగత్తిమో
భర నేపథ్యము నొయ్యనొయ్య సడలిం
    పన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్
    వక్త్రంబునుం దోచెనా
హరిణాంకాకృతి వొల్చెరేకయి సగం
    బై బింబమై తూర్పునన్. (వసు 4-17)

నట్టువరాలితో పోలిస్తే పోల్చాడుగాని, చాలా సహజంగా చెప్పాడు. మరి లోకవృత్త పరిశీలనమంటే అదే కదూ! నిజానికి మనసువిచ్చి వర్ణించినవాడు కృష్ణరాయలు—నావంశం వాడైనందుకు :

కలశపాథోరాశి గర్భవీచి మతల్లి
    కడుపార నెవ్వాని గన్నతల్లి
అనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాడు
    వన్నె వెట్టు ననార్తవంపు బువ్వు
సకల దైవతబుభుక్షా స్ఫూర్తి కెవ్వాని
    పుట్టుకాముడు లేని మెట్టపంట
కటిక చీకటితిండి కరముల గిలిగింత
    నెవ్వాడు దొగకన్నె నవ్వజేయు
నతడు వొగడొందు మధుకైటభారి మరది
కళలనెలవగువాడు చుక్కలకు రేడు
మిసిమి పరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. (ఆముక్త 1-19)

మనసు కుమ్మరించినట్టులేదూ ఈ మాటలలో? అదే కావాలి. మనసులేని కవిత్వం మాసికలబొంత, మసిపాత. ఎంత పేనితే ఏం తాటిముద్దల తాడు లాగ చేయి తగిలితే గాట్లుచేస్తూ? లేకపోతే

కందళితానురాగములు
    కావు మనంబులు విన్నయంతలో
నందరు పారవశ్య పద
    మందగ చల్లదనం బొకింత లే
దిందున శంకరాభరణ
    మెట్లయి తీవు శశాంక నీ పదం
బుం గుది నంత శూన్యముగ
    బో వివరింపగ మాట లేటికిన్

(పంచ వై. వే. 4-160.)

అని నన్ను దూషించబోయిన కవికిలాగే అంతాశూన్యంగానే తోస్తుంది.

"మరికొందరు నన్ను పొగడబోయి, నానా యిదిగా వర్ణించారు, నచ్చు పుచ్చు పోలికలతో. ఊరికే ఉండినా బాగుండేది! ఒక కవి నన్ను నారదునితో పోల్చాడు:

వీణె యక్కున హత్తించి విన్ను నాగ
నరలు వెన్నుని గొలువంగ వచ్చు చిక్వ
కూటి తబిసియుబలె గంగు గొనబునీర
జంగురుం డల్ల నల్లన చల్లబ్రాకె.

(యయాతి ఆ. 2.)

నారదు డేమిటి—నాతో సామేమిటి? ఏమిచేయును పీరి బుద్ధులకు?

"ఏమిటీ ఈ మానవులకు పిదపకాలపుబుద్ధులు నన్ను లాంగదీద్దామని, నాపై పెత్తనం చేద్దామని? నా లోకంలో అడుగుపెట్టాలంటే ఎంత పుణ్యం చేయాలి? ఎంత కాంతిమయలోకం నాది? భూలోకంలోలాగ కుళ్ళూ, కలుషం ఉందా? కనుక నే

మధురాపట్టణ విప్రముఖ్య శివశ
    ర్మాఖ్య వేద శాస్త్రాగమాం
బుధి సంద్రోదయు, చంద్రలోకమిది యా
    ప్రోతేలు మండుం గళా
నిధి సూత్రీయసయూఖ కందళి శిఖా
    నిష్యూత ధారాసుధా
నిధులన్ భానుగభస్తి తప్తమగు నీ
    విశ్వంబు రక్షించుచున్. (కాశీఖం. 4-171)

అని వ్యాసుడు చెప్పాడు. ఇక్కడికి రావడానికి అర్హత ఉండవద్దూ?

"నవీనకవుల్లో నన్ను చాలమంది సానుభూతితో చూచారనే అనాలి. "నావలెనే యాతనస్మృత్త భావశాలి" అని శ్రీ కృష్ణశాస్త్రి అన్నారు. నిజమే. వెర్రికాకపోతే ఎందుకు నాకీ తిరుగుళ్ళు ఈ వరణి వెంట? శ్రీ శ్రీ నన్ను "ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలాగు" న్నానన్నారు. కాదు మరి? బహుళపంచమినాడు నేను అలాకాక ఇంకెలా

# సాహితీ సుగతుని స్వగతం

ఉంటూను? నిజమాడితే ఉలుకెందుకు? పాపం!వండూరివారి యొంకి "ఆనాటి నావోడు సెంగుకూడా" అని తనగోడంతా నాతో చెప్పుకొన్నది. ఇక విశ్వనాథ వారి 'శశి దూతం' ఎంత హాయిగా ఉంది. నిజమే.

"నే నెలాటి వాణ్ని?
లోకస్య పాపాని వినాశయంతం,
మహోదధిం చాపి సమేధయంతం
భూతాని సర్వాణి విరాజయంతం

న్నవాణ్ని. ఈ జనం రాగ కలుషమైన జీవితం, మీమీ యుద్ధోన్మాదం, మీ రాజ్య లాలస నాకెందుకు అంట కడతారు? నన్ను వేధించడం ఎందుకు? నాపై బాణాలు విసరడం ఎందుకు? అవి నన్నేమీ తాకవు! నన్నేమీ చేయలేవు.

"అయినా, మీరు వచ్చి ఏమి జుర్రుకుంటారు? చక్కని వెన్నెలను కోల్పోతారు. నేను మీకు అయాచితంగా ఇస్తున్న అమృతం అది. మీరంతా నా లోకంలో విడిసి కలుషితం చేస్తారు. అది ఎర్రబడిపోతుంది. ఇప్పుడు నా పెద్దన్నయ్య భౌమన్నను చూచారా? ఆయన ఎలా ఉన్నాడు? మోదుగ పూవులాగ, దాసానిపూవులాగ, మీ రక్తంలాగ, మీరు నిత్యంకోరే పోరితంలాగ ఎర్రగా లేడూ? అలాగే అయిపోతాను నేను కూడా. నాలో దిగి, గుంతలు తవ్వి డేరాలు పాతడం ప్రారంభించారా? సూరన్నయ్య చూపు తప్పుతుంది. నేను ఆయన కాంతిని ప్రతిఫలింపజేయలేను ఇప్పుడున్నట్టుగా. ఎరుపుతిరిగిపోతాను. ఈ వెన్నెల భూమిలోని మీ వారికీ లేకపోతుంది: నా లోకానికి వచ్చినా మీకూ లేకపోతుంది. భూమికాంతి నాపైన మందంగా పడుతుంది. ఆలోచించుకోండి. భగవంతుడు ఇచ్చిన వెన్నెలను ఎందుకు ధ్వంసం చేసుకుంటారు?

"ఇంతకూ మీరు ఎలా నామీద కాలూనగలుగుతారు? అడుగుపెట్టడానికి అర్హత ఉండొద్దూ! నా లోకంలో దిగినా మీరు కాలూని నడవలేరు. పక్షులలాగ పాకాలసిందే. హనుమంతునిలాగ కుప్పిగంతులు వేయవలసిందే. ఆకలీ దప్పీ అయినా అన్నం చేతికి అందదు. చేతికందినా—చేతికందింది నోటికి అందకనే మీ సామెత సార్థకమౌతుంది. అన్నట్టు మరిచాను. ఏమి తిని ఉంటారు. మీరేమి చకోరాలా? నా వెన్నెలు చిన్నెలు చిదిమి మింగి ఊరికే ఉండడానికి? ఆ చంద్రికా చలారిపోతూంది గా? తిప్పలూ ఉండవు. ధుమ్ముధూళీమాత్రం ఉంటుంది. దానిలో పొర్లాడాలి. అంతే. ఇంకా కావాలంటే అగ్నిపర్వతాలూ, పొగలూ సెగలూను. నా జోలికి రాకుండా ఉంటే ఎంత చల్లని చూపుతోనైనా చూస్తాను. నాకే ఎసరు పెడితే ఊరికే ఉంటానా?రండి. నాపై కాలు పెట్టనివ్వను. దుమ్ములో పొర్లాడిస్తాను. అగ్ని పర్వతాలు బద్దలుకొట్టి లావా ప్రవాహంతో నింపివేస్తాను. ఇంకా ఎన్నో శతమానాల వరకు ఒక్క ఓషధినైనా మొలవనివ్వను. రెక్కలు కట్టుకుని యంత్రాలమీదే కాపురంచేస్తారా? చేయండి. ఎన్నాళ్ళు గాలిలో ఈదులాడుతారు? విరిగి పోతారు.

"ఛీ! ఛీ! మీరు కూలడం ఎందుకూ! నేనే కూలిపోతాను. మీరు అడుగుపెట్ట గలిగే వేళకు నేనే ఉండను. భూమమ్మ చుట్టూ ప్రదక్షిణంచేస్తూ ఇంత వరకే ఎంతో పలచబడిపోయాను. నాబోటి చంద్రుడు జన్మలో మీకు లభించడు. కుజుని చుట్టూ తిరిగే చంద్రులకు నా కాంతి ఏదీ? వారు మీకు కనిపించనే కనిపించరుకూడా. ఆఁ! మీరు వారిని చూస్తే నేం? చూడకపోతే నేం? మీ బాధపడలేను; మీ వేధకు వేగలేను. ఇక పడి బద్దలై పోతాను. ఇదిగో బద్దలవుతాను. మీ లోకంలో ప్రళయం వస్తుంది. మీకదే శాస్తి!..."

ఇక సహించలేకపోయాను. ఎందుకింత అక్కసు ఈ కుముద బాంధవునికి? చతుర్దశభువనాల విజయానికే పూనుకున్న మానవజాతిని ఎవరు ఆపగలిగేవారు—అనుకుంటూ లేచాను.

—రామచంద్ర

# శాంతిసామ్రాట్టు అశోక చరిత్ర

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

అద్యతన స్వాతంత్ర్య భారత వర్ష మశోకధర్మ చక్ర సంరక్షితమై, అశోక శిలాస్తంభ చిహ్నితమై యున్నది. యావద్భారతవర్షీయులకే గాక, యఖిల ప్రపంచమునకు నాదర్శప్రాయుఁడైన యశోక చక్రవర్తి "శాంతిసామ్రాట్టు" అను నజరామర బిరుదము ధరించిన మహనీయుఁడు. స్వాతంత్ర్యము లబ్ధమైనను రాజకీయ సాంఘికాది సకల వ్యవస్థల యందును 'శాంతి' నభిలషించు నీనాఁడు, శాంతిస్థాపకుఁడగు అశోక చక్రవర్తి చరిత్ర యాంధ్ర మహాజనులకు కత్యావశ్యక పఠనీయ గ్రంథమై యలరారుచున్నది. అమృతమూర్తి యగు నశోకుని చరిత్ర మీనాఁడమృతమయమగు నాంధ్ర భాషలో నందించిన వారు—ఋషితుల్యులు, గురుకులక్లిష్టులు, గణనాతీతకవితాసంపన్నులును నగు కల్లూరి వేంకటనారాయణరాయ మహాశయులు.

అశోక చరిత్ర, రాయలసీమలో, ననంతపురము ననే వెలువడుటయు నొక యపూర్వచారిత్రక సన్నివేశము. ఆ మండలమున గుత్తి తాలూకా యందలి 'ఎఱ్ఱగుడి' యందు, చరిత్రకారుల కెవరికి నందని అశోక శిలాసనములు దొరికినవి. 1. అట్టిపావన క్షేత్రముననే, అశోక చరిత్రము వెలువడుట యాంధ్రుల యదృష్ట విశేషము.

గ్రంథకర్త తను రచించిన యశోకచరిత్రమునకు మూలము. తెనుఁగున వచన రూపముననున్న 'బేతపూడి లక్ష్మీకాంత విరచితమైన "అశోక చరిత్రము"2 అని తెల్పి యాగ్రంథకర్తకు తన కృతజ్ఞతను పద్యరూపమున వెల్లడించినారు. అంతియేకాక, ప్రాచ్య పాశ్చాత్య పండితులు, తమ పరిశ్రమల మూలమున వెల్లడించిన చారిత్రకాంశములను నిందుఁ గ్రంథకర్త పొందుపఱచి తొలుత నశోకచరిత వ్రాసిన యాతని పేరు స్మరణీయ మగునట్లును, ఆ పేరటనే యున్న తన గ్రంథమునకు ప్రత్యేకత చూపుటకును, "శాంతి సామ్రాట్టు- అశోక చరిత్ర" యని నామకరణము చేసియుండుటయే గాక, నవ్యాంధ్ర సాహిత్య వీథి నొక దివ్య కావ్యజ్యోతిగా దిద్ది తీర్చినారు.

ప్రాచీనాంధ్ర కవితా సంప్రదాయములను, ప్రాచీనకవుల పలుకుబడిని జీర్ణించుకొని, నవ్య కావ్య నిర్మాణము చేసిన సిద్ధహస్తులలో శ్రీ వేంకటనారాయణ రావు గారు అత్యంతము గణనీయులు. అశోక చక్రవర్తి చరిత్ర నవ్యాంధ్ర సాహితీజగత్తులో నొక విశిష్టకృతి: మహాకావ్యము. ఇట్టి లోకోత్తర రచన ఋషికల్పులకు మాత్రమే సాధ్యము.

అనిర్వచనీయమగు నశోకుని చరిత్రమును నిర్వచన మహాకావ్యముగ బోధార్థిం గులు నిర్మించిరి. దీనిని జూచఁగనే నిర్వచనమైన తిక్కన మహాకవీంద్రుని 'ఉత్తరరామాయణము' జ్ఞప్తికి వచ్చినది. అదియుత్తర కాండ మాత్రమే. ఈ గ్రంథము సంపూర్ణ రామాయణమే – అశోక రామాయణము. ఇందు షట్కాండలు, పరిశిష్టమగు నుత్తర కాండమును గలవు. మఱియుఁ గవితారచనలో సామ్యము గలదు. తిక్కనవలె ప్రసిద్ధమయిన వృత్తములను మాత్రమే కృతికర్తలు వాడుక చేసియున్నారు. ప్రాచీన కావ్యము లందువలె, అశోక చరిత్రమును శ్రీకారముతో మొదలిడును. ఇష్టదేవతా స్తుతి, యవతారిక యైన వెనుక కాండాద్యంతముల యందు కృతిపతి సంబోధన గల్గియున్నది.

ఈ మహాకృతి దివ్య తిరుపతి క్షేత్రమున వెలసిన శ్రీ వేంకటేశ్వరునకుఁ గృతి. శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రశంసయే గాక యితర దేవతాస్తుతులును నిందు గలవు. ఇంకొక విశేషము. కృతి శ్రీకారముతో మొదలిడుటయే గాక, మంగళమహాశ్రీవృత్తముతో పూర్తియగుచున్నది. ఈ సంప్రదాయమును నాంధ్ర

1. చూడుఁడు 'అశోకుని శిలాశాసనములు–రాయలసీమ.' సంపాదకులు సుప్రసిద్ధాంధ్ర దేశీయ చారిత్రకాచార్యులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు. భారతి (సెప్టెంబరు 1929).

2 ఈ 'అశోక చరిత్రము' పూర్వము బందరునందుండెడి "ఆంధ్ర భాషాభివర్ధనీ సంఘము" వారు ప్రకటించి యిప్పటికి నలువది యేఁడులైనది. (1912)

వాఙ్మయమునఁ దొలుత ప్రవేశ పెట్టిన మహాకవి, నన్నెచోడ కవిరాజశిఖామణి. అతఁడు తన కుమార సంభవమున, మంగళమహాశ్రీ వృత్తముతో వృత్తనామము నందిమిడించి, గ్రంథము పూర్తిగావించినాఁడు. దీని నే ముద్రాలంకారమని యందురు. జక్కన, పింగళిసూరన మొదలగు కవు లీ సంప్రదాయమును పాటించిరి. ఆధ్యతనకృతులలో, అశోకచరిత్రమున "శ్రీవరవధూమృగు కుశేశయ......జయమంగళమహాశ్రీ" అను నీ సంప్రదాయము పాటింపఁబడినది.

గ్రంథాదిని గల "శ్రీ శస్త్రాంకమునన్ ధరాతనయ ...రామపతి మాకిచ్చుఁ జయశ్రేయముల్" అనునది శ్రీరామపరముగా నున్నను, అది సీతారామాంజనేయ సారముగ నద్వైతతత్త్వమును దెలుపునది. కావ్య ప్రారంభమే గంభీరభావ పూరితమై యున్నది. ఇతర దేవస్తుతి పిదప పతంజలిస్తుతి నూతనమే. దీని వలన కల్లూరివారు, సంస్కృత వ్యాకరణమును సాంగముగా నధ్యయనించిరని తెలియనగును.

మంజుల యోగధనార్ధికి
నంజనమై వ్యాకృతికి మహాభాష్యలస
న్మ్రంజిని బ్రాహ్మ్యము నొసగు ప
తంజలి శేషావతారుఁ దలతుఁ భక్తిన్

ఆపై కృతిప్రేరేపకులగు శ్రీ కల్లూరు సుబ్బరాయ నాయకమౌళి ప్రశంస: "అతడు సద్బంధు భాగి- పుణ్యగణ భోగి - సత్కళాపూర్ణ యోగి."

శ్రీ వేంకటేశ్వరాంకితముగ వెలయు నీకావ్యము నందలి కావ్య గుణములను వివరించెదను.

## ప్రాచీన కవితాసంప్రదాయములు

ఈ కావ్యమునం దెక్కడ చూచినను ప్రాచీనాంధ్ర మహాకవుల కవితారీతులు, పదగుంభనము ప్రత్యక్షమగుచుండును. నన్నయనుండి యిన్నూరేండ్ల క్రిందటివఱకు వెలసిన మహాకవులు మనకు దర్శనమిచ్చుచుందురు. పదముల యొత్తుగడలలో పద్యముల నడుమ ప్రాచీన కవుల రచన ప్రతిబింబించుచుండును. మచ్చునకుఁ గొన్నిటిని వినిపింతును.

నన్నయ—రయ విచల త్తురంగమ తరంగములన్
సభా ౨-౩౩

అ. చ.—క్రమరయ విచల త్తురంగములును
౪-౨౦

తిక్కన—రాజగృహంబు కంటె నభిరామముగా
విరా. ౧-౧౨౦

అ. చ.—రాజగృహంబు కంటె నభిరామముగా
౩-౧౨౫

ఇచట 'రాజగృహము' అను రాజధానీ నగరము పేరును, రాజగృహమను రాజప్రాసాదమును చక్కగా నెక్కొనినవి కాబట్టియే కృతికర్త యీ పదమును " " ఇట్టి చిహ్నలతో చూపిరి.

నాచసోమన – అభ్రంకషంబైన యాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు.

అ. చ.—తిమురు రాజుల తుమఁ దేల్చి యజ్ఞానమ్ము
గూల్చె నీతఁ డితండు గాల్చినాఁడు.
౩-౨౨౦

పోతన—1. స్వస్తి జగత్త్రయీ భువనశాసనకర్తకు
అ. చ.—స్వస్తి జగత్త్రయీ సుపరివశ్య ౪-౬౩
2. లలిత రసాల పల్లవఖాదియై చొక్కు
అ. చ.—లలితరసాల పల్లవములన్ ౪-౪౪
3. అటఁ గాంచెన్ గరిణీ విభుండు...
నట దిందీవర వారమున్...
అ. చ.—నట దిందీవర వార వందిగణముల్. ౪-౧౨౨
4. పాదద్వంద్వము నేలమోపి పవనుఁ బంధించి
అ. చ.—పాదద్వంద్వము నేల నూఁది పవనున్ బాలించి

పెద్దన .ఇంతలు కన్నులుండ మను. ౨
అ. చ.—ఇంతలు రేఖ లుట్టిప ౨-౧౪౫
తొంగలి రెప్పలన్ మను ౨-౩౨
అ. చ.—తొంగలి రెప్పలఁ ముదము దోఁగ ౪-౧౩౧

అచ్చటచ్చట ప్రాచీన చాటువుల పరిచయము కవి చూపించినాఁడు.

చాటువు—ఆకల్లాడ దదేమొ నేఁడు పవనుండు
అ. చ.—ఆకల్లాడక నిల్చె బుద్ధికుజమ... ౧-౨౧

ప్రాచీనానుసరణము తోడనే నవ్యత ప్రతిపాదితము కావలయునని కొందఱి యాశయము. మన యాంధ్ర సాహితీ సంప్రదాయమున ననూచానముగా వచ్చుచున్నదీ పద్ధతియే యని విజ్ఞులయాదేశము. పాల్కురికి సోమనాథ, తిక్కన, శంభుదాస, నాచన సోమ, శ్రీనాథ, పెద్దనాది మహాకవులు తమ రచనలకిట్లే నూతనత్వము ప్రతిపాదించిరి. ఆనాఁడు రాయలకవితాపితామహుఁడు పెద్దనవలె, కల్లూరివారు, "క్రొత్త ప్రాఁతల మేలికలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మ" నూత్నపథకమునకు మార్గదర్శకులైరి. శబ్దపరికర సంపత్తి ప్రాచీనుల నుండి గ్రహించియు నూతన భావస్ఫోరకముగు రచన గావించుట యిందలి విశేషము. "కళావిదగ్ధతల్ జంగమరూప మెత్తెనన" [illegible]క్యణితులు "ప్రాజ్య ప్రమేయోచ్చలత్పల్యాణోద్వహానాశయాశ్వములు" "ఇగ్భాగతాధ్యాత్మశేముషి" — అను రచన లచ్చటచ్చట ముచ్చట గూర్చుచున్నవి.

నూతన రీతికి నీ క్రింది పద్యమొక మచ్చుతునక:

ఉ. కామవికార దూరము ల
　　　　కారణతన్మయతానురాగసం
క్రామిత చిత్త భూముల వి
　　　　కార పరస్పర సానుభూతికిన్
ధామము లవ్వి! కల్పిత క
　　　　థానిక లౌనె? విరించి బద్ధముల్
ప్రేమ నిగూఢ జీవితపుఁ
　　　　బీఠిక లైన విధూవరార్థముల్.

## శబ్దపరికర సంపత్తి

సంస్కృతాంధ్ర శబ్దశాస్త్ర పరిశ్రమచేయు వారికీ కావ్యమొక పెన్నిధి. పూర్వకృతులలో ప్రయుక్తములైన తత్సమపదములును దేశ్యాన్యదేశపదములును నిండు చూపట్టుచున్నవి. తత్సమపదములును సంస్కృత వ్యాకరణ మర్యాదానుసరణములై యున్నవి. కతిపయములు మాత్రమే ప్రదర్శితములు.

అంశూమ (౫ ౧౭౨), అకసాంద్రదవనము (౧-౬౪), అఘమర్షణసూక్తము (౫-౬౮), అధీనానీకిని (౫-౯౫), అభ్యస్తశాస్త్రీఁకు (౫-౪౭), అరీణపరాక్రమ (౩-౧౧౯), అరీణనయాళు (౮-౧౦౮), అళిందము (౫-౧౭౯), ఉన్నమితుఁడు(౫-౧౬౩), ఉపత్యకము(౮-౧౦౭), ఉశనశ్శేముషి (౧-౩౪), ఋతంభరుఁడు (౬-౧౪౪), ఏకోదగ్ర (౬-౮౨), కర్లజపులు (౪-౭౯), కాంజ్ఞానులు(౫-౧౦౦). కాశ్యపి,(౪-౪౬) (భూమి), కాస్పతికుఁడు (౯-౧౬౪), కుతస్త్యము (౫-౧౮౨), గోహరి (౫-౧౯౫), తనుహింసనము (౫-౨౦౧), ధిత్సువులు (౬-౬౪), నభశ్శక్రవారము (౨-౧౦౬), నిర్ణేజకుఁడు (౪-౪౮), పర్వరీణము (౬-౯౪), ప్రాజితులు (౪-౧౦౧), బుభూర్షువు (౫-౬౬), రుంద్ర (౪-౧౧౯),రింఛోళి, వావదూకుడు (౨-౭౩), విశులు(౪-౧౧౧), హిండనము(౧-౨౦౧).

ఈ క్రింది సమాన రచనల నవలలోకింపుఁడు.

"శుంభత్కలధౌతస్వచ్ఛాంభః ప్రతిబింబ(౧-౨౭), ఘన గరుదత్యయనిపాత గతి (౧-౩౯), ప్రజాస్వామ్య ధీపల్యంకంబు (౧-౫౮), సమాయత్తశిరస్త్రాణబాణుఁడు (౧-౬౦), సంస్వాయద్దివ్య సుఖానుభూతి (౧-౮౭).

ఒక మధురస్వనము :

　"తపశ్శృంగదళిత సత్వాబ్జగళత్
　ఘనశాంత్యమృత నిధానము." (౬-౨-౮౦)

ఒక కలకలము:

　"సకలవనాంత వాసంతోదితలతాంత
　కలిత కోకిల కుహూకాకలకలము" (౬-౭౨)

ఒక స్వైర విహృతి:

　హరిత శాద్వలకుళుత్థాంకురభూ చాత్
　కృషభరాజస్వైర విహృతి గరిమ (౬-౭౨)

సంస్కృత సమాసము లెంత మనోహరముగ, ప్రసన్నముగఁ బొంగుపడినవియో తెలుపుటకు నీ క్రింది శరద్వర్ణనము చాలును.

　"సౌహార్దార్ద్రివనాంతరమ్యసుమన
　　　సౌరభ్య సంపాదియై
　యా హర్మ్యాంతర భూగినందనగవా
　　　క్షాగ్రంబు సుందాకినీ
　వాహిన్యుత్థితగంగ శైత్య విలస
　　　ద్వాతాహతిన్ జల్లనా
　నీహారాంశు విసర్గభోగరుచు లం
　　　దించున్ శరద్రాత్రులన్.

　"ఆగ్రహారంబులు పగళివ
　కర్తృకములు సాంద్ర చంద్రికానంద కళా
　నర్తకికి నాట్యశాలలు
　కార్తికరాత్రులు రహించెఁ గమనీయములై"

## ఛందస్సు

ఈ మహాకావ్యమున శబ్దపరికర సంపత్తి వలెనే ఛందస్సును ప్రశంసింపదగినది. ఇందుగల 1416 పద్యములలో మూఁడవవంతు పైగా-ననఁగా 489 కందపద్యము లున్నవి. "కందము చెప్పినవాఁడే కవి, పందినిఁ బొడిచినవాఁడే బంటు" అని నానుడి. ఇక్కడను తిక్కనయే నా తలపునకు వచ్చెను. రాయలసీమ కవి, హాస్యకళా నిపుణుఁడు అయిన చౌడప్ప:[3]

　"ముందటి దినములలోపల
　కందమునకు సోమయాజి ఘనుఁ డందురు నేఁ
　డందఱు నను ఘనుఁడందఱు
　కందమునకుఁ గుందవరపు కవి చౌడప్పా"

అని చెప్పికొనెను. కవి చౌడప్ప మట్లవారి యాస్థాని. ఇప్పటి మూడు శతాబ్దులనాఁటి వాఁడు. ఈనాఁడు తిరిగి రాయలసీమలో కల్లూరి మహాకవీంద్రుఁడు,కందము

3. చౌడ శబ్దము – 'చాముండీ' శబ్ద తద్భవము. "చాముండ" (నవ దుర్గలలో నొక భేదము),"చావుండ", "చౌడ" – అని రూపావతారము. చముడయ శబ్దమును చాముండ శబ్దరూపాంతరమే. "సరసవాక్తంత్రి రెంటాల చముడమంత్రి" అని కవిప్రయోగము.

రసవన్మాకందముగా నాధ్యాత్మిక విద్యామూలకంద ముగా సంతరించియున్నారు. ఈసందర్భమున మరియొక సారస్వతవిషయము. ప్రాచీనాంధ్ర కవులలో నన్నయ, నన్నిచోడ కవులిరువురును నెక్కువగా వాడిన ఛందస్సు కందమేయని తెలియఁదగును. షష్ఠ కాండమున బౌద్ధ ధర్మములను వివరించు దండకమొండు గలదు. ఇదియుఁ బ్రాచీన కవితా సంప్రదాయమే. సప్తమ కాండమున మంజరీ ద్విపద 'నవము'గ నున్నది. ఇది తిప్పయగణితాలాపముచేత నెంతయు నౌచితీయుతమైయున్నది.

## వర్ణనలు

ఈ కావ్యమునం దష్టాదశ వర్ణనలును గలవు. కృతికర్త యే షష్ఠ కాండాంతమున

క. అష్టాదశ వర్ణనములు
శిష్టములై మరల నీవ చేసితివి కృతిన్
కష్టములెల్లను దీర్చు మ
రిష్టము లుపశమింప నీ.కరుణ దయాళూ. 307 ప.

అని స్పష్టపఱచి యున్నాఁడు. నవీన కాలాభిరుచి ననుసరించి, యొండురెండు వర్ణనము లుపసర్జనము గావింపఁ బడినను తక్కినవి సందర్భోచితముగానే పొందుపఱచినవి. సముద్రవర్ణనము సింహళమునకుఁ గూతుగు నశోకుఁ డంపుచుండు కావింపబడినది ఇది యెంతయు సుచితము. షడ్రుతు వర్ణనలును సరసముగ నున్నవి. వేటవర్ణనము బెంగుసాగుఁడు వేటకు వెడలు నప్పుడును, సూర్యోదయ చంద్రోదయ వర్ణనలు తత్తత్ స్థలములయందు వర్ణితములు.

"భల్లునఁ దెల్లవారిన న
భస్సుఁ బెనూరుఁడు బిల్వ, నయ్యుషా
వేల్లిత బాహువల్లరులు
వీఁగఁగ ఝల్లి తాగ కార్తి ధ
మ్మిల్లము నొత్తి కడ్కని స
మిద్ధ కుసుంభరుచి ప్రకీర్ణమా
యొల్లని దాల్చి యెక్కెను ము
హోదయ డర్ధుఁడు ప్రాజ్ఞగాత్రమున్."
౮ కాం. ౩ ప.

అని జగద్బంధుని ప్రాజ్ఞగ పీఠి నెక్కించినారు. "అర్ధచంద్ర వలయంబను తెఱుగున శీతల మరీచి గణోద యముల నుడుతతికి." దనిపించిన మనీషి కృతికర్త. నవసర భావభరితంబై, అష్టాదశ వర్ణనాత్మకము నీ కావ్యము

"పెన్న యుంగవడి కృష్ణాగభీరతయును
తుంగభద్రా తరంగ మాధుర్యగతియు
నఘహారిణ యమునా ప్రవాహంబు రీతి"

పరమ పావనమై విరాజిల్లుచున్నది.

## ఆధ్యాత్మిక దృష్టి

"అన్ని యొకయెత్తు అగస్త్యుఁ డొక యెత్తు" అన్నట్లుగా అశోక చరిత్రమున, ఆంధ్రసాహితీ సంపద యొక్క యెత్తు; ఆధ్యాత్మిక తత్త్వ వివేచన సంపద యొక్క యెత్తు అని చెప్పవచ్చును. బౌద్ధమత ధర్మముల నిందు సామూలాగ్రముగ వివరించుటయే గాక గ్రంథ కర్త హైందవాధ్యాత్మిక వాఙ్మయ శిరోభూషణము 'భగవద్గీత' యొక్క సారమును వివరించియున్నారు. మఱియు నుపోద్ఘాతమున నాంగ్లేయభాషలో ముప్పది మూఁడు పుటల గ్రంథములో, ముప్పదిమూఁడు కోట్ల భారతీయుల కాధారమైన వేదాంత తత్త్వమును విశ్వ మానవప్రపంచశాంతి సందేశముతో సమన్వయము గావించియున్నారు. ప్రాచ్య పాశ్చాత్య వేదాంత తత్త్వము సామూలాగ్రముగ నాకళించి యాతత్త్వ ప్రబోధనము గావించుటచే వీరికి "బోధార్థిగుండు"ను నామము సార్థకమైనది.

ఆంధ్రసారస్వతమున బౌద్ధ వాఙ్మయమునకును, నశోకునికిని సంబంధించిన గాథలెన్నియో సూచితము లైనవి గ్రంథకర్త వానిని బరిశీలించి, పరిశిష్ట సప్తమ కాండమునం గుదాహరించుట సమంజసమై యున్నది

## రాయలసీమ కవిత్రయము

తెనుగుదేశమున తెనుగు కవితకు కవిత్రయ సంప్రదాయము జగద్విదితము—అది ప్రాచీనకాలము స్థానిక నిర్దేశమున సాగరతీరప్రాంతము. నవీనకాలమున రాయలసీమలో—గుర్భాక—గడియారము—కల్లూరి కవిత్రయము. శివభారతము గడియారము సంతరించిన, కల్లూరి అశోకరామాయణము సంతరించినారు. గడియారము కవిబ్రహ్మ—కల్లూరి కవివిష్ణువు—గుర్భాక కవిరాజశేఖరుఁడు. ఈ ముప్వురి కృతులు త్రిలింగ క్షేత్రమున నాచంద్రార్కము తేజరిల్లుగావుత!

ఏవంగుణవిశిష్టమగు నీ మహాకావ్యవాహిని సర్వాంధ్రసాహితీ క్షేత్రమును పవిత్రము గావించి వెలయుగలదని బోధార్థిగుల వాక్యములతో ముగింతును.

"లలితసుకందవృష్టి విచ
లత్సుమనో వ్రజహృద్యరీతి సం
కలితము రాజహంస గతి
కాంతము సౌగతబంభరీస్వరో
చ్ఛలితమమేయదర్శన ర
సప్రవిశిష్టభవాగ్వినీతమై
వెలయుత గావ్యవాహిని న
వీన గుణోర్మిచయప్రపూతమై."

# కలగూరగంప

## భావనాంకురము

శ్రీ హా. శి. గారు నేను ప్రయోగించిన 'భావనాంకురము' అన్న పదాన్ని భారతి ఆగస్టు సంచికలో ఆక్షేపిస్తూ, కవిని, ఋషి అని అన్నారని, కళాకారుడుకూడ కవివంటివాడే గనుక, అతడు కూడ ఋషి అని అన్నారు. ఇంతేగాక, సాధకుడైన వాడు యోగిగాన, కళాకారుడు యోగి కాడన్నారు. కాని స్టెల్లా క్రామరిచ్చి శిల్పిని, మహాయోగి అని మన ప్రాచీనులనెడి వారని, ఆరీతిగనే గౌరవించెడి వారని స్పష్టంగా సెలవిచ్చారు. దీనికి కారణం సయితం వారు తర్జుమా చేసిన 'విష్ణుధర్మోత్తర' మందలి పీఠికలో విశదీకరించారు. శివుణ్ని మహాయోగి అంటారు. అదే రీతిన రూపములను సృష్టించు కళాకర్త మహాయోగి. మానసారమనే గ్రంథం తర్జుమాచేసిన మహామహోపాధ్యాయ శ్రీ పి. కె. ఆచార్యగారు సయితం ప్రాచీన శిల్పులను మహాయోగులుగా పరిగణించు విషయమును తెలిపారు. ఇంతే కాదు. శిల్పకళల్లో ప్రతిరూపసృష్టి ఒక సాధనే అవుతుంది. తప్పదు.

దాదాపు ఏభయి సంవత్సరములనుంచి, పాశ్చాత్య ఖండమంతటా కళావిమర్శ విజృంభించినది. అనేక నూతన పదములు, అన్నిభాషలలోనూ తయారయినవి. విలసన, పాశ్చాత్యభాషలలో కళాపరిభాషకు నాడు కావలసిన పదములు లేవు. క్రొత్తగా వచ్చిన పదములను విమర్శకు లందరు ఒకేఅర్థమున సయితము, ఈనాటి వరకు కూడా వాడకుండుట కలదు. అనేక పదములు నిఘంటువులను మించిన అర్థములను అందుకొన్నమాట కూడ వాస్తవము. అలాగే ఈ మోటిఫ్, మోటివ్ కూడ వాడడం జరిగింది.

ఈ "మోటిఫ్" పదార్థమునకు బౌద్ధమంత్రములందలి ఒక వాక్యమును నేను ఉదాహరించినమాట వాస్తవమే. అది బౌద్ధం అయినందువలన మనము నిరసింప నక్కరలేదు. ఆదినకూడ బౌద్ధులే మన శిల్పకళలందు ముందంజవేశారు. వారి గ్రంథములలో శిల్పశాస్త్రము లనేకములు వెలసినవి. అవికూడ మన కళకు ఆధారములే. వారు శూన్యత అనే పదం వాడారు. అయితే ఏం? బీజం వారు శూన్యతనుంచి స్వీకరించిన మనం బ్రహ్మపదార్థమునుంచి స్వీకరించవచ్చును.

ఈ "మోటిఫ్" పదము కళా పరిభాషలో కల్పనకు, ముందున్న భావములకు, ఆది వస్తువులకు, రూపములకు మొదలయిన వాటికెల్ల, పాశ్చాత్య విమర్శకులు అనేకమంది వాడారు. నేడీ పదం క్రొత్త ఆంగ్ల విమర్శ గ్రంథములందు, "మొటివ్" అని కూడ వాడబడుచున్నది.

ఈభావనలుపుట్టు రూపములకు, మూలధాతువని, మూలభావన అని, కల్పనాధాతువని అనడానికి ఎందుకు వీలులేదో ఇదివరకే నేను సూచించాను. భావనాంకురం అని నే నెందుకు వాడానో కూడ తెలిపాను. కాని భావనాంకురం అనేది మన వ్యాకరణరీత్యా తప్పర్థమిచ్చును అని, శ్రీ హా. శి. అన్నారు. కాని, నేను తెలుగు పండితుడను కాక పోయినప్పటికి, అప్పుడప్పుడు కొన్ని తెలుగు పుస్తకాలను, వ్యాసాలనుకూడా చదువుతుంటాను. "వంశాంకురం" అనే పదం వాడుకలో ఉంది. "వంశాంకురం" వంశానికి ఆధార భూతమయినప్పుడు, "భావనాంకురం" భావనకు ఆధారరూపం ఎందుకు కాగూడదని నా సందేహము. అయినప్పటికి ఈ "భావనాంకుర"వాదం నేను పండితులకు ఒప్పజెప్పి విరమిస్తున్నాను.

ఆమంచర్ల గోపాలరావు.

## ప్రత్యుత్తరం

శ్రీ గోపాలరావుగారు నేను భావనాంకురం చర్చలో వ్రాసిన అంశాలను గురించి దయచేయించిన ప్రత్యుత్తరాన్ని చూచాను. వారు శిల్పిని యోగి అనవచ్చునని అనడానికి, స్టెల్లా క్రామరిచ్చిగారు, మహా

మహోపాధ్యాయ పి. కే. ఆచార్యగారు వ్రాసిన అంశాలను తోడు తెచ్చుకున్నారు. స్టెల్లా క్రామరిచ్చి గారికి మనదేశం సంప్రదాయం తెలుసునని నాకు అన్పించలేదు. ఇక మహామహోపాధ్యాయ పి. కే. ఆచార్యగారు "ప్రాచీన శిల్పులను మహాయోగులుగా పరిగణించు విషయమును" చెప్పారేగాని, వారిని మహాయోగు లనలేదు. శిల్పులను, కవులను యోగులంటే మాకు గూడా అభ్యంతరంలేదు. అయితే అది సాధన అనే అర్థాన్ని మాత్రమే ద్యోతకం చేస్తుంది. ఋషి శబ్దం అట్లా కాదు. ఋషి బ్రహ్మసాక్షాత్కారం పొందినవాడు. కవి, శిల్పి, ఇత్యాదయః ప్రతిభావంతులు; బ్రహ్మానంద సహోదరమైన రసాన్ని పండించేవాళ్లు. ఈ తేడాను గుర్తించవలసిందిగామాత్రం నేను మనవి చేసుకొనివున్నాను. శంకర భగవత్పాదులవారు గూడా యోగసాధనవల్ల కల్గే ఆనందానుభూతి బ్రహ్మానందానుభూతికి ఎన్నడూ సరికాదని వ్రాసివున్నారు. కవి శబ్దంలోవున్న ఒక సొగసు బ్రహ్మానందానుభూతి పొంది, దాన్ని అందరికి పంచిఇచ్చేవాడనే తెలుసుకోవలసివుంది. అందుచేతనే అతడు ఋషి.

రెండు: శివుడు మహాయోగి అన్న విషయంలో మాకు విప్రతిపత్తిలేదు. కాని శివుడు శిల్పి, కవి అవుతాడా? అదీగాక భారత సంప్రదాయం ప్రకారం శివుడు లయకారుడుగాని, సృష్టికర్త కాదు.

మూడు: 'భావనాంకురం' అన్నమాట తప్పని నేను అనలేదు. వంశాంకురం ఎంతరైటో, భావనాంకురం గూడా అంతే రైటు. కాని అందువల్ల శ్రీ గోపాలరావు గారు ఆశించిన అర్థంమాత్రం రాదన్నాను. భావనాంకురాలు "అంటే భావనలు అంకురించిన రూపములగుటం జేసి, నేను వాటిని భావనాంకురాలు అన్నాను" అని, "మోటిఫ్ అనునది ఈ భావనకు సయితము పూర్వమయిన ప్రకృతియందలి, చిత్రకారుని ఆకర్షించి, అతని మననమునకు పాత్రమయిన బీజరూపము" అని శ్రీ గోపాలరావుగారే సెలవిచ్చి వున్నారు. ఈ సెలవిప్పించిన అర్థమును వ్యంజింపచేయగల శక్తి "భావనాంకురం" అన్న సమాసానికి లేదని మాత్రమే నేను అన్నాను. అటువంటి అర్థము కుదరాలంటే ఇదివరకు వ్యాసములో ఇచ్చినమాటలే గాక, భావనాయోని, లేకపోతే భావనాబీజము అనిగూడా వాడుకోవచ్చు. అంతర్లీన విమర్శమై, అవ్యక్త స్థితిలోవున్న శక్తిని, వేదఋషులు సర్వబీజము అని అన్న ఉదాహరణలు వేదంలో చాలా కన్పిస్తాయి. అదే చెప్పాను. అంతేగాని వివిక్తంగా భావనగాని, అంకురంగాని తప్పనిగాని, ఆ రెండు శబ్దాల కలయిక చేత ఏర్పడిన భావనాంకురం అనే మాట వ్యాకరణ దుస్సాధం అని గాని

నాలుగు: బౌద్ధులు చెప్పే శూన్యత శ్రీ గోపాలరావుగారు సరిగా గ్రహించినట్టులేదు. బౌద్ధులు సాహిత్యాది ప్రక్రియలకు శూన్యతను ఎప్పుడూ ఆధారం చేసుకోలేదు. ఈ సూక్తి కేవలం తాత్విక, తాంత్రిక ప్రక్రియలకు సంబంధించింది.

హా. శి.

[భావనాంకురమనేమాట వివక్షితార్థ ప్రతిపాదన శక్తమని శ్రీ గోపాలరావుగారు, వివక్షితార్థ ప్రతిపాదనాశక్తమని శ్రీ హా. శి. గారు అంటున్నారు. నిర్ణయాన్ని విజ్ఞులకు వదలి, ఈ చర్చను ఇంతటితో సమాప్తిచేస్తున్నాము.

—సంపాదకుడు.]

## అమరుశతక వ్యాఖ్యాత కాకతి ప్రతాపరుద్రుడేనా?

డాక్టర్ సుశీలకుమార డేగారీ మధ్యన అమరు శతకమును రుద్రమదేవ కుమారుని వ్యాఖ్యానముతో 'అవర్ హెరిటేజ్' (సంపుట 2, భాగం 2, పుటలు 265–315, జులై—డిసెంబరు 1954)లో ప్రకటించిరి. ఆ సందర్భమున నీ వ్యాఖ్యాతనుగూర్చి "రుద్రమ యనుపేరు కొంత వింతగా నున్నది. దక్షిణ హిందూదేశమున నిట్టి పేరు సామాన్యము. దక్కను నుండి పాలించిన కాకతీయ గణపతిదేవుని కుమార్తె యగు రుద్రమదేవి రుద్రాంబ, రుద్రమ్మ, రుద్రమ అని వ్యవహరింపబడుచుండెను. కాని ఈ స్త్రీ నామమున కిచ్చుట సంబంధము కన్పట్టదు. ఉపలబ్ధమైన రుద్రమదేవ కుమారుని లిఖితపుస్తకాల కాలమునుబట్టి ఆతడు క్రీస్తుశకము 15 శతాబ్దమునకు పూర్వమే జీవించియుండినట్లు స్పష్టమగుచున్నది. ప్రస్తుత మింతకంటె తెల్పుట కవకాశములేదు."—అని ఈ విషయమున శ్రీ డేగారే పరిశోధకులకు చక్కని మార్గమును సూచించి విడిచిపెట్టిరి. వారేకారణముచేతనో వ్యాఖ్యాత పూర్తిపేరగు 'రుద్రమదేవ కుమార'లోని 'కుమార' శబ్దమును గ్రహింపక 'రుద్రమ' లేక 'రుద్రమదేవ' యని మాత్రమే తీసికొని చర్చించిరి. కాకతి గణపతిదేవుని యనంతర మాతని కుమార్తె రుద్రమదేవి,

రుద్రదేవుడు లేక రుద్రదేవ మహారాజని పురుష నామముతో సింహాసన మధిష్ఠించెను. విద్యానాథకృతమగు ప్రతాపరుద్రీయమునకు రత్నాపణమను వ్యాఖ్యానము రచియించిన కుమారస్వామి 'తన్మహిషీ రుద్రమదేవీ' అని రుద్రాంబను గణపతిదేవుని భార్యగా తప్పుగా ప్రథమమున పేర్కొనినాడు. విదేశీయుడగు మార్కోపోలోగూడ ఈ అభిప్రాయమునే వెలిబుచ్చెను. కాని తరుపరి లబ్ధమైన రుద్రాంబ కోటగిరితామ్రశాసనము, మల్కాపురశాసనము, అనితల్లి కలువచేరు శాసనము మున్నగు ననేక ప్రబలప్రమాణములచే రుద్రమదేవి గణపతిదేవుని కూతురనియే నిశ్చయింపబడినది. మరియు నీమె చాళుక్య వీరభద్రేశ్వరుని భార్య యనికూడ తెలియుచున్నది.

"శ్రీమత్కాకతి వల్లభాద్గణపతి
క్షోణీశ చూడామణేః
జాతా రాజ్యరమేవ రుద్రమ మహా
దేవీ సురూపాన్వితా,
తాం సౌభాగ్య బలా దుదూహ్య విధివ
చ్చాళుక్య వంశాగ్రణీః
ధాత్రీభారధురంధరో విజయతే
శ్రీ వీరభద్రేశ్వరః."

రుద్రాంబకు ముమ్మడాంబ, రుయ్యమ్మ యను నిరువురు తనయలు మాత్రమే గలరుగాని పురుష సంతతి లేదు. మల్కాపుర శాసనములో నామెకు రుద్రదేవుడను కుమారు డొకడుండినట్లు వర్ణింపబడినది.

"యస్యాః కాకతి వంశమౌక్తిక మణేః
శ్రీ రుద్రదేవ స్సుతః
తస్యాః కిం కథయామ వైభవ మతః
శ్రీ రుద్రదేవ్యాః పరం."

ఈ రుద్రదేవుడు ముమ్మడాంబాతనయుడగు ప్రతాపరుద్రుడేయైనచో గణపతిదేవుడు జీవించి యుండగనే క్రీ. శ. 1261 పూర్వమే రుద్రాంబ తన తండ్రియాజ్ఞననుసరించి దౌహిత్రుని పుత్రునిగ పరిగ్రహించెనని చెప్పవలయును. ప్రతాపరుద్రీయములోని ఈ క్రింది శ్లోకముకూడ దీనినే నిరూపించుచున్నది.

"స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే పితు రాజ్ఞయా,
అస్మిన్ విధేహి ధారేయే గుర్వీ ముర్వీధురామితి."

ప్రతాపరుద్రుడు మిక్కిలి బాలుడగుటచే గణపతిదేవుడు స్వయముగ నాతనికి రాజ్యభారము ఒప్పజెప్పక రుద్రాంబయే సింహాసన మధిష్ఠించి పాలింపనుపక్రమించెను?? దీనినే హేమాద్రి "వ్రతఖండము"లో యాదవ మహాదేవరాజును గూర్చి యిట్లు ప్రశంసించెను.

"అయం శిశు స్త్రీ శరణాగతానాం
హన్తా మహాదేవనృపో న జాతు,
ఇత్థం వినిశ్చి
రంధ్రైః పురంధ్రీ నిహితా నృపత్వే"

తండ్రియగు గణపతిదేవునివలెనే రుద్రాంబ కూడ పెద్దకాలము జీవించి క్రీస్తు శకము 1296 లో మరణించెను. క్రీస్తు శకము 1290 నుండి కుమార రుద్రదేవుడను పేరుతో ననేక శాసనములు గన్పట్టుటను బట్టి ప్రతాపరుద్రుడు తన మాతామహియగు రుద్రాంబకు రాజ్యాంగ నిర్వహణమున తోడ్పడుచు ఆమె మరణానంతరము క్రీస్తు శకము 1296 లో రాజ్యాభిషిక్తుడయ్యెను. రుద్రాంబకు రుద్రదేవ మహారాజని వ్యవహారముండుటచే ప్రతాపరుద్రుని శాసనములలో కుమారరుద్రదేవ మహారాజని 'కుమార' శబ్దమును గ్రహించుట పరిపాటియయినది. ఈ కుమార రుద్రదేవ మహారాజే అమరుశతక వ్యాఖ్యానములో వ్యక్తినియమముకొఱకు రుద్రమదేవ కుమారుడని తెల్పుకొనెను.

"అమరుశతక మిద మిత్థం
స్వబుద్ధి విభవాద్ రసాబ్ధి తత్త్వజ్ఞః,
రుద్రమదేవకుమారః
విదగ్ధ చూడామణిః వ్యవృణోత్."

ప్రతాపరుద్రీయమును బట్టి ప్రతాపరుద్రుడు స్వయముగ మహావిద్వాంసుడుగను, చక్కని సంగీత సాహిత్యజ్ఞానముగల రసజ్ఞుడుగను ననేకమంది కవులను గాయకులను పోషించు చుండినట్లు తెలియుచున్నది.

"గోష్ఠీభిః పరితోషయ న్బుధగణాన్
షద్దర్శనీ సీమభిః
సత్సారస్వత మార్గదర్శన చణైః
సూక్తైః కవీ న్ప్రీణయన్,
సంగీతోపనిషద్రహస్య విదుషై
ర్గాతోద్యనోగ్యక్రమై
ర్దివ్యన్ సంసది వైణికాన్ విహరతే
శ్రీ కాకతీంద్రో నృపః"

ఇది కేవల ముత్ప్రేక్ష కాదని కాకతి ప్రతాపరుద్రుడు రచియించినవిగా చెప్పబడు (1) చంద్రికా (ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్య), ఉషారాగోదయం, (3) యయాతి చరిత్ర (ఏడంకముల నాటకము) మున్నగు సంస్కృతగ్రంథములు బట్టియు, విద్యానాథ (అగస్త్య), గంగాధర, నరసింహ, విశ్వనాథాదులగు సుప్రసిద్ధ గీర్వాణాంధ్రకవు లాతని యాస్థానము నలకరించి యుండుటనుబట్టియు సుస్పష్టము.

(అన్నల్స్ ఆఫ్ ది భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ 38 వ సంపుటలో ప్రకటించిన శ్రీ సి. ఆర్. దేవధర్ గారి వ్యాసం ఆధారంగా.)

కె. హెచ్. వి. ?

# గ్రంథ విమర్శనము

## శృంగార మంజరీ

[సంస్కృతం. రచయిత: బడేసాహెబ్ అక్బర్ పుటలు: ఇంపీరియల్ సైజు 202. ప్రచురణ, ప్రాప్తిస్థానం: డైరెక్టర్, ఆర్కియలాజికల్ డిపార్టుమెంట్, హైదరాబాద్.]

గోలకొండ నేలిన కుతుబుషాహీ ప్రభువులకు స్వమతాభిమానం మెండే. కాని, అది బహమనీ సుల్తానులలో ఉన్నట్టు పరమత విద్వేషంగాను, పరమత విధ్వంసకంగాను పరిణమించలేదు. వీరికీ రాజ్యవిస్తరణాకాంక్ష విపరీతమే. కాని, అది బహమనీ సుల్తానులకున్న రక్తపిపాసమాత్రం కాదు. కుతుబ్ షాహీలు స్వభాషను బహమనీలవలె ప్రేమించారు. అప్పుడు దక్షిణాపథంలో శైశవావస్థలో ఉన్న ఉర్దూకు ఊత ఇచ్చారు. ఉర్దూ కవితలు చెప్పారు. "తెలంగాధీశులు" కావడంవల్ల తెలుగునూ పోషించారు. తమ రాజ్యతంత్రాన్ని ఫార్సీలోను జరిపారు, తెలుగులోనూ జరిపారు, తెలుగులో కవిత చెప్పారు.

కుతుబుషాహీ పాలకులలో విశేషంగా కీర్తించదగినవాడు మొదటి కుతుబుషా మూడవ కుమారుడు మూడవ కుతుబుషా ఇబ్రహీం. నిజానికి ఇతడు తెలుగువారికి గర్భశత్రువు. ఇతడు ఏడేండ్లపాటు విజయనగరంలో తలదాచుకొన్నప్పుడు తెలుగు చక్కగా నేర్చుకొన్నాడు. సలక్షణంగా మాట్లాడగలిగాడు. తను గోలకొండ పట్టానికి వచ్చినమీదట అహమద్‌నగర్ సుల్తానుతో కలిసి అళియరామరాజుతో కత్తికట్టి తాళికోట పోరులో ఆతనిని తుదముట్టించి విజయనగరాన్ని తుంగభద్రపాలుచేసిన 'దుర్మార్గుడు'. ప్రాణాలు అరచేత పెట్టుకుని పారివచ్చి పంచజేరి కొడుకువలె కుడిచి రక్షకునే భక్షించిన ఇబ్రహీమును మనవారు తరతరాలకూ క్షమించకపోవలసిందే. కాని, అలా యేమీ జరుగలేదు. ఇబ్రహీం రసహృదయం, పరభాషాసహనం, పరమతగౌరవం తెలుగువారిని లోగొన్నాయి. "కవుల శ్రావ్యమగు కవితాధారా సుధారసమును కుత్తుకబంటిగా" ఇబ్రహీం క్రోలి తల ఆడించగా తెలుగువారు తన్మయులయ్యారు; అతడు అడ్డాదిడ్డిగా తెలుగులో కవనమల్లగా, రాపో అని కవులతో సరసమాడగా, ముగ్ధులై తమ కత డభిరాముడు కావడంవల్ల అతనిని ఇభరాముణ్ని చేశారు.

నవ్వెనా, సంగీత నాదభేద విధిజ్ఞ
ధీరాత్ములకు బదినూరు లిచ్చు;
రమ్మనెనా, సభా ప్రౌఢ సత్కవివర
జాలములకు బదివేలు నిచ్చు;
కూర్చుండు మనియెనా గుణతరశాస్త్రజ్ఞ
లక్షణ విదులకు లక్షయిచ్చు;
'శాభాసురా' యన్న, సకలాశ్రితానేక
కోవిదులకు మెచ్చి కోటియిచ్చు."

అని అతని ముఖకవళికలకు, మాటలకు టీకలు, టూకలు చేశారు. దీనికంతా కారణమేమిటి? అతని రసికత, సరసత. ఇభరాముడు అద్దంకి గంగాధర కవిని రావించి,

"పెక్కుకృతుల్ చమత్కృతులు
బెంపున నందితి గాని నీవు స
మ్యక్కృతి కన్యపై గల మ
మత్వము వర్తిల దందు; లెక్కకుం
బెక్కువ గాగ గోపికలు
మించి వసించిన నేమి? రాధపై
మక్కువ యెక్కువై మిగుల
మన్నన సేయడె శౌరి వేడుకన్?
"అట్లు గావున భారతాఖ్యానమందు
గలుగు తాపత్య చరితంబు ఘనత మెరసి
వివిధ శృంగార మహిమల విస్తరించి
కబ్బ మొనరింపు నా పేర గవివరేణ్య"

అని ప్రాధేయపడి కృతిని పుచ్చుకున్నాడు.

తమ పాదుషా ఆంధ్రభాషను పోషించడం చూచి, అతని ఆశ్రితులు, అధికారులు, మిత్రులు, గురువులూ కూడా తెలుగు కావ్యకన్యలను వరించడానికి తొందరపడ్డారు. ఇబ్రహీం సైన్యాధిపతి అయిన అమీన్‌ఖాన్ ఒక ఆంధ్రప్రబంధం కృతి పొందాడు. ఇదే తెలుగు సారస్వతంలో మొదటి అచ్చ తెనుగు కావ్యమైన యయాతి చరిత్ర.

అమీను ఖానుడూ మంచి రసికుడు. తరతరాలుగా ఆయన వంశంవారిది గోలకొండకు సమీపంలోని

పొట్లచెర్వు. కనుక నూరు నయాపైసలా తెలుగు వాడే. తెలుగంటే అభిమానం ఎందుకు లేకపోతుంది? అతనికి హిందువులన్నా, ముస్లిములన్నా సమానమే. అతని కుటుంబంవారూ అలాటివారే. అతని పరమత సహనానికి పరమేశ్వరుడు కూడా మెచ్చి, పొట్ల చెర్వులో అతడు కట్టించిన మసీదులో మకాం వేశాడట :

"తామరతంపరై సిరుల
దార్కొను కొసలనాటి సత్యచిం
తామణి పొట్లచెర్లను స
తంబగుచుండ నమీనుఖాను డిం
పావహిలంగ నిల్పు బోడ
వై బెడగైన మసీదు గాంచి యం
దే మను నెండికొండపయి
కేగదలంపక వేసికంటియున్."

ఈ బెడగైనమసీదు, "జగమున కవ్వలయైన వెల్గునెయ్యొడలను బొందువారలకు నెక్కగ నిచ్చెన" అట.

ఇబ్రహీం కుతుబుషా తర్వాత గోలకొండ నేలిన మహమ్మదు కుతుబుషా కూడా భాషాపోషకుడే. ఇతని దర్బారులోను తెలుగు సంస్కృత కవులుండేవారు. ఇతడు తన బలం పెరగడానికి హిందువులకుగూడ కొత్త ఊళ్ళిచ్చేవాడు; ఇతర ప్రాంతాల నుంచి పిలిపించి జాగీర్లిచ్చేవాడు. ఇలాటివారిలో దోమకొండ సంస్థానాధిపతులూ ఒకరు. ఈ సంస్థానాధీశుల పూర్వుడు మల్లారెడ్డి గొప్పకవి. ఇతడు షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తర ఖండము—అనే గ్రంథాలు, ఇతని తమ్ముడు ఎల్లారెడ్డి వాసిష్ఠము, లైంగ్యము అనే గ్రంథాలూ రచించారు. మహమ్మదు కుతుబుషా ఆస్థానంలో గణేశుడనే కవి నరుడుండేవాడని మల్లారెడ్డి తెలిపాడు. ఈ నాల్గవ కుతుబుషా కాలంలో గోలకొండకోటలోనే ఉన్నవాడు సారంగు తమ్మయ్య. ఇతడు కుతుబుషా ఆశ్రితుడు, గోలకొండ కరణం.

"ఇనసమతేజులౌ నృపుల
నెల్ల మహమ్మదుశాహి యేలునీ
యెనుబదినాల్గు దుర్గముల
నేలిన యేలిక గోలకొండ త
ద్ఘన నగరస్థలిన్ కరణి
కం బొనరించెడు తమ్మ మంత్రి యా
జనపతి రమ్మ పొమ్మన బ్ర
జల్ జయవెట్ట గృహస్థులౌనన్."

భోగభాగ్యాలనుభవిస్తూ, వైజయంతీవిలాసం వ్రాశాడు.

కుతుబుషాహీలలో కడపటివాడైన అబుల్ హసన్ తానాషా మనకు తానీషాగా చిరపరిచితుడు భద్రాద్రి రామదాసుమూలంగా. ఇతని మంత్రులు అక్కన్న మాదన్నలు. తానాషా మతభేదం లేని సూఫీ. ఇతని కాలంలో ముస్లిములుకూడా హిందువుల పండుగలు పబ్బాలలో పాల్గొనేవారు. ఔరంగజేబు ఇతనిపై దండెత్తడానికి కారణం ఇది కూడా ఒకటట. తానాషా ఔరంగజేబుకు బందీగా చిక్కినప్పుడు పంపిన సందేశం ఆంధ్రజాతి గుండె దిటవుకు అజరామరమైన తార్కాణ. ఈ మహోదాత్తుని గురుపుత్రుడే ఈ శృంగారమంజరీ కర్త బడేసాహేబ్ అక్బర్.

బడేసాహెబ్ గుల్బర్గాలో తన అంత్యదశలో శిష్యసంతతితో నివసించిన బందేనవాజ్ హాజరత్ వంశీయుడు. ఈయన తండ్రి షాహ్ రాజా. ఈయనకు యిద్దరు తమ్ములుండడంవల్ల, ఈయనకు బడేసాహెబ్ అనే పేరువచ్చి ఉంటుంది. స్వయం విద్వద్వంశీయుడు, అబుల్ హసన్ వంటి సరసుడు మిత్రుడు, సహపాఠి కావడంవల్ల బడేసాహెబ్ ఆంధ్ర సంస్కృతాలలో అభిరుచి, అధికారం సంపాదించుకోవడంలో ఆశ్చర్యమేమీ లేదు.

బడేసాహెబ్ సంస్కృత సంప్రదాయానుసారంగా గ్రంథ ప్రారంభంలో రెండు శ్లోకాలతో

గురుం గణపతిం దుర్గాం
వటుకం శివ మచ్యుతం,
బ్రహ్మాణం గిరిజాం లక్ష్మీం
వాణీం వందే విభూతయే.
యదంఘ్రి కమలద్వంద్వం
ద్వంద్వతాప నివారణం,
తారకం విపదాం వందే
తం గురుం ప్రణమామ్యహం."

అని ప్రార్థించి, పిదప తన వంశమూలపురుషుడయిన బందే నవాజ్ హజరత్‌ను

"కింకరనర మధుకర కుల
దత్తమహానంద మకరందే,
బందేనవాజి హజరతి
పదారవిందే సదా వందే"

అని ప్రస్తుతించి, తన వంశవర్ణన చేసుకొని, తను లోగడ ఆంధ్ర భాషలో రచించిన శృంగారమంజరి అనే గ్రంథాన్ని తనే దానికి ఛాయలాగ సంస్కృతీకరిస్తున్నానని చెప్పుకున్నాడు.

"తేనాంధ్రభాషయా యం
రచితః శృంగారమంజరీ గ్రంథః,
స్వయ మకబరేణ భూభృ
న్మకుట మణీరంజితాంఘ్రికమలేన.
తద్విరచితాంధ్రభాషా
కవితాం శృంగారమంజరీచ్ఛాయాం,
సేవస్వం సురవాణి
రచితాం రసతోషితా రసికభృంగాః.

ఇది ప్రధానంగా నాయికానాయక లక్షణని రూపక గ్రంథం. నాయికా నాయకుల లక్షణ నిర్వాచక గ్రంథాలు అంతకుముందునుంచీ ముస్లిం పాలకుల, రచయితల దృష్టిని, అభిరుచిని ఆకర్షించాయి. బడే సాహెబ్ కూడా ఈ ఆకర్షణకు లోబడి, ఆ దోవే తొక్కాడు. ముందున్న ప్రాచీనగ్రంథాలను పెక్కింటిని పరిశీలించి, విషయాలను అవలోడించి, శృంగార మంజరిని రచించానని అవతారికలో ఇలా చెప్పుకున్నాడు:

"రసమంజరీ ఆమోద పరిమల శృంగారతిలక రసికప్రియ రసార్ణవ ప్రతాపరుద్రీయ సుందరశృంగార సరసకావ్య దశరూపక విలాసరత్నాకర కావ్యపరీక్షా కావ్యప్రకాశ ప్రముఖగ్రంథాన్ విచార్య, ప్రాచీన గ్రంథేషు యాని లక్షణాని యుక్తియుక్తాని తాని సంగృహ్య, అన్యాని పరిత్యజ్య, ప్రాచీనోదాహరణానుసారేణ నాయికాభేదాన్ కల్పయిత్వా, తేషాం లక్షణోదాహరణాని కల్పయిత్వా, పూర్వగ్రంథేషు యేషాం లక్షణాని నసంతి తేషాం లక్షణాని రచయిత్వా, యేషా ముదాహరణాని నసంతి తేషా ముదాహరణాని విరచయ్య, యేషాం నామాని నసంతి తేషాం నామాని స్థాపయిత్వా, అయుక్తనామస్థలే యుక్తనామచ స్థాపయిత్వా, విస్తరకరణస్థలే విస్తరం కృత్వా, సంక్షేపకరణస్థలే సంక్షేపం కృత్వా, సర్వస్థలేషు సాధారణ లక్షణానాం సాధారణోదాహరణాని నిర్మాయ, ప్రాచీన లక్షణేషు యాన్యుపయుక్తా న్యుదాహరణాని తాని తత్తన్నాయికాస్థలేషు లిఖిత్వా, చర్చాగ్రంథో గద్యరూపో లక్షణగ్రంథః ఫక్కికా రూప ఉదాహరణ గ్రంథః పద్యరూపః, లక్షణోదాహరణే, నాయికాభేదాః, శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత శాంతాఖ్య నవరసేషు శృంగారస్య ప్రాధాన్యాత్ శృంగార రసాలంబన విభావా నాయికానాయకాః, శృంగార రసానుకూలాః సాత్త్వికభావాః, పూర్వోక్త గ్రంథావర్ణిత పద్మిన్యాదిజాతయః, జాతిసంకరో, జాతిభేదా శ్చైవం సరసాశేషవిశేషా నిరూప్యంతే."

మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులు, మహావిద్వాంసులు అయిన డాక్టర్ వి. రాఘవన్‌గారు దీనికి 116 పుటల విపుల పీఠికవ్రాశారు. దానిలో శృంగార మంజరీకారుడు భానుదత్తుని రసమంజరిని ప్రధానంగా అనుసరించినా పెక్కు సందర్భాలలో మత భేదం ప్రకటించి, సిద్ధాంతీకరించిందీ విస్తృతంగా చర్చించారు. ఈ పీఠికనూ, వీరు సంస్కరించిన మూలాన్ని పరిశీలిస్తే, వీరి బహుముఖ విద్వత్త స్పష్టమౌతుంది. వీరు ప్రతిఅంశాన్ని అతి సమర్థంగా చర్చించారు. వీరు చేసిన మూలసంస్కరణ, వివిధ రచయితలు చేసిన నాయికా నాయకుల లక్షణోదాహరణాల తులనాత్మక పరిశీలన, మూలకారుడు ఉట్టంకించిన అన్యరచయితల వాక్యాలను అధస్సూచికలలో సమగ్రంగా ఉద్ధరించి వ్యాఖ్యానించడం, అదనంగా నోట్సు—ఇవన్నీ వీరి పాండిత్యానికి, పరిశ్రమకు తార్కాణాలు.

బడేసాహెబ్, ఆయన తండ్రి షాహ్‌రాజా చిత్రాలు, వారి సమాధుల ఫోటోలు, నాయికల చిత్రాలూ దీనిలో పొందుపరచబడ్డాయి.

ఈగ్రంథాన్ని విద్వల్లోకానికి అందించిన డాక్టర్ రాఘవన్ గారినీ, ఆంధ్రప్రదేశ్ పురాతత్త్వ శాఖవారినీ అభినందించక తప్పదు. సంస్కృత శృంగారమంజరికి మూలమైన ఆంధ్ర శృంగారమంజరిని పంపా

దించి ప్రకటిస్తే ఆంధ్ర సరస్వతిని అమూల్యమైన ఆభరణంతో అలంకరించినట్లు అవుతుంది. ఆ గ్రంథం తెలంగాణాలోనే లభించవచ్చు. రా. చ.

## శ్రీ కృష్ణలీలావిలాసము

[కర్త: కీ. శే. విద్వత్కవిరాజ శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యులవారు. ప్రకాశకులు: కె. వి. వి. యల్. నరసింహాచార్యులు, ఎం. ఏ. బి. యల్; అడ్వొకేట్, కె. రామచంద్రాచార్యులు గారలు, గుంటూరు. 130 పేజీలు. వెల రు 2-50 న. పై.]

భారతీయసాహిత్యంలో సకల ధర్మకర్మలకు జీవగర్రలుగా సృష్టింపబడిన పాత్రలు శ్రీరామ శ్రీకృష్ణులు. వ్యాసుడు వ్రాసిన పదునెనిమిది పురాణాల్లోనూ కృష్ణునిగురించి అంతో ఇంతో కనబడుతుంది. భాగవతమహాపురాణం, బ్రహ్మపురాణం, విష్ణుపురాణం, మార్కండేయ పురాణం, వరాహపురాణం, వామనపురాణం కృష్ణునిగురించి విపులంగా పలికేవే. మహాభారతంలోనూ హరివంశంలోనూ కృష్ణకథ మరింత విపులంగా ఉన్నది. విష్ణుధర్మోత్తరంలో శ్రీకృష్ణుని సహస్రనామావళి చెప్పబడింది. సాధారణమైన భక్తిభావంకంటె మరికొంత లోతుగా ఆధ్యాత్మికంగా చూచేవారికి నారదపురాణంలోనూ అగ్నిపురాణంలోనూ కృష్ణధ్యాన పూజాద్యాచారములు చెప్పబడిఉన్నవి మంత్రదృష్టిగలవారికి మంత్రభాగవతమున్నది. అంతేకాదు సమ్మోహన తంత్రంలో శ్రీ గోపాలుని సహస్రనామావళి ఉన్నది. మంత్రరత్న మంజూష. మంత్రమహార్ణవము, మంత్రమహోదధి, ప్రపంచసారము, శారదాతిలకము మొదలైన గ్రంథాల్లో కృష్ణుని ధ్యానించుటనుగూర్చి, పేర్లనుగూర్చి కనబడుతుంది.

కృష్ణకథలోని అంతరార్థం ధ్యానపద్ధతి తెలియడానికి కృష్ణోపనిషత్, గోపాలపూర్వతాపినీ ఉపనిషత్, గోపాలోత్తరతాపినీ ఉపనిషత్, వాసుదేవోపనిషత్, గోపీచందనోపనిషత్ వంటి గ్రంథాలూ ఉన్నవి. శ్రీ కృష్ణరూపధ్యానము శ్రీ కృష్ణనామోచ్చారణ చేసినట్లయితే శ్రేయస్సు కలుగుతుందంటుంది కలి సంతరణోపనిషత్. జీవితంలో వచ్చే భావానుభావాలన్నీ చిలుకరించి, చిలుకరించుటేమి వర్షించి,



శ్రీ కృష్ణకథ చెప్పేవానిలో మొట్టమొదటిదిగా చెప్పవలసింది భాగవత మహాపురాణము.

సాధారణంగా పారమార్థికదృష్టిగల పండితులు ఉపాసనామార్గాన్ని అవలంబించి మంత్రతంత్రాల దాకా పోతే పామరులు భక్తిమార్గాన్ని ఆశ్రయించి నిలుస్తారు. పండితులు భక్తులు కావడానికి అడ్డమేమీ లేదు. కాని పామరులకు ఉపాసనామార్గం దూరము. మరి పండితులు భక్తులైనపుడు సాధారణంగా భక్తికావ్యాలు వ్రాస్తారు. అవి పండితపామరుల కందరికి ఆదరపాత్రములై సంతరణోపాయములుగా భాసిస్తాయి. జయదేవుని గీతగోవిందము, కృష్ణలీలాతరంగిణి. భట్టతిరి వ్రాసిన నారాయణీయము సంస్కృతంలో ఇటువంటివి. ఇంక రామకథ, కృష్ణకథ ఎప్పుడో ఎట్లో సందుచేసుకొని తనవని కవి అంటూ ఉంటాడు.

తెలుగులో భక్తికావ్యాల్లో సర్వోత్తమమైనది పోతన్న భాగవతము. ఆ మహానీయుని పేరు చెప్పనిదే మరొకరిమాట ఎత్తకూడదు. భక్తికి పరతత్త్వము మీద దృష్టి. దీనికి దాస్యవాత్సల్యాది సాధనమార్గములు కొన్ని ఉండగా మధురభక్తి మరియొక పెద్ద మార్గము. ఈ సాధనమార్గము లన్నీ జీవితంలోని భావానుభవాలను ఆశ్రయించి పుట్టినవే అనుట సత్యమైన విషయము. కనుకనే భావలోలుపులైన ప్రెగ్గడ వంటి కవులు ఆధ్యాత్మిక దృష్టిని అణచిపెట్టి భావబంధురములైన కావ్యాలు వ్రాసినారు. పోతన్న భాగవతమునను ప్రెగ్గడ హరివంశమునకు కల తేడా కొంచెపాటి దృష్టిభేదమునకు సంబంధించినది. కాని కృష్ణకథను భక్తితో భావించినా, భావదృష్టితో భావించినా [illegible]యము దాని సహజగుణము. కలుగవలసినది సాత్త్వికస్పందము.

ఇట్టి కృష్ణకథను తీసికొని చక్కగా చిక్కగా శ్రీ కృష్ణలీలావిలాసమును పేర వ్రాసినవారు విద్వత్కవిరాజ బిరుదాంకితులు కీ. శే. శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యులవారు, గుంటూరు క్రైస్తవ కళాశాలలో పూర్వ ముపన్యాసకులు. 'కావ్యనాటకాలంకార సాహిత్యములందును వేదవేదాంత న్యాయ మీమాంసా వ్యాకరణాది శాస్త్రములందును, కవనమల్లుటయందును, జ్యోతిషమునందును, ధర్మశాస్త్రాగమములందును' పండితులు.

ఈ కావ్యమున శ్రీ కృష్ణజన్మము మొదలు కంసవధ, దేవకీవసుదేవుల కారాగరవిముక్తివరకు గల కథ చెప్పబడినది. ఆచార్యులవారైదాశ్వాసముల ఈ కావ్యమును భాగవతము యాదవాభ్యుదయము మొదలగు కావ్యముల చాలున తీర్చినారు. అఖండమగు

# గ్రంథ విమర్శనము

ఆయన పాండిత్యము భాషాచ్ఛందస్సులమీది ప్రభుత్వము రచనలో చాలవరకు సంయమము సంపాదించి కొడికి వచ్చినవి. తెలుగుబట్టిన తెలుగు సంస్కృతము బట్టిన సంస్కృతము తీర్చినట్లుగా వ్రాయగల శక్తి వారిది. కావ్యారంభమునగల ఈ లక్ష్మీస్తుతి పద్యమెంత ప్రసన్నముగా నున్నదో చిత్తగింపుడు:

కలుములతల్లి తామర
గర్భమున న్వసియించు చాన చెం
గలువల చెల్మికాని ననుకం
జనియించిన లేమ యచ్చుగల్
గొలువగ బాలవెల్లి హరి
కోసము పుట్టిన దేవి కృష్ణునిన్
విలసిత నేత్రకోణగతి
వీచికి బాత్రము సేయుగ వుతన్.

కవితా స్వభావ మెఱిగిన ఆచార్యులవారు కుకవి నింద చేయుచు వ్రాసిన పద్యాలు గమనింపతగినవి.

ఎఱుగుదు మాంగ్ల భాష యని
యే కద సర్వకవిత్వ తత్త్వవి
స్తరముల కొలవాల మిక
జాలును గావ్యకథా ప్రపంచమే
మఱక లిఖింతుమంచు నిజ
మార్గ సమాగత నీచనాయికా
విరసరతి ప్రసంగభవ
వృత్తము కూర్తు రభావకావ్యమున్!

ఆంగ్ల విద్యావ్యాసంగమునబడి నడచెడు నేటి కవుల కొందఱి నాయన ఇట్లు ఈసడించినను ఆచార్యులవారును ఆంగ్లమున బి. ఏ. పట్టభద్రులనుట జ్ఞాపకముంచుకొన్నచో కవిత్వమునుగూర్చి వారికుండిన వ్యగ్రత వారివివేచన ఇట్టిదని తెలియగలదు. ఆయన అట్లు వ్రాయుటకు కారణమును ఉన్నది.

ఆచార్యులవారిది ధారాళమైన రచన. ఉజ్జ్వలమగు భాష. ప్రాయికముగా సమాసభూయిష్ఠమై ఓజస్విగా నుండును. పదగుంఫనము శబ్దాలంకారము లర్థాలంకారములు తమంత తాముగా కుదురుకొన్నట్లున్నవి. అచ్చటచ్చట పోతనగారుల చాయలు పలుకుబడులు కూడ కాన్పించును. అన్నిటికంటె నెక్కుడుగా వారిపాండిత్యము ముందుకు వచ్చునట్లుండును. అందుచేనీ గ్రంథమున ప్రబంధలక్షణమెక్కువ.

కథను కుదించి వ్రాసినచోట్ల సాధారణముగా రెండు చిక్కులున్నవి. రామకథ కృష్ణకథలలో నివి మరియు నెక్కువ—మొదటిది కథాగతి (tempo) చటులమైపోవుట. అయిన నేమియు తప్పులేదు గాని రామాయణ భాగవతములు చదివి ఆ విపుల రచనలలో మనసు ఆడేనవారికి ఇచట భావసంచారమునకు కావలసిన విస్తృతి తగ్గిపోవును. దీనితో ఒక అసంతృప్తి ఏర్పడు భయావకాశమున్నది. రెండవది కవికే పాత్రల భావకోశము ప్రవేశించి తీర్చ నవకాశము చాలక పోవుట. ఒక్కొక్క ఘట్టమునగల విస్తృతికి తగినట్లు గనే కవి భావస్పందము కలిగింపగలడుగదా.

ఆచార్యులవారిది, నాకు చూడగా, తత్త్వదృష్టి—శాస్త్రదృష్టి. కొంతవరకే భావదృష్టి కాని ఎఱ్ఱనాగులవలె అంతయు కాదు. ఈ కావ్య మాద్యంతము జరిగినపిదప ధర్మము నడపుట కవతరించిన అఖండమగు వైష్ణవ తేజము విజృంభించుటయే సంతరించబడినట్లు తోచును. బహుశః కథతో సంబంధము లేక ఆచార్యులవారి మనసులో మెలగిన భక్తితత్త్వగమైన ఆ భావమిట్టిదే నేమో అనుకొందును. అంతమాత్రమున భావప్రమితమైనరచన ఆయన చేతిలో కొఱవడునా?

ఇదే సమయమున సంస్కృతమున వెలువడిన మఱియొక కృష్ణకథా కావ్యమును చెప్పవలసియున్నది. ఆచార్యులవారికిని ఆ గ్రంథకర్తకును చాల పోలికలున్నవి. కృష్ణోల్లాసమను ఆ చంపూకావ్యమును వ్రాసినవారు మునుపు మైసూరు విద్యాశాఖయందుండిన శోలీయులు, గొప్ప పండితులు, బహుభాషావేత్తలు నగు క్రీ. శే. పి. ఆర్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1940 సం॥న తెలుగు నేర్చుకొని పోతన భాగవతము, శ్రీనాథుని కావ్యములు, వేమన పద్యములు చదివిరట. శాస్త్రిగారి కృష్ణోల్లాసమున పోతన్న ప్రభావ మెంతమాత్రమున్నదో నిదానముగా పండితులు పొరజూడవలసినపని. మృష్టభక్షణ, మందలి ఒక శ్లోకము నుదాహరింతును.

'సత్యం కిం యది మే వదన్తి వటుకా
జగ్ధివాన్ మృత్తికాం కిం?'
'అంబ మే శపథం త్యతథ్య మిహ
తన్మా ప్రతీహి వ్యమేతాన్,
పశ్యేదం వదనం న విశ్వసిషి చే'
దిత్యుక్త్వా స్వవక్త్రం
వ్యాదాయాత్ర సమస్తలోక వితతిం
దర్శయామాస కృష్ణః.

కృష్ణోల్లాసముగూడ శ్రీకృష్ణలీలావిలాసమువలె పరిమితావధిగ వ్రాయబడిన దగుటచె దానిని గూడ స్మరించితిని. కృష్ణలీలావిలాస ముత్తమ కావ్యమనుటకు సందేహము లేదు. ఈ కావ్య మాంధ్రప్రభుత్వాస్థానకవులు, మహామహోపాధ్యాయేత్యాది బిరుదాంకితులు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి కంకితము. ఎస్. కె.

---

## సుందర భారతయాత్ర 2 వ భాగము

ఇందు తూర్పు, మధ్యప్రదేశం, దక్షిణం, కాశ్మీర్, సిలోన్ భాగములు గలవు. వందలాది క్షేత్రములు నదీనదములు, చారిత్రక విషయములు కలవు. మేపు, చిత్రపటములు 176. పేజీలు 391. వెల : రు 2-8. పోస్టేజి 0-15-0. సాధన గ్రంథమండలి, తెనాలి.

# వార్తలు

## కేరళలో రాష్ట్రపతిపాలన

కేరళంలో కొన్ని నెలలపాటు జరిగిన ప్రతిపక్షోద్యమం కారణంగా జూలై 31 వ తేదీతో కమ్యూనిస్టుల పాలన అంతమైంది. రాజ్యాంగంలో 356 వ సూత్రం ప్రకారం రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ రాష్ట్రాధికారాలను స్వాయత్తం చేసుకున్నట్టు ప్రకటించారు.

## సాహిత్య అకాడెమీ ప్రాంతీయ కార్యాలయం

ఆగస్టు నెలలో న్యూఢిల్లీలో జరిగిన కేంద్ర సాహిత్య అకాడెమీ ఆర్థికసంఘం సమావేశంలో కేంద్ర అకాడెమీ ప్రాంతీయ కార్యాలయం మద్రాసులో ఏర్పాటు చేయాలని నిర్ణయించబడిందని కేంద్ర మంత్రి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు హైదరాబాద్‌లో ఒక సమావేశంలో తెలియజేశారు.

## సామెతలు, నుడికారాలు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ యాజమాన్యాన సిద్ధపరచబడిన 'సామెతలు' 'నుడికారాలు' అనే రెండు సంకలనగ్రంథాలను ఆగస్టులో హైదరాబాద్‌లో జరిగిన సభలో ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆవిష్కరించారు. ఈ సమావేశానికి కేంద్ర మంత్రి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

## సంస్కృత విశ్వపరిషత్తు ఉపసంఘం

సంస్కృత విశ్వపరిషత్తు కార్యవర్గం ఆగస్టు నెలలో ఢిల్లీలో సమావేశమై పాఠశాలలలో సంస్కృతబోధననుగురించిన వివరాలు సేకరించి కేంద్రప్రభుత్వానికి తెలుపడానికి శ్రీయుతులు కె. ఎం. మున్షీ, మాడభూషి అనంతశయనం అయ్యంగారు, బి. పి. సిన్హా, జె. హెచ్. దవే సభ్యులుగా ఒక ఉపసంఘాన్ని నియమించింది.

## రాజకీయగ్రంథాల ఆవిష్కరణ

రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఆగస్టులో హైదరాబాద్‌లో 'తెలుగు అకాడెమీ ఆఫ్ సైన్స్ అండ్ హిస్టరీ'కి ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో లోక్‌సభ స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగారు రచించిన "మన పార్లమెంటు", ఆంధ్ర అసెంబ్లీ స్పీకరు శ్రీ కాళేశ్వరరావుగారు రచించిన "ఈజిప్ట్, అరబ్ జాతీయత చరిత్ర", శ్రీ దిగవల్లి సాంబశివరావుగారు రచించిన "ఆఫ్రికా జాతీయ పోరాటం" అనే మూడు గ్రంథాలను రాష్ట్రపతి ఆవిష్కరించారు.

## ఆర్థర్ కాటన్ చిత్రపటావిష్కరణ

హైదరాబాద్‌లోని ఆంధ్రప్రదేశ్ ఇంజనీర్ల సంస్థ కార్యాలయంలో ఆగస్టు నెలలో సర్ ఆర్థర్ కాటన్ చిత్రపటాన్ని బ్రిటిష్ హై కమీషనర్ ఆవిష్కరించాడు. ఆర్థర్ కాటన్ గత శతాబ్దంలో ఆంధ్రలో నాలుగు ఆనకట్టలు కట్టించిన మహనీయుడు.

## భాక్రానంగల్ ప్రమాదం

భాక్రానంగల్ ప్రాజెక్టులో హాయిస్ట్ చేంబర్‌కు ప్రమాదం కలిగి మళ్ళింపు కాలువలనీరు గాలరీ, ఇన్‌స్పెక్షన్ కాలవలు, విద్యుత్కేంద్రాలు—వీటిలో చొచ్చుకొని రావడంవల్ల ఒక ఓవర్‌సీరు, ఎనిమిది మంది పనివారు దుర్మరణం పాలయ్యారు. హాయిస్ట్ చేంబర్ దెబ్బతినడం ప్రాజెక్టుకు గట్టిదెబ్బ అని అధికార ప్రకటన వెలువడింది.

## గవర్నర్ ఫజల్‌ఆలీ మృతి

అస్సాం గవర్నర్ శ్రీ సయ్యద్ ఫజల్ ఆలీ ఆగస్టు 22 వ తేదీన మరణించారు. ఈయన వయస్సు 73 సంవత్సరాలు. ఈ సంవత్సరమే ఈయన ప్రజాసేవకు ప్రశంసాచిహ్నంగా భారతప్రభుత్వం 'పద్మవిభూషణ' బిరుదం ఇచ్చి గౌరవించింది. ఈయన ఇదివరకు పాట్నా హైకోర్టు ప్రధానన్యాయమూర్తిగాను, సుప్రీంకోర్టు న్యాయమూర్తిగాను పని చేశారు.

## కృశ్చేవ్ అమెరికా పర్యటన

సోవియట్ ప్రధాని శ్రీ నికితా కృశ్చేవ్ సెప్టెంబర్ 15 వ తేదీనుండి 27 వ తేదీవరకు అమెరికాలో పర్యటన చేస్తారు. 18 వ తేదీన ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో ప్రసంగిస్తారు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad